# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

## కథలు



మూడవ సంపుటం

# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

# కథలు

## 3

మూడవ సంపుటం




విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

Sripada Subrahmanyasastri Kathalu - Vol-III

ప్రచురణ నెం. : 2152

వి.పి.హెచ్.
ప్రథమ ముద్రణ : నవంబరు, 1992

ద్వితీయ ముద్రణ : జూలై, 1999



వెల: రూ. 100-00



ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001

విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్/సుల్తాన్ బజార్ - హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

ముద్రణ: కళాంజలి గ్రాఫిక్స్ విఠల్‌వాడి, హైదరాబాదు. ఫోను : 3229831

# మాండలిక లోకవృత్తాన్ని నాటకీకరించిన జాతికథకుడు

శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి (1891–1961) రచనా వ్యక్తిత్వం రూపు దిద్దుకున్న కుటుంబ వాతావరణమూ, ప్రాంతమూ, కాలమూ సంశ్లిష్టమైనవి. ఆయన కుటుంబ వాతావరణం వైదిక పండిత సంప్రదాయానికీ, విశ్వాసాలకూ సంబంధించింది. పుట్టి పెరిగిన ప్రాంతం, చాలా వరకు కుల విద్యలకూ, కావ్య పారాలకూ, సంస్కృత సంస్కృతికీ నిలయమైన గోదావరి పరీవాహిక ప్రాంతం. రచనా వ్యక్తిత్వం దాదాపు స్థిరపడిన కాలం, కొంచెం అటు ఇటుగా రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలం.

ఈ స్థలకాలాలను స్థూలంగా పరికిస్తే, సాంఘిక సాంస్కృతిక కళారంగాల్లో ఆధునిక సంస్కారభావాలూ, ఆర్థిక రంగంలో వాణిజ్య దృష్టీ, ధనప్రాముఖ్యమూ కన్పిస్తాయి. సూక్ష్మంగా పరిశీలిస్తే, అన్ని రంగాల్లోనూ విరుద్ధశక్తులు ఘర్షణ పడుతున్నాయి; రాజీ పడుతున్నాయి; సహజీవనం సాగిస్తున్నాయి. "ప్రాతిపదికలకు భంగంలేని గమ్యం"లో అవిచ్ఛిన్నంగా సాగిపోతున్నాయి.

వలసపాలన ఫలితమైన ఇంగ్లీషు భాష ద్వారా కొత్త చదువులు ప్రవేశించాయి. కొత్తభాషా సాహిత్య సంస్కారం వచ్చింది. కొత్తభావ వినిమయం జరిగింది. బ్రిటిష్ పారిశ్రామిక నాగరికత సబ్బుల్నీ, పౌడర్లనూ, రేజర్లనూ, సరికొత్త ఇతర వినియోగ వస్తువులనూ, సరికొత్త క్రీడలనూ అందించింది. బ్రిటిష్ పాలనా యంత్రాంగం కోర్టునూ, ప్లీడర్లనూ, వ్యాజ్యాలనూ ప్రసాదించింది. దేశవాళీ జీవితంలో మడీ మశానమూ, ఉపనయనాలూ, పంచశిఖలూ, ఘటశ్రాద్ధాలు, బాల్య వివాహాలూ, విధవల్ని ఆకర్షించి తగులుకొని, వాళ్ళ ఆస్తులకు ఎసరు పెట్టడాలూ, భ్రూణ హత్యలు చేయించే పరిస్థితులకు నెట్టడాలూ, మంత్ర శక్తులున్నాయనుకుంటూ పంచగవ్య ప్రాశనలు, చాంద్రాయణాలు చేయించడాలూ, ఇతర అగ్రవర్ణాచారాలూ, విశ్వాసాలూ కావలసినన్ని కన్పిస్తాయి. హరికథలు, సాంతసాని భామాకలాపాలు, నాటకాలు, సినిమాలు కలగాపులగంగా తెలుగు కళారంగాన్ని ఏలుతున్నాయి. అగ్రవర్ణ దురహంకారమూ, అగ్రకుల స్వార్థరాజకీయాలు సృష్టించిన దుర్భర దళిత జీవితం ఉంది. ఈ కంగాళీ మధ్య బాల్య వివాహాలపట్ల, కన్యాశుల్కం పట్ల, అడపా దడపా వరశుల్కం పట్ల నిరసన దృష్టి కాపురం చేస్తోంది; విధవా వివాహాలు, వేశ్యావృత్తి నిర్మూలన, స్త్రీవిద్య, శాఖా, కుల, మత, దేశాంతర వివాహాల విషయంలో; స్త్రీ విద్య, స్త్రీల హక్కుల విషయంలో; సంస్కరణ దృష్టి సంసారం చేస్తున్నాయి; పౌరపాలన నీతిమంతంగా ఉండాలనే వాంఛా, వలసవాద వ్యతిరేక ప్రజాస్వామిక భావాలూ, వామపక్షభావాలూ ఈ కంగాళీ మధ్యనే ఈ సమష్టి కుటుంబంలోనే ఉన్నాయి.

ఈ పరిస్థితుల్లో – ఈ విరుద్ధ సంస్కారాల మధ్య – గురజాడ (1862–1915) అనంతర తరం రచయితలు ఆయన ఆధునిక దృష్టిని పూర్తిగా అందుకోలేకపోయినా, వీరేశలింగం పంతులు సంస్కరణ భావాలకు సన్నిహితంగా కన్పిస్తారు. సంస్కరణోద్యమం ఊపుకు మురిసిపోయి, గాలివాటుగా కొందరు రచనలు చేశారు. వాళ్ళలా కాకుండా ఆ ఉద్యమంలోని పరిమిత లక్ష్యాలను – ఒక్క వేశ్యల విషయంలో తప్ప – నమ్మిన సాహిత్యకారుడు శ్రీపాద. ఆయన కందుకూరి మార్గంలో బహుముఖంగా రచనలు చేశారు. పండితుడిగా, పద్యకావ్య రచయితగా, విమర్శకుడుగా, చారిత్రక నాటకకర్తగా, శ్రవ్య నాటక కర్తగా, సాంఘిక నాటక, నాటికా రచయితగా, నవలాకారుడుగా, కథారచయితగా, అనువాదకుడుగా, వైద్యగ్రంధకర్తగా, వాచక రచయితగా, పత్రికా సంపాదకుడుగా, పాత్రికేయుడుగా, స్వీయ చరిత్రకారుడుగా శ్రీపాద తమ బహుముఖ సాహిత్య వ్యక్తిత్వాన్ని చాటుకున్నారు.

శ్రీపాద రచనా వ్యాసంగం గురజాడ, కందుకూరి జీవిస్తున్న కాలంలోనే మొదలైంది. ఒక చాటు ప్రబంధం ఆధారంగా ఆయన 'వారకాంత' అనే నాటకాన్ని 1909లో రాసి, ప్రకటించారు. కన్యాశుల్కం వంటి ఆధునిక తెలుగు నాటకం నుండి ప్రేరణ పొందక, ఒక చాటు ప్రబంధం నుండి ఉత్తేజం పొందడంలోనే శ్రీపాద రచనా వ్యక్తిత్వంలోని పరిమితులు అర్థమవుతాయి. సాహిత్యంలో అప్పటికే ఉండిన పురోగామి వస్తురూపాలను ఆయన వెంటవెంటనే యౌవనదశలో కూడా గ్రహించలేకపోయారు. పద్యకావ్యాలు రాశారు. భావ కవిత్వ వస్తురూపాలకు దూరంగానే ఉన్నారు. చారిత్రక రచనలు చేశారు. చారిత్రక వాస్తవికతకు దూరంగానే ఉన్నారు. ఆయన చారిత్రక రచనల్లో మనకు కన్పించేది రసదృష్టి, "ఇతరుల జాతీయతలు మన జాతీయత మీద దెబ్బ కొట్టడాని కవకాశం యివ్వకూడద"నే కాల్పనిక జాతీయవాద స్వాతిశయమూ. ఇట్లాంటి పండిత సంస్కారమున్న శ్రీపాద, తెలుగు భాషా ప్రచారకుడుగా మారి, వచనంలో చాలా కృషి చేశారు. ఈ కృషి వల్ల భావకవులను తోసిరాజని వాస్తవికతకు చేరువయ్యారు. దీనివల్ల ప్రేమను ఒక అమలిన వ్యవహారంగా, అమూర్త పదార్థంగా ఆయన చూడలేదు. గతమంతా పునరుత్థానం కావాలని విశ్వనాథ సత్యనారాయణ లాగా చాటలేదు. బాపిరాజులాగా కాల్పనికావేశంలో కొట్టుక పోలేదు. చలం లాగా ఉప్పెన మాదిరి విరుచుకపడలేదు. వచన సాహిత్యంలో అభ్యుదయోద్యమం తల ఎత్తటానికీ, బలపడటానికీ పరోక్షకారకుడయ్యారు. ఆ ఉద్యమంలో మమైక్యం చెందకపోయినా – కొడవటిగంటి కుటుంబరావు వంటివారి మార్గాన్ని సుగమం చేశారు.

శ్రీపాదలోని ఈ అంశాలన్నిటికీ బలమైన మూలాలున్నాయి. అవి:1. ఆయనది పరళమైన గ్రామీణ మనస్తత్వం, 2. ఆయనవి మాండలిక జీవితానుభవాలు, 3. ఆయనకు జాతీయోద్యమంలోని భాషా రాజకీయాలతో కుల రాజకీయాలతో పేచీ ఉంది, 4. ఆయనది "వైదిక విద్యలన్నీ విడిచిపెట్టి కొత్తదారి" తొక్కగలిగిన ఆత్మశక్తి, 5. ఆయనకు "లోకవృత్తం సూక్ష్మాతి సూక్ష్మంగా పరకాయించుకుంటూ వుండాల"నే ఆర్తి ఉంది, 6. (తెలుగుభాష) ప్రయోగ విజ్ఞానమంతా స్త్రీల వల్లనే

"అలవడింద"నే భాషా పరిశీలక దృష్టి ఉంది. ఈ మూలాలవల్ల భావాల్లో వీరేశలింగానికి సన్నిహితుడయ్యారు. భాష విషయంలో గురజాడకు చేరువయ్యారు.

వీరేశలింగం చేపట్టని కథా రచనను శ్రీపాద చేపట్టినప్పటికీ, గురజాడకంటే భిన్నమైన మార్గాన్ని కథా రచనలో అనుసరించారు. నాటక పాండిత్యం నుండి, నాటక రచనానుభవం నుండి, బ్రాహ్మణ మేధస్సుకు సంబంధించిన మాటకు మాట అందించగలిగే జ్ఞానం నుండి, చదువులనుండి, పలుకుబడుల నుండీ, దేశీయమైన కథా వారసత్వం నుండి, లోకజ్ఞత నుండి, సూక్ష్మ పరిశీలనాశక్తి నుండి, చిత్తశుద్ధి నుండి ఉత్తేజాలు పొంది, తనదారిని ఏర్పరచుకున్నారు. ఈ దారిలో వాస్తవికత అనివార్యమైంది. అందువల్ల సమస్య చిత్రణలో కొన్ని చోట్ల గురజాడ వారసత్వాన్ని కొనసాగించ గలిగారు. "ఇలాంటి తవ్వాయి వస్తే...?" (1934) గురజాడ కథా వారసత్వానికి కొనసాగింపే. అయితే గురజాడ వాస్తవికతలోని సంస్కరణ దృష్టీ, విమర్శనాత్మక దృక్పథమూ, అభ్యుదయాంశ శ్రీపాద కథల్లో పూర్తిగా ఉన్నాయని చెప్పలేము. శ్రీపాద చాలా వరకు సంస్కరణ వాస్తవికతను దాటి ముందుకు వెళ్ళలేకపోయారు. చారిత్రక రచనల విషయంలోనయితే వీరగాథల్ని దాటిన వాస్తవికతను ప్రదర్శించలేకపోయారు. గురజాడకున్న విశాలమైన ఆధునిక భాషా సాహిత్య సంస్కృతుల అవగాహనా, చారిత్రక దృష్టీ, మొక్కవోని ప్రజాస్వామికదృష్టి శ్రీపాద అంది పుచ్చుకోలేక పోయారు. కానీ ఆయన తన కథాసాహిత్య రచనల ద్వారా సాధించిన వాస్తవికత, తెలుగులో వాస్తవికతావాదం బలపడటానికి ఎంతో దోహదం చేసింది. ఈ సంపుటిలోని కొన్ని కథలు అందుకు దృష్టాంతం.

ఈ సంపుటంలో 12 కథలున్నాయి. ఇవన్నీ 1929–1948 మధ్యకాలంలో వెలువడినవి. గోదావరీ ప్రాంత గ్రామాల్లో, పట్టణాల్లో వచ్చిన సాంఘిక, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక, కళారంగ పరిణామాలను ఈ కథల్లోని సామాజికాంశాలు విశ్లేషణ ద్వారా మనం గ్రహించవచ్చు. సమాజ శాస్త్రజ్ఞులకూ, సామాజిక భాషా శాస్త్రజ్ఞులకు ఈ కథల్లో ముడిసరుకు చాలా దొరుకుతుంది. బ్రాహ్మణాగ్రహారం (1934–35)వ ఇలాంటి తవ్వాయివస్తే...? (1934), గుర్రప్పందాలు (1948) మన సమాజ నాణేనికి బొమ్మా, బొరుసూ, అంచూ అని మనకు తెలుస్తుంది. బ్రాహ్మణాగ్రహారాల్లో సకల సనాతన ధర్మాలూ వికృతమయ్యాయి. తప్పు చేసినవాళ్ళను శిక్షించి, కాని కూడు తిన్నవాళ్ళకు కిలుం వదిలించి, పశ్చాత్తాప పడ్డవాళ్ళను ప్రాయశ్చిత్తం పేరుతో శుద్ధి చేసి, ఉద్ధరించి, వచ్చిన డబ్బుతో వడ్డీ వ్యాపారం చేసే ధర్మం నాలుగు పాదాల మీదా నడుస్తోంది – రూపమేదో సారమేదో తెలియని స్థితిలో, సమష్టి కుటుంబాల్లో పెద్దల పెత్తనం ఇరుకున పడింది. యువతీ యువకులు కొత్త దాంపత్యధర్మాల అన్వేషణలో, సాధనలో ఉన్నారు. ఉద్యోగమనేది నిరుద్యోగ యువకులకు గుర్రప్పందెమయింది. గ్రామాల్లో అగ్రవర్ణాలు విధించిన కట్టుబాట్ల పునాదులకు మోసం వచ్చింది. కుల మత రాజకీయాల చిచ్చుల్లోకి నెట్టినా, దళితులు సమీకృతులవుతున్నారు. కథల్లోని ఈ పరిణామాలు ఆ తర్వాత ఏ రూపాలు తీసుకున్నాయో, ముందుముందు ఏ రూపాలు తీసుకుంటాయో ఆలోచించ గల శక్తిని ఈ కథలు సమకూరుస్తాయి.

"బ్రాహ్మణాగ్రహారం" పరాన్న జీవుల చిత్రణ. "ఇలాంటి తవ్వాయివస్తే...?" తాగేనీటికోసం దళితుల తిరుగుబాటు చిత్రణ. గుర్రప్పందాలు ఉద్యోగులకోసం నిరుద్యోగ యువకుల అమానుషమైన పోటీ చిత్రణ. జాగ్రత్త పడవలసిన ఘట్టాలు (1934), తల్లి ప్రాణం (1935), కూతుళ్ళ తల్లి (1934), ముళ్ళ చెట్టూ కమ్మని పువ్వ్వాను (1930), యావజ్జీవం హోష్యామి (1931), షట్కర్మయుక్తా (1931), నాటకం (1935). కుటుంబ కేంద్రక చిత్రణలు. క్రొత్తచూపు (1948) యువతీయువకుల నూతన వ్యక్తిత్వ చిత్రణ. ఈ సంపుటంలోని రాచపీనుగు తోడులేకుండా వెళ్ళదు (1929) ఒక్కటే పూర్వసంస్థానాల వీరస్మరణ చిత్రణకు సంబంధించింది. క్షత్రియుల సాహస త్యాగాలను శ్రీపాద ఈ కథలో రసదృష్టితో, జాతీయవాదకాలపు కాల్పనికావేశంలో చూశారే తప్ప, పుత్రుణ్ణే నరికే అధికారమున్న పితృస్వామిక విలువల్ని ప్రశ్నించలేకపోయారు. దాసి వెంకటలక్ష్మి పాలు తగలటం వల్ల క్షాత్రం విరిగిపోయిందన్న మూర్ఖ విశ్వాసాన్ని ఖండించలేకపోయారు. ఒక రకంగా పిల్లల కథలాగా సాగిన యీ వీరగాథ గోత్రనామ స్మరణకూ, నవాబులు, క్షత్రియుల మైత్రీ స్మృతికీ తోడ్పడేదే గానీ, ఒక్క పిసరు ఆధునిక సంస్కారాన్ని ఇవ్వలేదు. ఈ సంపుటంలోని కథల్లో చలనశీల ఇతివృత్తం ఉన్న కథలు– కొత్త చూపు, తల్లిప్రాణం, ఇలాంటి తవ్వాయి వస్తే...? మాత్రమే.

శ్రీపాద కథల శిల్ప పరామర్శ, కథల్లో ఆయన వాడిన భాషాశైలుల విశ్లేషణ సాహిత్యాంశాల పరిశీలనలో ముఖ్యమైనవి. శ్రీపాదే ఒక సందర్భంలో కొడవటిగంటి కుటుంబరావుతో అన్నట్లు ఆయన కథ మొదలు పెడితే 40 పేజీల దాకా సాగుతుంది. కాబట్టి ముందుగా ఆయన కథల పరిణామాన్ని గురించి చెప్పకోవాలి. ఈ సంపుటంలోని కథల పరిమాణాలు అచ్చులో–కొత్తచూపు (44 పేజీలు), గుర్రప్పందాలు (29 పేజీలు), జాగ్రత్తపడవలసిన ఘట్టాలు (12 పేజీలు). తల్లిప్రాణం (63 పేజీలు), కూతుళ్ళతల్లి (16 పేజీలు), ముళ్ళ చెట్టూ కమ్మని పువ్వ్వామా (10 పేజీలు), యావజ్జీవహోష్యామి (36 పేజీలు), షట్కర్మయుక్తా (17 పేజీలు), నాటకం (16 పేజీలు), రాచపీనుగు తోడులేకుండా వెళ్ళదు (12 పేజీలు), ఇలాంటి తవ్వాయి వస్తే (36 పేజీలు), బ్రాహ్మణాగ్రహారం (29 పేజీలు), వీటిలో అతిపెద్ద కథ తల్లిప్రాణం. అతిచిన్న కథ ముళ్ళచెట్టున్నూ కమ్మని పువ్వ్వామా. ఆధునిక కథాశిల్పాన్ని నిర్ణయించే ప్రధానమైన సాహిత్యాంశం నిడివా? క్లుప్తతా? ఇతర సాహిత్యాంశాలున్నాయా? ఈ ప్రశ్నలు ఈ సందర్భంలో తల ఎత్తుతాయి.

ఆధునిక కథానికలోని పదాల సంఖ్యనో, వాక్యాల సంఖ్యనో, పేజీల సంఖ్యనో ఒక సగటు పరిమాణంగా మాత్రమే గ్రహించాలి. శిల్ప విషయంలో ఈ సాంఖ్యక వివరాలు నిర్ణయాకాంశాలు కావు. ఇతివృత్త పరిమాణం, పత్రికల్లోని అచ్చుజాగా కథానికా పరిమాణాన్నీ, రూపాన్నీ ప్రభావితం చేసినమాట నిజమే. కానీ తెలుగులో కథానిక / కథ, పెద్దకథ అనే రచనలమధ్య రూపభేద నిర్ణయం ఖచ్చితంగా జరగలేదు. దీనికి తోడు నవలిక అనబడే చిన్న నవలలు, అనుబంధ నవలలు, పిల్ల కంగారు (పెద్దకంగారు మృగం తన కడుపుతిత్తిలో పిల్ల కంగారును దాచుకున్నట్లు) నవలలు వచ్చాక పెద్ద కథకు, చిన్న నవలకు మధ్య ఉండే

సరిహద్దులు చెరిగిపోయాయి. రెండూ సీరియల్‌గా వచ్చిన సందర్భాలు కూడా ఉన్నాయి. అట్లాగే చిన్న నవలకూ, నవలకూ మధ్య కూడా ఈ సరిహద్దులు చెదిరిపోయాయి. శ్రీపాద, కుటుంబరావు, కాళీపట్నం వంటి కథకులు రాసిన కొన్ని పెద్ద కల్పనా సాహిత్య రచనలను కథానికలుగా తీసుకోవచ్చా లేదా అనేదే అసలు సమస్య (ఈ సంపుటంలోని వాటిల్లో 63 పేజీలు సాగిన రచన తల్లిప్రాణం, కుటుంబరావు రాసిన ఆడజన్మ, నీకేం కావాలి, లేచిపోయిన మనిషి, కురూపి పెద్ద రచనలు. కాళీపట్నం రాసిన యజ్ఞం, చావు; ఇటీవలి ఆయనే రాసిన సంకల్పం పెద్దవే. గురజాడ మీపేరేమిటి పెద్ద రచనే.) శ్రీపాద విషయంలో ఇది తేల్చవలసిన సమస్య.

పరిమాణంతో నిమిత్తం లేకుండా, కథానికా రూపాన్ని రెండు శిల్పాంశాలు నిర్ణయిస్తాయి. అవి: 1. ఇతివృత్త పరిణామం, 2. పరాకాష్ఠ పొందవలసిన ఏకైక సాంద్ర స్పందన (culmination of single concentrated emotion. దీన్నే రా.రా. ఏకరస వ్యంజకత్వం అన్నారు.) ఈ రెంటికీ మధ్య అన్యోన్య సంబంధం ఉంటుంది. పరాకాష్ఠ పొందవలసిన ఏకైక సాంద్రస్పందనే శిల్ప నిర్ణాయకాంశం. ఎందుకంటే, పరిమాణంలో, విస్తృతిలో, వ్యాప్తిలో తప్ప నవలలకు కథానికకు ఇతివృత్తం పరిమాణంలో భేదంలేదు కాబట్టి. (కథాంగాలూ, నవలాంగాలూ దాదాపు ఒకటే కూడా.)

నవలేతి వృత్తంలో సంఘటనలు, సన్నివేశాలు, ఉపాఖ్యానాలు ఎక్కువగా ఉంటాయి. వీటిని బట్టి ఇతివృత్త పరిణామం విస్తారంగా వ్యాప్తి చెందుతుంది. కథానికలో ఇవి పరిమితంగా ఉంటాయి. పరాకాష్ఠ పొందవలసిన ఏకైక సాంద్ర స్పందనకు అనుగుణంగానే, అవసరమైన వరకే ఏకోన్ముఖంగా సాగుతాయి. ఈ శిల్పసాధన విషయంలో యూరోపియన్ కథా రచయితలకూ, ఆఫ్రో ఆసియా దేశాల కథారచయితలకు మధ్య భేదముంది. ఆఫ్రో ఆసియా దేశాల జాతీయ సాహిత్యాల్లో వేలాది సంవత్సరాలు మౌఖిక కథాసంప్రదాయం ఉంది. వాటిలో ఆదునికత మూలంగా వచ్చిన కథానిక మీద కూడా ఏదో ఒక స్థాయిలో కథా వారసత్వ ప్రభావం ఉంటూనే ఉంది. యూరోప్ దేశాల్లోని అధునికతకూ, ఆఫ్రో ఆసియా దేశాల్లోని అధునికతకూ మధ్య ఉండే తేడాలు కూడా సాహిత్యరూపాల్లో ప్రతిఫలిస్తున్నాయి. దీనివల్ల, యూరోపియన్ అధునిక కథానికా సంప్రదాయాలను జీర్ణించుకున్న ఏ కొద్దిమంది రచయితల విషయంలోనో తప్ప, ఆఫ్రో ఆసియాదేశాల్లోని కథానికరచయితల్లో అత్యధికుల కథానికా శిల్పం ఒకరకంగా జాతీయమైంది. అధునిక భారతీయ సాహిత్యాల్లో కథానికా శిల్పం మీద అటు మౌఖిక కథావారసత్వ ప్రభావమే కాకుండా కనీసం వెయ్యి సంవత్సరాలకు పైబడి వస్తుగత లిఖిత కావ్యసంప్రదాయ ప్రభావం కూడా ఉంది.

"శాస్త్రిగారి రచనలకు చిన్న కథ, పెద్ద కథ, నవల అన్న మాటలు వాడటం అనవసరమేమో వాటి శిల్పాలను ఆయన ఏనాడూ పట్టించుకోలేదు..." మనం టెక్నిక్ అనేది ఆయన పాటించలేదు. ఆయన దృష్టిలో రచన చెయ్యటమంటే ఒక విందుభోజనం సిద్ధం చెయ్యటం లాంటిది. అందులో ప్రతి మాటా, ప్రతి వాక్యమూ, ప్రతి వివరమూ రుచ్యంగా ఉండాలి. ఇది కూడా ఫ్యూడల్

సంస్కృతికి చెందిన దృక్పథమే అనుకుంటాను... "ఆంగ్లమానస పుత్రులు రాసిన సాహిత్యం కన్న ఆయనది చాలా విలువైనది" అని శ్రీపాద కథాశిల్పాన్ని గురించి కొడవటిగంటి కుటుంబరావు వ్యాఖ్యానించారు.

టెక్నిక్ పాటించలేదా? ఏరకంగా ఆయన సాహిత్యం విలువైంది? జవాబులకోసం ఈ సంపుటంలోని కథల్నే తీసుకుందాం. వీటి కథా నిర్మాణాలను పరిశీలిద్దాం. ఈ సంపుటంలోని రచనల్లో రెండు రకాల నిర్మాణాలు కన్పిస్తున్నాయి. ఒకరకం కథనం తక్కువగా ఉండి, సంభాషణలపాలు ఎక్కువగా ఉన్నవి. రెండోరకం అచ్చంగా సంభాషణాత్మకాలు. మొదటిరకం కిందికి ఆరు కథలు చేరతాయి. అవి: కొత్త చూపు, గుర్రప్పందాలు, తల్లిప్రాణం, రాచపీనుగు తోడులేకుండా వెళ్ళదు, నాటకం, ఇలాంటి తవ్వాయి వస్తే...? వీటిలో సర్వసాక్షి కథనమే ప్రధానంగా కన్పిస్తుంది. రెండోరకం కిందికి ఆరు కథలు చేరతాయి. అవి: జాగ్రత్తపడవలసిన ఘట్టాలు, కూతుళ్ళుతల్లి, ముళ్ళ చెట్టున్నా కమ్మని పువ్వ్వానూ, యావజ్జీవం హోష్యామి, షట్కర్మయుక్తా, బ్రాహ్మణాగ్రహారం. వీటిలో పాత్రల మనః ప్రవృత్తి చిత్రణ సంవాద రూపంలో సాగింది. ఈ ఆరూ స్కెచ్ నిర్మాణం కంటే శ్రవ్యనాటికల నిర్మాణానికి దగ్గరగా ఉంటాయి. వీటిలో ప్రదర్శనీయ నాటక నిర్మాణ లక్షణాల కంటే, పఠనీయ లేదా శ్రవ్య నాటక నిర్మాణ లక్షణాలు కన్పిస్తాయి. (దృశ్య విభజన, రంగ విభజన లాంటి కథల్లోని భాగాలు ఈ విషయాన్ని రుజువు చేస్తాయి.)

ఈ రకమైన రచనా నిర్మాణాన్ని శ్రీపాద ఎందుకు అనుసరించినట్లు? ఇవి కారణాలై ఉండవచ్చు: 1. ఆయన చిత్రించిన జీవితంలో పాత్రల మనఃప్రవృత్తుల్లో క్రియాశీలకమైన చర్యల కంటే, ఆవేశాలకంటే బుద్ధిజనిత వాక్చాతుర్యం అధికంగా ఉండటం. 2. ఆయనమీద బలంగా పడి పనిచేసిన నాటక సంప్రదాయం. 3. సంస్కృతం, తెలుగుభాషా సాహిత్యాల్లోని ఇతిహాస కావ్యప్రబంధాల కథా నిర్మాణ రహస్యాలు తెలిసి ఉండటం, జానపద సాహిత్య రూపాలతోనూ ప్రదర్శన రూపాలతోనూ పరిచయం ఉండటం. 4. ప్రధాన ఘటనలమీదకన్నా సన్నివేశాలమీదా, ఉపాఖ్యాలమీదా దృష్టి అధికంగా ఉండటం. 5. పరాకాష్ఠ పొందవలసిన ఏకైక సాంద్ర స్పందనా లక్ష్యం మీదికంటే అంగి అంగ రసాల పోషణ మీద దృష్టి సాగటం. 6. క్లుప్తతమీద కంటే అన్ని సందర్భాల్లోనూ వివరంగా అన్ని విషయాలనూ అలవోకగా ఆకర్షణీయంగా చెప్పగలిగిన భాషాశైలి ఉండటం. 7. ఇంగ్లీషుభాష ద్వారా యూరోపియన్ కథాశిల్ప పరిచయం లేకపోవటం.

ఈ సంపుటంలోని కథల్నే తీసుకుందాం. వీటిలో అతి పెద్ద రచన ఆయన తల్లిప్రాణంలోని ప్రదాన ఘటన ఒక్కటే. అది వితంతు పునర్వివాహఘటన. విరుద్ధ తత్వాలున్న పాతతరం అత్తగారూ వీరేశలింగం పంతులుగారి సంస్కరణ ప్రభావమున్న కుటుంబ వాతావరణంలో పెరిగిన కోడలూ మధ్య భావసంఘర్షణ ఈ కథలో చిత్రితమైంది. ఈ ఘర్షణ క్లుప్తంగా సాధించ గలిగిన మార్గాలు లేకపోలేదు. కానీ కథలో సన్నివేశాల్తూ, ఉపాఖ్యానాలూ కొ.కు అన్నట్లు విందుభోజనంలా తయారయ్యాయి. మాండలిక లోకవృత్తాన్ని నాటకీకరించి పాఠకుల్ని రసప్లావితుల్ని చేయాలనే దృష్టి, ప్రతిభ ఉన్న కథకుడు సిద్ధం చేసే విందు పదార్థాలయ్యాయి.

ప్రతి సన్నివేశం రంగ విభజన పద్ధతిలో సాగింది. ప్రతి మాటా రుచ్యంగా మారింది. రుచ్యంగా ఉండడం శ్రీపాద కథల్లోని శైలీనిర్మాణాల రహస్యం. ఈ శైలీనిర్మాణాలను భాషాశాస్త్ర దృష్టినుండి ఎవరైనా పరిశీలిస్తే బాగుండు. శైలీ శాస్త్రంలో పరిచయం ఉండి, సృజనాత్మక భాషాభివ్యక్తి రీతులను వివరించగల సంస్కారమున్న తెలుగుభాషా శాస్త్రజ్ఞులు ఇట్లాంటి పనిచేయటం సాహిత్య విమర్శకు తోడ్పడుతుంది – కవిత్వ భాషాశైలుల విషయంలో చేరా పనిచేసినట్లు.

శ్రీపాద రచనల్లో ప్రాంతీయ వర్గ మాండలిక శైలులు విస్తారంగా కన్పిస్తాయి. స్త్రీపాత్రల శైలులకూ, పురుషపాత్రల శైలులకూ మధ్య ఆయన తేడా చూపగలిగారు. శ్రోత్రియ కుటుంబీకులు ప్రత్యేకంగా వాడే పదాలు, పదబంధాలు రెండు వందలకు పైగా ఈ సంపుటంలోనే లభిస్తాయి. ఇవి నిఘంటువుల్లోకి ఎక్కవలసిన పదాలు. అట్లాగే శ్రీపాద ఉపయోగించిన వస్తునిబద్ధ పదాలు (registers). 'ఇలాంటి తవ్వాయి వస్తే...?'లో తాలూకా కాంగ్రెసు సంఘాధ్యక్షుడు, హరిజన సేవక సంఘాధ్యక్షుడు ఇచ్చిన ఉపన్యాసాల్లోని వాక్యనిర్మాణ రీతులూ వస్తునిబద్ధ పదస్థితిలో శ్రీపాద భాషాశైలీ పరిశీలక సామర్థ్యాన్ని తెలుపుతాయి. ఆ రెండు ఉపన్యాసాల్లో రచయిత ఆ పాత్రలమీద మంటకొద్దీ చొప్పించిన 'అతి' తప్పిస్తే, అవి రాజకీయ, మతరాజకీయ ఉపన్యాస భాషాశైలులకూ, వస్తునిబద్ధ పదస్థితికీ ఉదాహరణలుగా నిలుస్తాయి. సంస్కృతం చదివి చదివి తెలుగు మరచిపోయినవాళ్ళు, ఇంగ్లీషు చదువు చదివి తెలుగు రాదంటూ తెలుగులో రాయటానికి ప్రయత్నించేవాళ్ళు గురజాడ తర్వాత చదవతగిన రచయిత శ్రీపాద.

శ్రీపాద కథల్లో పండిత సంప్రదాయం ఉండవచ్చు; దృక్పథంలో పరిమితులుండవచ్చు. వైరుధ్యాలుండవచ్చు. విశ్లేషించుకుంటూ స్ఫూర్తి పొందగలిగే భాషాసంస్కారమూ, సాహిత్య సంస్కారమూ వాటిల్లో చాలా ఉంది. భిన్నభాషాశైలుల నిర్మాణసామర్థ్యమూ, పలుకుబళ్ళలోని పదునూ, సారళ్యమూ, శ్రీపాద భాషా సంస్కారంలోని అంశాలు. చిత్తశుద్ధీ, కథనకౌశలమూ, సునిశితమైన లోకవృత్త పరిశీలనమూ, తెలుగు జాతీయతా ఆయన సాహిత్య సంస్కారంలోని అంశాలు.

గురజాడ తదనంతరంలో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి 'జాతి' కథకుడు.

ఆచార్య కేతు విశ్వనాథ రెడ్డి
డా॥ బి.ఆర్. అంబేద్కర్
సార్వత్రిక విశ్వవిద్యాలయం

హైదరాబాదు.
26 నవంబరు 1992.

★ ★ ★

# కథాక్రమంబెట్టిదనిన...

# కొత్తచూపు

"చిత్తగించారూ? మీ అల్లుడుగారు, అగ్రహారందారూ, గొప్ప వంశానికి చెందినవారున్నూ. అనేక మంది అగ్రహారందార్లలాగ కాక, స్వయంగా వారు పండితులు కూడా. ఈ జిల్లా బ్రాహ్మణ్యాని కంతకీ భూషణం అని, వారికి, మా జిల్లాలో కూడా చాలా ప్రఖ్యాతి వుంది. అంచేత, వారూ మేమూ వియ్యం అందడం బంగారానికి పరిమళం అబ్బడమే. కనక, వరకట్నం యింత కావాలని వారిని నేను నిక్కచ్చి చెయ్యను చెయ్యనే లేను నాకు కావలసింది, గౌరవమూ మర్యాదాను, డబ్బు కాదు. అయితే, నే నిప్పుడు మనవి చేసుకునేది ఒకరిస్తామన్న మొత్తం మాత్రమే. అదయినా, నేను బేరమాడి స్థిరపరుచుకున్నది కాదు, వస్తూనే వారే సెలవిప్పించింది. ఈ విషయం నే నిప్పుడెందుకు ప్రస్తావించవలసి వచ్చిందంటే? ఇక్కడ మీ రెంత యిచ్చినా నేను వొప్పుకుంటాననుకోండి; కాని, కీడెంచి మేలెంచ మన్నట్టు మీరిచ్చేది, వారిస్తా మన్న దానికంటే తక్కువ అవుతుందనుకోండి. అయినా, నేను మనస్ఫూర్తిగానే ఆనందిస్తాను; కాని, అలా జరిగితే, ఆ గృహస్థు 'నువ్వేమన్న పెద్దమనిషివయ్యా?' అని న న్నేనడివీధిలోనో నిలబెడితే నే నేమిటీ చెయ్యడం? అటు గౌరవమూ పోయి, ఇటు—ఏమంటారు?" అనడిగాడు పెళ్ళికొడుకు తండ్రి, మొగం అంతా జాలి చేసుకుని.

"చిత్తం చిత్తం, మీరు సెలవిప్పించినదాల్లో యేమీ తేడా లేదు అయితే, మీరు నిక్కచ్చి చేసినా, ఆశించినా, మేమే యిస్తామని యెదురుచూసినా, మీకు తృప్తి కావాలంటే వారికంటే మే మెక్కువే యిచ్చుకోవాలి గదా? కనక, సెలవిప్పించండి" అన్నాడు, పెళ్ళి కూతురి మాతామహుడు భైరవసోమయాజి.

"ఒకవేళ మీ రివ్వతలిచిందే యెక్కువ అవుతుందేమో? ఇక మనం స్వల్ప విషయాలు తవ్వుకోడం యేమి సొగసూ?"

"అమ్మమ్మా, మీరలా సెలవిప్పించడం ధర్మమా? ఆ వొకరి సాహసం కంటే మీ ఔదార్యం యెంత గొప్పదో చూసుకొని మే మానందించడానికయినా మీరది చెప్పవలసే వుంటుంది కదా?"

"ఇంతకీ—మీ అల్లుడుగారు దయచేశారు కారు. వారు వచ్చాక మళ్ళీ చెప్పడం కంటే—"

"ఎందుకూ? నేను మనవి చేసుకున్నాను కాదూ? అతను చిన్నవా డండీ! అయినా, యజమాని కనక, లాంఛనప్రాయంగా శ్రుతపరచడం – అంతే. ఇక్కడి వ్యవహారాలన్నీ నాచేతిమీదుగానే నడుస్తూ వుంటాయి. మీరు మళ్ళీ శ్రమపడ వలసిన అగత్యం యెంతమాత్రమూ వుండదు, నాది పూచీ సరా?"

"వారన్ని విధాల సెలవిప్పిస్తూ వుంటే సందేహం యెందుకూ, మన అభిప్రాయం చెప్పెయ్యవయ్యా బావా!" అన్నాడు పెళ్ళికొడుకు మేనమామ.

"అలాగే, సందేహం యేముందీ యిందులో? మన అభిప్రాయం అంటే అవతలివారిచ్చుకుంటా మన్నది కదా, వారి మాట శుకానువాదం చెయ్యడంలో మనకి ప్రత్యవాయం మాత్రం యేమి వుందీ?"

"అదే నా మనవిన్నీ. ఏమంటే? వారిస్తా మన్నదీ, మే మివ్వతలిచిందీ యేమయినా, మీరు నిశ్చయించుకున్నది—"

"మీరు భ్రాంతిపడుతున్నారు. మేము నిశ్చయించుకున్నది లేనే లేదు."

"ఒక్కటి చిత్తగించండీ! వరకట్నం పుచ్చుకోకుండా మీరు మా మనమరాలిని చేసుకుంటారా?"

"వరకట్నం యివ్వకుండా మీరు వరుణ్ణి తేదలుచుకున్నారా?"

"కనక?"

"ఇక మన కా ప్రస్తావన యెందుకూ?"

"అదే నా మనవిన్నీ."

"సరే, చిత్తగించండి, మనవి చేస్తాను. ఒకానొక సంపన్న గృహస్థు సమర్పించుకుంటా నన్న వరకట్నం పదకొండువేల నూటపదహారు రూపాయీలు. అందులో సగం తాంబూలాల సమయానా, తక్కింది లగ్నం వేళా చెల్లించే నిర్ణయం. అప్పగింతల వేళ, వచ్చిన స్త్రీపురుషులకు, అబాల గోపాలమూ మీ, మా, దర్జాలకు తగివుండేటట్టు మా జాపితాప్రకారం నూతన వస్త్రాలు మూటకట్టి విడిదిలో నా కప్పగింత పెట్టడం. మే మిక్కడికి తరలిరావడానికి కయే ఖర్చులు, మా బిల్లు ప్రకారం మాకు ముదరా యివ్వడం. వెళ్ళేటప్పుడు మా ఖర్చులు మాత్రం మావే లెండి, మీకు పూచీలేదు. బాజాభజంత్రీలూ, పాలకీ బోయీలూ, బోగంమేళమూ, మాతో మేము తీసుకు తెచ్చుకునే యిద్దరు వంట బ్రాహ్మలూ, యిద్దరు పేరంటాళ్ళూ—వీరి కివ్వలనసిందిన్నీ మాకు చెల్లగట్టడం. ఇవి నాతో వ్యవహరించవలసిన ముఖ్యాంశాలు. చిల్లర మల్లరలు మనం యెప్పటికప్పుడే పరిష్కారం చేసుకుంటూ వుండవచ్చు. దానికేం లెండి? ఇక వియ్యపురాలి విషయమూ, ఆడబడుచు విషయమూ వున్నాయి. ఆ సంగతులు నిశ్చయించుకోవలసిన వాడు మా భావమరిది...చెప్పవయ్యా!"

"అవిన్నీ వొక రిస్తా మన్నవేనా?" అనడిగాడు సోమయాజి.

"బంధుత్వం కలుపుకునేటప్పుడు మనకి దాపరికా లెందుకూ? వారికీ మాకూ కొద్దిపాటి తేడా లేకపోలేదు. కనక, తాము మరోమాటు ఆలోచించుకునేదాకా—అంటే తమ మాట పుచ్చుకోకుండా మరో సంబంధం చూసుకోవద్దని మమ్మల్ని వారు చాలా ప్రార్థించారు లెండి. అయితే—"

"ఇప్పుడు మనం యేమీ నిర్ధారణ చేసుకోడానికి వీలులేదన్నమాట?"

"అమ్మమ్మా, ఎంతమాటా? మీ సంబంధం కుదిరితే ఇంకా యింకా యిస్తామన్నా వారు మాకెందుకూ?"

"సరే, నా సందేహం ఏమిటంటే? ఇక మీ బావమరిది గారు శెలవిచ్చేది వారు ఇస్తామన్నదా మీరు నిశ్చయించుకున్నారా?"

"ఏమంటా వోయ్?"

"అయ్యో, ఈ విషయమై మా బావగారి ప్రమేయం లేశమూ లే" దంటూ అందుకున్నాడు, మేనమామ.

"నేను మనవి చేసుకునే దేమిటంటే – వియ్యపురాలికీ ఆడబడుచుకీ కలిపి వెయ్యిన్నూటపదహార్లని వారూ, ఎవరికి వారికే వెయ్యిన్నూటపదహార్లని మేమూను. ఈ వొక్క విషయమే వారు మళ్ళీ ఆలోచించుకోవా లన్నది. మా అక్కగారి కొక్క కొడుకూ వొక్క కూతురూను. అల్లారు ముద్దుగా పెంచుకుంటోంది. ఎన్నాళ్ళుగానో ఊటలున్నూ ఊరుతోంది, మా అక్క. ఆవిడ తనకి ముచ్చట్లు బాగా తీరాలని ఆశించడంలో తప్పేముందీ? మా మేనగోడలికయినా మళ్ళీ మళ్ళీ తీరే అవకాశం లేదుకదా? అంచేత, అయిదు రోజులూ, ఇద్దరికీ, రోజు కొక్కొక్క పెద్దకాసు బొట్టుపెట్టాలి. ఒక్కొక్క బెంగుళూరి చీర కట్టబెట్టాలి–"

మాట సగంలో కలుగజేసుకుని "ఇదిగో, చూడూ, అగ్రహారీకులతో పని. అదనీ, అది కాదనీ తరవాత కీచులాడుకోడం నేను సహించను. నూలు చీరలు పనికిరావు, మేలురకం పట్టుచీర–స్పష్టంగా చెప్పు" అన్నాడు పెళ్ళి కొడుకు తండ్రి, నిష్ఠూరంగా.

"మీరు చెప్పేశారుగా? అయ్యా, ఇక మీరు ముందుకి వెళ్ళండి."

"చిత్తం చిత్తం. అప్పగింతల వేళ, ఇద్దరికీ అత్తాకోడళ్ళ అంచుల సేలం పట్టుచీర లివ్వాలి. మనుగుడుపుల్లో కూడా రోజు కొక్కొక్క చీర కట్టబెట్టాలి. ఈ విషయమై మొదట కొంచెం తర్జనభర్జన జరిగింది; కాని, చివరి కుభయులమూ ఒక నిశ్చయానికి వచ్చాం. దాని ప్రకారం, మొదటి రెండు రోజులూ మేలురకం పుల్లం పేట జరీచీర లివ్వడం. మూడోనాడు మాత్రం బొంబాయి పట్టుచీర లివ్వాలి సుమండీ! కాళ్ళు కడుగుచెంబూ, పళ్ళేలూ, పానకం బిందెలూ – ఇవి వారిదివరకే వెండివి తయారు చేయించుకుని వున్నారు. మేము వెండి బొట్టు పెట్టే, బంగారపు కుంకుమభరిణే కూడా చేయించాలన్నాం. వారు సరే అన్నారు. మధుర పట్టుచీరతో వుయ్యాలా, బెంగుళూరి పట్టుచీరతో వొడికట్టూ – ఇవిన్నీ వా రంగీకరించారు. ఇక తక్కినవి స్వల్ప విషయాలు. అవి జరగడమే ప్రధానం. విలవలు మీ దర్జాని పట్టి నిర్ణయించుకోవచ్చు. నిర్ధారణ అక్కరలేదు. ఎటొచ్చీ – అయిదు రోజులూ, మా అక్క, మేనకోడలూ పెళ్ళివారి యింటికి వస్తూ వెడుతూ వుండడానికి విడిదిలో రెండు మేనా లెప్పుడూ సిద్ధంగా వుండాలి. ఇది మాత్రం చాలా ముఖ్యం సుమండీ!"

ఈ మాట చాలా వొత్తి చెప్పాడు మేనమామ.

"చిత్తం" అంటూ అంతకంటే గట్టిగా తల వూపాడు సోమయాజి, కుండలాలు ఎగిసిపడేలాగ.

"ఇక మా విషయం" అంటూ అవ్యవధానంగా అందుకున్నాడు, ఆడబడుచు మొగుడు.

అది విని సోమయాజి వులిక్కిపడగా "అంటే, బంధువుల విషయం లెండి" అంటూ సద్దిచెప్పి ప్రారంభించా డతను:

"అమ్మాంబాపతూ మేము నూటయాభై మంది దాకా వస్తాం. ఏ కొద్దిమందో తప్ప అందరూ ఇంటరు తరగతిలో వస్తాం. పెళ్ళికొడుకు ఫస్టుక్లాసులో వస్తాడు–"

మళ్ళీ మాట సగంలో అందుకుని "అదేమన్నమాటా? మావాడు నిన్ను విడిచి తానొక్కడూ సెకండు క్లాసులో వస్తాడూ? వివరంగా చెప్పు, నాకీ శషభిషలు పనికిరావు" అంటూ మూతి ముడుచుకుని చురుగ్గా చూశాడు పెళ్ళికొడుకు తండ్రి.

దీనిమీద "వారు సెలవిచ్చారుగా? ఇక తక్కిన సంగతులు చెప్పండి మీరు" అన్నాడు సోమయాజి, చెయ్యూ్యపుతూ.

"అందరికీ, అయిదు రోజులూ, పూటకి రెండు పిండివంటలతోపాటు మైసూరు రసమూ సాంబారూ విధిగా వుండాలి. పనసకాయా, వంకాయా, అరిటికాయా, గుమ్మడుకాయా, కందా, పెండలమూ – ఇలాంటి చచ్చుకూరలు పనికిరావు మాకు. కేబేజీ, నూల్‌కూలూ, బీట్‌రూటూ, కాలీఫ్లవరూ – ఇలాంటివి పూటకి రెండు చేయించాలి. బంగాళాదుంపలు చిప్సుగా మాత్రమే చేయించాలి. ప్రతీరోజూ పగలు పెరుగుపచ్చడీ, రాత్రి క్షీరాన్నమూ వుండాలి. రెండు పూట్లా పెరుగేకాని మాకు మజ్జిగ సుతరామూ పనికిరాదు. పొద్దు పొడిచాటప్పటికి కాఫీవుప్మాలూ, పొద్దు వాలాటప్పటికి ఒక తీపీ, ఒక కారమూ, టీ – ఇవి నిక్కచ్చిగా వుండాలి. తువి ఆకులే గాని ద్రాక్షారామ తమలపాకులు మాకు పనికిరావు. విడిదిలో నలుగురు వడ్డీమంగళ్ళెప్పుడూ సిద్ధంగా వుండాలి. రెండు జట్కాలున్నూ హాజరుపెట్టి వుంచాలి. రోజుకొక రకం మంచి సబ్బుబిళ్ళలు డజనూ, అరడజను చీట్లపేకలూ పంపుతూ వుండాలి. స్నానాలకు మాకు వేడినీళ్ళేగాని చన్నీళ్ళు పనికిరావు. ప్రతీరాత్రీ రెండయేదాకా మేజువాణీ వుంటుంది. పన్నెండు గంటలవేళ సమృద్ధిగా టీ పంపుతూ వుండాలి. ఇది అగ్రహారం, మాకు తెలుసు. అయినా, పూటకు సిజర్సు డబ్బా లారూ, బీడీకట్టలు పెద్దవి మూడూ, కేతకీమసాలా ఒక సౌనూ, బంగాళా ఆకులు నూరూ పంపుతూ వుండాలి. వీటికి మాత్రం రోజుకి పూటలు మూడు సుమండీ! ఫిల్టరుసోడా, కలర్సూ చాలా ముఖ్యం, మరచిపోగూడదు. మిక్కిలీ ముఖ్యమైనది మరొకటుంది, బోగం వాళ్ళకిచ్చే బస చక్కగానూ, పరిశుభ్రంగానూ, విశాలంగానూ వుండాలి."

"చిత్తం చిత్తం, అన్నీ అయినట్టేనా?"

అల్లుడు మామగారికేసి చూశాడు.

"లేదు లేదు, కొంచెం తరవాయి వుంది. ఏదీ, నాయనా, నీ ముచ్చట్లు గూడా తాతగారికి మనవిచేసుకో. ఉభయులకూ వారు కావలసినవారే సందేహించకు" అన్నాడు పెళ్ళికొడుకుతో, తండ్రి.

"సందేహమా?" అటూ వెంటనే అందుకున్నాడు పెళ్ళికొడుకు.

"హా! అది మన నిఘంటువులోనే లేదుగా? అయ్యో, వినండి మధుపర్కాలు మాత్రమే నేను పంచెలు పుచ్చుకుంటాను. తక్కినవన్నీ నాకు సిల్కు సూట్లూ ట్వీడ్సూసూట్లూ మాత్రమే యివ్వాలి–"

మాట కడ్డం వచ్చి "ప్రోల్లో కూడా పట్టుతాపితాలే పుచ్చుకోవాలి నాయనా, వల్లకాదనకూడదు" అని బుజ్జగించాడు తండ్రి.

"సరే, అదిన్నీ అలాగే కానిచ్చుకోవచ్చు. తరవాత మధుపర్కాలు మాత్రం నేను కట్టుకుంటాను కనకనా? పోగా,– నా వెండికంచం రెండవందల యాభై తులాలూ,

మరచెంబు రెండువందల తులాలూ వుండాలి. కంచం దగ్గిర పెట్టే ప్లేట్లూ, గిన్నెలూ, కాఫీసెట్టూ వాటికి తగ్గట్టే వుండాలి. మూడు రవ్వల వుంగరమూ, రాళ్ళు తాపిన రిస్టువాచీ, దానికి బంగారపు గొలుసూ, – రోల్డుగోల్డు ఎంత మాత్రమూ పనికిరాదు. తెలుసా? మంచిరకం రేడియో సెట్టూ, గ్రామోఫోనూ, ఇంగ్లీషుమేక్కు బట్టల బీరువా, బంగారపు సిగిరెట్టు కేసూ – ఇవన్నీ లగ్నసమయాన యివ్వాలి. అలకపాన్పు మీద ఒకటో రకం టెన్నిస్‌బాటూ, మోటారుసైకిలూ యివ్వాలి. ఇది పల్లెటూరు కనక, తప్పదంటే నే నొక్క వూరేగింపు సమయంలో మాత్రమే పాలకీ యెక్కుతాను. తక్కిన సమయాల్లో నా కోసం వొక కారెప్పుడూ సిద్ధంగా వుంచాలి. ఈ వూళ్ళో నాకు కాలం గడపడం కష్టం గనక, భోజనం కాగానే నే నే కాకినాడో, రాజమహేంద్రవరమో, చివరికి రామచంద్రపురమో వెళ్ళి వస్తూ వుండడాని కది చాలా ముఖ్యం. మరిన్నీ, బోగం మేళం మే మిదివరకే మాట్లాడి వుంచాం. అదే మీరు తీసుకురావాలి, మరోటి పనికిరాదు."

"బాగుంది నాయనా!"

"అన్నట్టు, మంచి సేవింగు సెట్టు కూడా వొకటి అలకపాన్పుమీద నాకు సిద్ధం చేసి వుంచాలి సుమండీ"

"అదేమిటి నాయనా?"

"అది మీ అల్లుడుగారికి తెలుస్తుంది లెండి, నూరో నూటపాతికో పెడితే వస్తుంది, యేమంత భాగ్యం?" అని సద్ది చెప్పాడు, ఆడబడుచు మొగుడు.

అతను మాట పూర్తిచేశాడు.

అంతే.

గదిలో యేదో చప్పుడయింది.

పూసల జాలరు వెనక వున్న పట్టుతెర వొక పక్కకి జారుకుంది.

చూడగా, తోకమీద నిలిచిన వురగాంగనలాగ ద్వారంలో అన్నపూర్ణ నిలిచి వుంది.

మొదట అందరూ చకితులయినారు

"పెళ్ళికూతురు!" అన్నాడు కొండుశ్రౌతి, మెల్లిగా.

అందరూ అటు పరిశీలనగా చూశారు; కాని, పులుకూ పులుకూ చూస్తూ సోమయాజి మొగం చిట్లించుకున్నాడు.

చురచుర చూస్తూ యింతలో పెళ్లికొడుకు ఎదటికే వచ్చేసిందామె, మెరుపుతీగలాగ

ఉలిక్కిపడి పెళ్ళికొడుకు తండ్రీ, మేనమామా మొగమొగాలు చూసుకున్నారు.

సోమయాజి బోసినోరు తెరుచుకుంది.

ఆడబడుచు మొగుడు వీపు గోకాడు గాని; గుంయి మన్నట్టయి పెళ్ళికొడుకు చూపులు చెదిరిపోయాయి.

అదీ అదీ కూడా కనిపెట్టేసింది అన్నపూర్ణ.

"మీ వాగ్ధోరణి చాలా సరసంగా వుంది. అది మీరు చదివిన చదువులకు ఫలితం" అందామె ఉత్తరక్షణంలోనే, పెళ్ళికొడుకుతో

కాని, అతనికి మాట రాలేదు.

"మీ అందరి షరతులూ చాలా గొప్పగా వున్నాయి. అది మీ పూర్వుల తపస్సుకి ఫలితం."

"..."

"వాటి విషయమై మీ రున్నారు, మా తాతగా రున్నారు, యధేచ్ఛగా పరిష్కరించుకోవచ్చు. ఎవరూ అడ్డురారు."

"....."

"మీరు నాకే చెప్పవలసిన సంగతి ఒకటుంది. అది మీరు మా తాతగారికి చెప్పక పోవడం మీ యింగితజ్ఞానానికి గొప్ప గుర్తు."

"....."

"నాకు జవాబు చెప్పండి. ఉత్తర భారతభూముల్లో భారతీయస్త్రీ లెందరో మానభంగాలకు పాల్పడ్డారు. ఉత్తరాంధ్ర భూముల్లో మనవాళ్ళ కెందరికో అలాంటిది తటస్థపడుతోంది. తెనుగుస్త్రీల కిది చావుబతుకుల సమస్య. మే మిది చూసీ చూడకుండా విడిచిపెట్టడానికి వల్లకాదు మరి, మీ కళ్ళయెదుట మీ ఆత్మీయులకున్నా అలాంటిది తటస్థపడితే, తరవాతి మాట యేమయినా, ముందు కళ్ళు మూసుకుని మీరు శత్రువులమీద పడగలరా?"

ఇలా అడిగి కరుగ్గా చూసింది అన్నపూర్ణ

దీంతో, అక్కడి వాతారవణం స్తంభించిపోయింది.

సోమయాజి సనాతనధర్మం కీచుమంది.

పెళ్ళికొడుక్కి నవనాడులూ కుంగిపోయాయి.

శ్రౌతి మాత్రం వూగిపోయాడు.

తక్కినవారికి మీది ప్రాణాలు మీదికే యెగిరిపోయాయి.

ఉండుండి "నాకు బదులు చెప్పా"లంది అన్నపూర్ణ.

చూసింది, చూసింది, గిరుక్కున మళ్ళీ లావణ్యం కెరటంలాగ యింటోకి చక్కా పోయింది, గజగమన అయి.

పెళ్ళివారి కళ్ళకి పొరలు కమ్ముతున్నట్టు తెర విచ్చుకుంది, ఒక్కమాటు ఊగిసలాడి.

## 2

చెమటలు కక్కుకుంటూ కళేబరం యింటోకి మోసుకు వెళ్ళాడు సోమయాజి.

చూడగా, కూతుర్ని పొదివిపట్టుకుని తన కూతురు రాజేశ్వరి "బిడియపడిపోతా వమకున్నా నమ్మా!" అంటూ ముద్దుచేస్తోంది, అలకలు సవరిస్తూ.

"నువ్వు చదివిన చదువు సార్థకం చేసుకున్నా వమ్మా!" అంటూ ప్రశంసిస్తున్నాడు, దగ్గిరసా మంచుని రామశాస్త్రి, సగర్వంగా.

హాల్లో వీపుమీద పడ్డ పిడిగుద్దుకి, నెత్తిమీద మొట్టికాయ అయి జతపడిం దిది సోమయాజికి.

జవజవలాడిపోయాడు బ్రాహ్మడు.

"నీ గుణం నువ్వు పోనిచ్చుకున్నావు కావు" అన్నాడతను చివరికి పురపుర చూస్తూ.

"ఏమిటండీ మీ రనేదీ?" అంటూ యిటు తిరిగి వెంటనే యెదురుకున్నాడు శాస్త్రి.

తల్లి పొదిగిటనే వుండి విరగబడి చూసింది అన్నపూర్ణ.

"నేను నిన్ను రమ్మందాం అనుకుంటూ వుండగా పెళ్ళికూతురా రావడం? వచ్చినా పెళ్ళికూతురయినది అలాగేనా మాట్లాడడం?" అంటూ గింజుకున్నాడు సోమయాజి.

"మీ రుండండి నాన్నారూ!" అంటూ తల్లి చేతులు విడిపించుకునీ, తండ్రిని తప్పించుకునీ వూాచలాగా వచ్చి, తోక తొక్కిన తాచులాగ యెదుట నుంచుని "నాకు పెళ్ళికొడుకుని మీరు చూడ్డం యేమిటి తాతగారూ?" అంటూ నిలేసింది అన్నపూర్ణ.

ఆ రూపమూ, ఆ చూపులూ భరించలేక కొయ్యయిపోయాడు సోమయాజి – "ఆ, ఆ" అంటూ వెనక్కి జంకి

"ఇప్పటికి పాతిక సంబంధాలయినా చూశారు మీరు. ఇరవైమందినయినా పెళ్ళి కొడుకులను యింటిమీదికి తీసుకువచ్చారు మరో పనిలేదూ మీకూ? ఎవరు ప్రాధేయపడ్డారండీ యిలా అవస్థపడమని మిమ్మల్నీ?"

అతనికి మాట రాలేదు.

"మీరు నాకోసం సంబంధాలు చూడ్డం మా నాన్నగారి కిష్టం లేదనీ, వారి సహనం అంతరించిపోయిందనీ, మీకు బోధకావడానికి మరో మార్గం యేమి వుందండీ?"

కళ్ళల్లోకి మాత్రం ప్రాణాలు చేరుకున్నాయి, అప్పటి కతనికి మెల్లిగా

"పోనీ అంటే, మీరు తెచ్చినవాళ్ళలో వొక్కడయినా మా నాన్నారు కాళ్ళు కడగతగ్గవాడున్నాడా?"

అప్పటికి గొంతుకు గుడగుడ లాడిందతనికి.

గుడ్లు మిటకరించుకోగా మాట కూడా తిరిగింది

"నేను తెచ్చినవాళ్ళందరూ అప్రాచ్యులేనా? అయితే, యెలాంటివాడిక్కడుగుతాడే మీ నాయన కాళ్ళు?"

"అలాంటివాళ్ళు మీకు దొరకరు"

"అయ్యో!"

"చెప్పినా మీరు గుర్తించలేరు"

"అయినా లక్షణాలు చెప్పు, చూతాం"

"ఉలిక్కిపడకండి ఇప్పుడు వరయోగ్యత నిర్ణయించవలసినవారు మీరూమీరు పురుషులు కారు."

"ఆ!"

"తలపండిపోయిన మీవంటి వృద్ధులసలే కారు"

"శ్రీహరీ!"

"మీ యుగం తిరిగిపోయింది. మీ చదువులు పనికిరావు మీ నమ్మకాలిక చెల్లవు."

"అయ్యో, అయ్యో!"

"మీ చూపుల కాననీ, మీ బుద్ధి కందనీ పరిధుల్లో వున్నాం మేమిప్పుడు. ఇక యుగధర్మం నిర్వచించవలసింది మేము."

"వినడానికీ మేము పనికిరామటే?"

"అవశ్యమూ వినవచ్చు. తక్కినవారి సంగతి యేమయినా, తెనుగు కన్యలం మే మిప్పుడు చూసుకోవలసిన వరయోగ్యత చక్కదనం కాదు. చదువూ కాదు ఐశ్వర్యం కానే కాదు, ఇవన్నీ తెనుగు యువతిని బానిసను చేశాయి. ఈ లక్షణాలున్న తెనుగు యువకు లింతవరకూ చక్రవర్తులుగా చెలామణీ అయినారు; కాని అలాంటి వారిక వివాహానికి అర్హులు కారు."

"మరెవరే అర్హులు? వాళ్ళ యోగ్యత లేమిటే?"

"బతికివున్నంతకాలమూ జీవితంలో స్త్రీలు తమతో సహకరించుకోవాలంటే యువకు లిప్పుడు గడించుకోవలసిన యోగ్యతలు – శౌర్యం, బలపరాక్రమాలు, తెగబడి యుద్ధం చేసే ధైర్యం. వీలు తప్పితే పెళ్ళి కూతుర్ని రాక్షస వివాహ పద్ధతిగా సంపాదించుకోవాలన్న చూపు, అందుకు తగ్గ సత్తా–"

ఆవేశం ముంచుకువచ్చి అన్నపూర్ణ మరి మాట్లాడలేకపోయింది

రామశాస్త్రి మొగాన గర్వరేఖ మెరిసింది

రాజేశ్వరి చూపుల్లో ఆనందం తరళితం అయింది.

ఉండుండి "మహా బాగా తయారు చేశావు కూతుర్ని" అంటూ రామశాస్త్రిని హేళన చేశాడు సోమయాజి, వూగీస లాడుతూనూ, చేతులాడించుకుంటూనూ.

"నే నాశించినట్టు తయారయింది నా కూతురు. అందరికీ యిలాంటి అదృష్టం పట్టదు – తెలుసా?" అంటూ ముదలకించాడు శాస్త్రి

"ఓ–హో!"

"మీరు ఘనాపాఠీలే గాని అర్థజ్ఞానం లేక వేదంలో యేమి వుందో మీకు తెలియదు విడమర్చి చెప్పినా మీకు బోధపడదు. వేదాన్నే మీరు గౌరవించ తలుచుకుంటే వేదోక్తాలయిన లక్షణాలన్నీ వున్నాయి నా కూతురి దగ్గిర, చూసుకోండి"

"అలాగ టోయ్!"

"కాకేమండీ?"

"నా కేం తెలుసు నాయనా? మహా పండితుడవు నువ్వు"

"వేదజడునకు పాండిత్యం అంటే యేమి బోధపడుతుందీ? ద్రవ్యాశా, కొంపలు తీసే లౌక్యమూ – వీటిలో మాత్రం మీరు నిధులు. మీరిప్పుడు తెచ్చిన పెళ్ళికొడుకు, అలకపాన్పుమీద తనకు మంచిరకం మంగలిపొది యివ్వాలంటే అందు కామోదించారు మీరు – ధర్మాధర్మాలు మీకేం తెలుసునండీ?"

మళ్ళీ కొయ్యయిపోయాడు సోమయాజి

"మీ రిప్పుడు తెచ్చిన కుర్రాడు, పెళ్ళిలోనే ఆ వూరూ యీ వూరూ షికార్లు కొడతాట్ట, పెళ్ళికూతుర్ని కూడా తన వెంట పంపాలంటాడేమో మీకేమయినా యింగితజ్ఞానం వుందా?"

"పోనీ, ఆకుర్రాడు అప్రాచ్యుడే అనుకో. ఇప్పటికే యిరవైయేళ్ళు నిండాయి గదా, పెళ్ళి చెయ్యకుండా యింకా యెన్నాళ్లట్టే పెడతావు నీ కూతుర్ని?" అనడిగాడు సోమయాజి, మాట మరిపించడానికి మొండిగా.

"బతికివుండినంతకాలమూ పెళ్ళనేది యెరక్కుండా మహోజ్జ్వలజీవితాలు గడిపిన నిత్యకన్యలతో పరమ పవిత్రాలయినవి మన మహర్షుల కుటుంబాలు ఆ కుటుంబాలకు సంబంధించినవి వాళ్ళం మనం, మీ కిది తెలుసా?"

గుండెలు పితపిత లాడిపోగా, అటు చూడలేక, కూతురికేసి చూశాడు సోమయాజి

"నువ్వూ యీ తండ్రీకూతుళ్ళతోనే కలిశావా?" అనిన్నీ అడిగాడతను.

"అటు నా యిలవేల్పూ, యిటు నా కండలో కండానూ ఏమీ కలిసిపోక?" అని యెదురడిగింది రాజేశ్వరి.

"నీకూ యీ పద్ధతులు నచ్చాయా అనడుగుతున్నాను?"

"ఐశ్వర్యమే కనపడింది వారికి, నన్నిచ్చినప్పుడు మీకు; కాని నేనిప్పుడు దేవతాకుటుంబంలో పడ్డట్టు భావించుకుంటున్నాను – నాకు వారి పద్ధతులు నచ్చకేం?"

రామశాస్త్రి మొగాన మళ్ళీ గర్వరేఖ మెరిసింది

"ఏం, అయిందా?" అన్నట్టు డెకారిస్తూ చూసింది అన్నపూర్ణ.

చూసి చూసి "అయితే, యీ దేవతా కుటుంబంలో వుండడానికి నా కర్హత లేదు. ఇదిగో, నేను వెళ్ళిపోతున్నా"నంటూ రుంజుకుని, పెద్ద నిట్టూర్పున్నూ విడిచి, కాళ్ళు అడ్డదిడ్డంగా వేసుకుంటూ తుర్రుమన్నాడు సోమయాజి

తల్లీ కూతురూ గంభీరంగా చూసుకున్నారు.

కూతురి మొగం ఉత్సాహతరళితం కాగా, తల్లి హృదయం ఆనంద తరంగితం అయింది.

వెంటనే డగ్గుత్తికతో "అమ్మా!" అంటూ వెళ్ళి తల్లి మెడకు చేతులు చుట్టవేసి గుండెల కంటుకుపోయింది అన్నపూర్ణ

ఆనందబాష్పాలతో కూతురి శిరస్సు అభిషేకిస్తూ బరువుగా ముద్దుపెట్టుకుంది రాజేశ్వరి.

ఆ ప్రేమా ఆ వాత్సల్యమూ చూసి నిలువునా కరిగిపోయాడు రామశాస్త్రి

## 3

నడివీధిలో పే–ద్ద బాంబు పేలినట్టయి, ఆ వార్త, క్షణంలో వూరంతా పాక్కుపోయింది

దాంతో, అగ్రహారాని కగ్రహారం అంతా, గట్టుతెగి వురకలు వేసుకుంటూ గోదావరి వరద వూళ్ళో పడ్డంత గగ్గోలు పడిపోయింది

ఎక్కడివా రక్కడ పురుషులు ధర్మపన్నాలు విడేశారు స్త్రీలు బుగ్గలు నొక్కుకున్నారు.

కుర్రకారు మాత్రం యె–ఘిరిపోయారు

కొందరు గోదావరి గట్టెక్కారు

కొందరు ప్రాకారా లెగబాకారు

కొందరు పుంతలో చింతచెట్టెక్కారు

అసత్యమూ అతిశయోక్తీ యేమీ లేదు, విన్నది విన్నట్టు జరుగుతోందక్కడ.

బాణాకర్ర చేతబుచ్చుకుని సవ్యాపసవ్యంగా పరవళ్ళు తొక్కడం చూపిస్తున్నాడు వీరముష్టి సుబ్బయ్య

తాను కూడా అంత బాణాకర్రా చేతబుచ్చుకుని, మధ్య మధ్య తబ్బిబ్బులవుతూ వుండినీ దీక్షగా అడుగువేస్తోంది అన్నపూర్ణ

పారిజాతపు చెట్టుకింద సిమెంటుబల్లమీద కూచుని "కంగారు పడకమ్మా" అంటూ కూతుర్ని ప్రోత్సాహ పరుస్తున్నాడు రామశాస్త్రి.

పెరటిగుమ్మం పొదిగిట నుంచుని సంబరపడుతూ చూస్తోంది రాజేశ్వరి కాని పుణ్యస్త్రీలు కొందరూ, వితంతువులు చాలామందీ బిందెలు చేతబుచ్చుకుని గోదావరి గట్టు పొడూగునా నుంచుని తమకేసే చూస్తూ వుండడమూ, వారి మధ్య అక్కడక్కడ యువకులున్నూ గుంపులుగుంపులుగా వుండడమూ, మొగం యిటు తిప్పకోగా ప్రాకారాలు కూడా యువకుల తలలతో నిండి వుండడమూ చూసి, తుళ్ళిపడి, గిరుక్కున తిరిగి లోపలికి వెళ్ళిపోయిందామె చిరాకుపడుతూ.

"అసలు రాజేశ్వరికే పుట్టివుంటుందర్రా దుర్బుద్ధి" అందొక ప్రౌఢ, అది చూసి

"తల్లికే పుట్టిందనుకో దుర్బుద్ధి. తండ్రి కూడా ఆడారి అబ్బన్న కనక – అంగీకరించాడే అనుకో. అన్నపూర్ణకయినా సిగ్గూ బిడియమూ వుండాలా వద్దా? చెట్టంత మనిషి పైట లేకుండా అలా నుంచుంటుందా మొగాళ్ళ యెదట, మనకే చచ్చినచావయిపోతూ వుంటే?" అంటూ చీదరించుకుందొక మధ్య

"అదేదో కాడ వున్న జల్లెడలా వుంటుందీ? వలకి తగలకుండా అవతల పడేటట్టు బంతి కొడతారూ, దాంతోనూ? రాజమహేంద్రవరంలో చదివినంత కాలమూ మరో ముగ్గురు ఆడాళ్ళనూ మొగాళ్ళనూ కలుపుకుని ఆడుతూనే వుండేదిట అది, సిగ్గూ బిడియమూ యెక్కణ్ణుంచి వస్తా యమ్మోయ్ మా వదినకి?" అంటూ ముక్కూ మూతీ తిప్పకుంది మరో మధ్య.

"ఇంతకీ:– అది అన్నపూర్ణేనా?" అనడిగిందొక ప్రౌఢ వితంతువు, కొత్తగా వచ్చిన చత్వారంతో కళ్ళు చికిలించుకుంటూ చూసి

"సరే" అంటూ ముందామె రెక్కగూళ్ళమీద పొడిచిందొక తరుణ వితంతువు.

"ఆ రత్నాలు చూశావా యెలా మెరిసిపోతున్నాయో? రాజేశ్వరమ్మగారికీ అన్నపూర్ణకీ తప్ప యీ వూళ్ళో మరెవరికున్నాయీ అలాంటి నగలూ?" అంటూ, తరవాత నిలవతీసి అడిగిందామె.

చెడ్డీ మీద పొట్టిపావడ కట్టుకునీ, బనియనుమీద ఆకుపచ్చ పట్టుజాకట్టు తొడుక్కునీ, కబరీభారం బిగ్గా ముడుచుకునీ వుంది అన్నపూర్ణ

చెవుల కమలాలూ, ముక్కు న బేసరీ, చేతుల బంగారు గాజులూ ఆ ప్రాతఃకాలపు లేత యెండలో మిలమిల్లాడిపోతున్నాయి.

"వొరే, దానికి కసరత్తు చేసిన మొగుడే దొరుకుతాడంటావా?" అనడిగాడు, గోడమీదుగా తొంగిచూస్తున్న పక్కవాణ్ణి తట్టి, వొక యువకుడు

"బి.ఏ. కావాలని కొందరూ, యేకపుత్రుడయి వుండాలని కొందరూ, అత్తగారూ ఆడబడుచులూ వుండకూడ దని కొందరూ, తండ్రిని కాదని పెత్తనం చేసుకుంటు న్నవాడు కావాలని కొందరూ ఏరుకునేటట్టు జెట్టినే చూసుకుని పెళ్ళాడుతుందది, తప్పేం?" అని ముదలకించాడు దానిమీద, పక్కవాడి కవతల వున్న కృష్ణయజ్వ

"ఇరవైయేళ్ళు నిండవచ్చి యిప్పటికే ముదిపేరక్కలా తయారయింది కదా, యీ కసరత్తుతో అది మరింత మోటు తేరిపోదూ? పొ-చ్చగా దబ్బపండు లాగే వుంటుందనుకో, నాజూకుతనం సన్నగిల్లిపోయాక దాన్నే అభాగ్యుడు పెళ్ళాడతాడురా పోనీ?" అని కృష్ణయజ్వని యెదురడిగాడు భోగప్ప.

"లుంగీకట్టి వొకడూ, పొట్టికోటు తొడుక్కుని వొకడూ, ముక్కుకింద మూడు పరకల మీసాలుంచుకుని వొకడూ, విజాతీయుల్లాగా, విదేశీయుల్లాగా వున్నవాళ్ళకే పెళ్ళిళ్ళయిపోతున్నాయి గదా, నీ కా సందేహం యెందుక్కలిగిందోయ్?" అంటూ అట్నుంచి నిలవతీశాడు సీతాపతి.

"కాకపోయినా, యిరవై యేళ్ళు నిండా యని అగ్రహారంయువకు లెవరయినా ఆమె యెడల విముఖు లవుతున్నారా?" అనడిగాడు సూరిశాస్త్రి సౌమ్యంగా.

అగ్రహారం యువకు లతణ్ణి తేరిచూశారు

"ఆమె కోసమూ, ఆమె తండ్రి ఆస్తికోసమూ గుటకలు మింగుతూ, యీ వూరి యువకులు కొందరయినా, ఎలాంటి సంబంధాలు తమకోసం వచ్చినా తిరస్కరించేస్తున్నారా లేదా అని కూడా అడగం"దన్నాడు సూరిశాస్త్రిని సీతాపతి

"అంతమాట నే నెందుకు లెండి అనడం?" అన్నాడు వెనక్కి తగ్గుతూ సూరిశాస్త్రి.

అది చూసి పురెక్కి "అయితే యేమిటండీ?" అన్నాడు కొంచెం దురుసుగా మళ్ళీ భోగప్ప.

సూరిశాస్త్రికి ఒళ్ళు మండింది:- కాని నిగ్రహించుకున్నాడు ముందు

"ఆమెని చూసయినా - ఆమెకోసం తపస్సు చేస్తున్న యువకులు, ఆమెలాగ తామున్నూ సాముగరిడీలు నేర్చుకోవచ్చుగా?" అనడిగాడు తరవాత అలాగే సౌమ్యంగా

దీనిమీద గోడ విడిచి యివతలికి వచ్చి "వొరేయ్, అగ్రహారం నీళ్ళు వొంటపట్టాయిరోయ్ సూరిశాస్త్రిగారికి" అన్నాడు రామచంద్రుడు, కొంచెం హేళనగా

సూరిశాస్త్రి కొంచెం నిరసన చూపు కనబరిచి వూరుకున్నాడు గాని; "యెందు కా హేళనా?" అంటూ చుర్రుమన్నాడు సీతాపతి.

"ఆయన అన్న మాటలో తప్పేముందీ? అన్నపూర్ణ సాముగరిడీలు నేర్చుకోడం నీ కిష్టం లేకపోతే దానికి పెళ్ళే కాదంటావా, విద్య పూర్తిచేసుకుని నిన్ను ప్రార్థిస్తే తిరస్కరించేస్తానంటావా? కాకపోయినా, నీకూ నాకూ మాత్రమే కాదు - ఈ

మూడువందల గడప అగ్రహారంలోనూ అయన్ని హేళన చెయ్యడానికి కొక్కడికీ తాహతు లేదు తెలుసా?" అని కఠినంగా కూడా అడిగా డతను

"ఎంచేతనోయ్?" అంటూ రామచంద్రుడూ "ఏమిట్రా అ విశేషం?" అంటూ నరసావధానీ ముందుకి తోసుకువచ్చారు, వెంటనే

"గోవిందభట్టాచార్యులుగారి దొడ్లో ప్రవేశించిన ముగ్గురు దొంగలనూ చచ్చు వెదురుకర్ర పుచ్చుకుని అయనే తరిమికొట్టారు గాని, చూస్తూ వుండిన్నీ మీలో వొక్కడయినా దగ్గరికి వెళ్ళగలిగారా?"

సీతాపతి యిలా నిలవతీసి అడగ్గా "మేమంతా వెనకాల వున్నా మన్న ధైర్యం వుండబట్టి గాని లేకపోతే తెలుసును అయన పసా నీ పసాను" అన్నాడు భోగప్ప మళ్ళీ, వెనక్కి మాత్రం వెళ్ళిపోతూ.

మిడుతూ మిడుతూ చూస్తూ రామచంద్రుడంతకిముందే మళ్ళీ గోడదగ్గరికి వెళ్ళిపోయా డిదేమీ యెరగనట్టు.

అది చూసి అసహ్యించుకున్నాడు సీతాపతి

ఒక్క క్షణానిగ్గాని అతను తేరుకోలేకపోయాడు

చివరికిటు తిరిగి "సాముగరిడీలు మీ రెందుకు నేర్చుకోగూడదూ?" అనడిగాడు సూరిశాస్త్రిని సాదారంగా.

"ఎందుకు నేర్చుకోగూడదూ అనికాదు, చిన్నప్పణ్ణుంచీ అంత మక్కువ వుంది కదా, యెందుకు నేర్చుకోలేదూ అనడగండి!"

"ఇంకేమీ? మనం యిద్దరమూ కలిసి నేర్చుకుందాం"

"బాగానే వుంది కాని; యిటు వారాల భోజనం చూసుకోడానికీ, అటు భట్టాచార్యులవారిని సేవించుకుంటూ నాలుగక్షరాలు నేర్చుకోడానికే చెల్లిపోతుంది నాకు కాలం."

"రోజు కొక్క గంటే వీలు కాదంటారా?"

మొగం పక్కకి తిప్పుకుని సాలోచనగా తల పంకించుకున్నాడు సూరిశాస్త్రి.

"అలోచించండి, బాగా."

"నేర్చుకోడాని క్కాదు అలోచన"

"మరెందుకూ?"

ఉండుండి "నేను సాముగరిడీలు ప్రారంభిస్తే ఈ అగ్రహారంలో నాకు అన్నం ధొరుకుతుందా?" అనడిగాడు సూరిశాస్త్రి నిరాశగా

గతుక్కుమనిపోయాడు సీతాపతి.

వైదిక విద్యలకు మాత్రమే అదరగౌరవాలున్న వూరది.

కళానిపుణులు—వైద్యులు కూడా పంక్తిబాహ్యులన్న నిశ్చయంతో వున్నవా రావూరి పెద్దలు.

వేదశాస్త్రా లల్లుకుపోయినచోట మరో విద్యకు అస్కారం వుండకపోడం సంప్రదాయమేగా?

పోనీ, అగ్రహారం దారే మారిపోయా డనుకుంటే, చాటునా మాటునా ఆయన కెన్ని పంగనామాలూ?

"నిజమే" అనుకోక తప్పింది కాదు సీతాపతికి.

కాని "యింతవరకూ మా యింటో మీ కొక వారం వుండనే వుంది తక్కిన వారాలవా రెవ రెయినా తిరస్కరిస్తే మీకు మరో మూడు వారాలిస్తాను, ముగ్గురు కొత్త విద్యార్థులు కోరుతున్నారు వాళ్ళని కాదని. కాలక్షేపం జరగదూ?" అనడిగా డతను.

దానిమీద "మీ రేవిద్య నేర్చుకున్నా మా యింటో వారానికి విఘాతం లే"దన్నాడు కృష్ణయజ్వ.

"చాలా సంతోషమూ, మీకు చాలా వందనాలూను. ఏతావాతా.- అనుమానమే కాని ఆందోళనకారణం పుట్టకేపోవచ్చు. అయినా, మరో రెండు సందేహాలు కూడా వున్నాయండీ!"

"ఏమి టవీ?"

"ఒకటి-రామశాస్త్రిగారు నా కవకాశం యిస్తారా?"

"నే నున్నానుగా?"

"భట్టాచార్యులవా రంగీకరిస్తారా?"

తప్పనిసరిగా సీతాపతి ఆలోచనలో పడ్డాడు

"పిన్నిగారు కనక మనవిచేస్తే వారంగీకరించకపో రన్న ధైర్యం లేకపోలేదు సుమండీ!"

సీతాపతి అప్రయత్నంగా తల పంకించుకున్నాడు, అంతే.

ఇద్దరు మౌనంగా బయలుదేరారు.

"రామశాస్త్రిగారిని నా మాట కూడా అడగరా" అంటూ సీతాపతి వెంటబడ్డాడు కృష్ణయజ్వ.

"వాళ్ళకే యిస్తే మనకీ యిస్తారు శాస్త్రిగా రవకాశం, రారా" అంటూ భోగప్ప చెయ్యి పట్టుకు లాగాడు రామచంద్రుడు.

ఒక మళుపు తిరిగాక "నే నీ విషయం పిన్నిగారితో మనవిచేసుకునేదాకా నా సంగతి మీరు రామశాస్త్రిగారి దగ్గర తేవద్దు" అని సీతాపతికి చెప్పి సూరిశాస్త్రి దిగడిపోయాడు.

## 4

మరో మళుపు తిరిగాటప్పటికి సూటిగా అడ్డంగా వచ్చి "నుంచో" అంటూ గుండెలమీద చెయివేసి ఆపుచేశాడు కొండుశౌతి సీతాపతిని.

"అక్కడ యేమి జరుగుతుందో చూసివుంటే నువ్వు నన్నాపుచేసి వుండవు" అన్నాడు సీతాపతి, శ్రౌతి చెయ్యి తన గుండెలమీదే పట్టుకుని

"అక్కడ జరుగుతున్నదానికి పూర్వరంగం యేమిటో తెలుసుకునివుంటే నువ్వింరుకు నన్ను తప్పుపట్టి వుండక పోదువు" అన్నాడు శ్రౌతి, ఆప్యాయంగా తానున్నా సీతాపతి చెయ్యి పట్టుకుని.

"అయితే, నీ యిష్టం వచ్చినంతసేపు నుంచుంటాను" అంటూ వీధి మధ్యగా వున్నవాడల్లా ఒక పక్కకి ఒత్తిగిల్లాడు సీతాపతి.

అందరూ ఒత్తిగిల్లారు, అనుకోకుండానే.

ఈ సందుబాట్లో "వీళ్ళతో మనకేం పనిరా? మనం ముందు వెళ్ళిపోదాం శాస్త్రిగారి దగ్గరికి" అన్నాడు, అపవారించి భోగప్పతో రామచంద్రుడు.

"తెలివిలాగే వుంది వాళ్ళు చెప్పుకునే మాటలు మనకీ ఉపయోగిస్తాయిరా" అంటూ భోగప్ప కూడా అపవారించే రామచంద్రుణ్ణి మందలించాడు.

"ఈ సాముగరిడీలకు పెద్ద కారణమే వుంది" అంటూ ప్రారంభించాడు, ఇంతలో శ్రౌతి.

"లేకపోతే యెందుకు ప్రారంభం అవుతుందోయ్?"

"నిన్న సాయంత్రం అన్నపూర్ణకొక సంబంధం వచ్చింది."

"ఒకటేమిటి, ఇరవయ్యో ముప్పయ్యో వచ్చివుంటే?"

పులుకూ పులుకూ చూసి "అన్నీ వొక్కమాటే వచ్చాయా?" అనడిగాడు శ్రౌతి

సీతాపతి తెల్లపోయాడు.

"కనక, చొప్పదంటు ప్రశ్నలు కట్టిపెట్టు."

"సరే"

"పెళ్ళివారితో నేనూ వెళ్ళాను, పెళ్ళికొడుకు ఇంటర్లో నాకు సహాధ్యాయి అయివుండినవాడు కనక."

"పోటీ కూడా యేమో?"

"నీక్కూడా నేమో? అప్రాచ్యుడా! సూదికోసం సోదికి వెడతావ్రా?"

"వీళ్ళకీ వుందీ ఆశా?" అన్నట్లు అపవారించి కనుబొమ లెగురవేసుకున్నాడు భోగప్ప.

అది వోరకంట చూసి, మొగాలు పక్కకి తిప్పుకుని ముసిముసి నవ్వులు నవ్వుకున్నారు రామచంద్రుడూ నరసావధానీని.

"సరే, ముందుకి వెళ్ళు" అన్నాడు సీతాపతి.

"ను వ్వేమయినా అను, అన్నపూర్ణకి తగ్గవరుడు బ్రహ్మిగాళ్ళలో పుట్టి వుండలేదెక్కడా, పుట్టే వుంటే వాడు రెండో జన్మ యెత్తవలసిందే!"

"అగ్రహారం అంతా చవుటిపర్రే అంటావా?"

"ఒక్క మన అగ్రహారం లెక్కేమిటి, ఆంధ్రదేశం అంతాను!"

"ఎంచేత నంటావ్?"

"పాత సంప్రదాయాలు చెయ్యి జారిపోయాయి. కొత్త సంప్రదాయం రూపొందలేదు. ఈ యుగ సంధిలో పుట్టుకు వచ్చింది అన్నపూర్ణ. దాని జీవితానికి సాఫల్యమే అబ్బుతుందో, అడివి గాసిన వెన్నెలలాగ అది వ్యర్థమే అయిపోతుందో మరి."

"అంత విశేషం యేమిటోయ్?"

"విశేషం కాక? ఇంకిన్ని మాటలెందుకూ? నిన్నటితో నా కళ్ళు విడ్డాయి, నాకు సత్యం గోచరించింది. నేను లాకాలే ప్రయత్నం విరమించుకున్నాను దాంతో."

"విరమించుకుని?"

కెవ్వుమన్న ట్టడిగాడు సీతాపతి.

"సాముగరిడీలు నేర్చుకుంటాను ముందు."

సీతాపతి వులిక్కిపడ్డాడు.

"అందుకోసమే మేము రామశాస్త్రిగారి దగ్గిరికి బయలుదేరాం" అన్నాడు రామచంద్రుడు, ఒక్క గంతులో ముందుకి వచ్చి.

అతనికేసయినా చూడకుండా "ఏం, అలా అయిపోయావేం?" అనడిగాడు శ్రౌతి సీతాపతిని.

"పెళ్ళివారిసంగతి చెప్పాముందు."

"అన్నపూర్ణ మాతామహుడు తీసుకువచ్చాడు సంబంధం."

"ఊళ్ళో వాళ్ళు పనికి రారని పైనుంచి యెన్ని సంబంధాలు తెచ్చినా అయనేగా?"

"ఇక తీసుకురాడు. అగ్రహారంలోనే అడుగు పెట్టడిక."

"అగ్రహారం శనీ మన శనీ కూడా విరగడ అయిపోయిందన్నమాటే!"

"రామశాస్త్రిగారు పెళ్ళివారికి దర్శనమే యివ్వలేదు. చెప్పుదెబ్బ కొట్టినట్టు మహా మంచిపని చేశారులే ఆయన. ఇంతకీ:— పెళ్ళికొడుక్కి అలకపాన్పు మీద కావలసిందేమిటో తెలుసా?"

"నువ్వు తెలియపరిచావా?"

మంగలికత్తి స్ఫురించేట ట్టభినయించాడు శ్రౌతి.

"అంటే?"

"మంచిరకం సేవింగు సెట్టోయ్!"

"ఛీ, ఛీ" అంటూ చుట్టుకుపోయాడు సీతాపతి.

అందరున్నూ చీదరించుకున్నారు, రకరకాలుగా.

చూసిచూసి "బందిపోటు దొంగలు నయం వాళ్ళకంటే" అంటూ మళ్ళీ అందుకున్నాడు శ్రౌతి.

"పెళ్ళి కొడుకు తండ్రి, పెళ్ళి కొడుకు మేనమామ, పెళ్ళికొడుకు చెల్లెలి మొగుడు, చివరికి పెళ్ళికొడుకు – నలుగురూ నాలుగు షరతుల జాపితాలు చదివారు. ఒక్కదాల్లోనూ సంస్కారిలక్షణం కనపడలేదు. ఒక్కడికీ మనం యెత్తింది బ్రాహ్మణ జన్మ అన్న జ్ఞానం లేదు."

"బ్రాహ్మడైనవాడు బ్రాహ్మణజన్మ మరిచిపోతే యిక వాడి ప్రవృత్తిలో తాండవించేది కసాయితనమేగా?"

"నామట్టుకి నాకు – తక్కినవాళ్ళ మాట యేమయినా, కనీసం, పెళ్ళి కొడుకు నయినా సాచికొడదాం అన్నంత రోషం వచ్చింది కాని; అంతపనీ అన్నపూర్ణ చేసేపింది లే!"

"ఏమిటీ?" అంటూ కెవ్వు మన్నా రందరూ.

శ్రౌతి జరిగిందంతా ఆచి ఆచి చెప్పాడు.

"ఓ! ఓ!" అంటూ గిరగిర తిరిగిపోయాడు సీతాపతి.

లోపల్లోపల "బాబోయ్" అనుకుంటూ కొంచెం వెనక్కి తగ్గాడు రామచంద్రుడు.

భోగప్ప కొయ్యయిపోయాడు

"మన అగ్రహారం పరువు నిలబెట్టింది అన్నపూర్ణ. నిజంగా, అది, చరిత్రలో స్వర్ణాక్షరాలతో రాయవలసిన సన్నివేశం. అయితే, దానికి పెళ్లికొడుకేమి బదులు చెప్పాడూ?" అనడిగాడు కృష్ణయజ్వ. అందరితోపాటుగా మొదట తానూ వొక్కమాటు చకితుడై.

కాని యెవరూ అది వినిపించుకోలేదు.

అప్పటికి ప్రకృతిలో పడి "వారేయ్! అన్నపూర్ణ మనకి తక్కుతుందనుకోను" – అంటూ సీతాపతి మాట సగంలో వుండగా అందుకుని "నన్ను కలపకు" అన్నాడు శ్రౌతి. గుండెలమీద తర్జనితో టొకాయించుకుంటూ.

"పోనీలే కలపను; కాని అన్నపూర్ణని పెళ్ళాడగలిగితేనే ధన్యత!"

"అది కాదు మాట. ధన్యుడైనవాడికే అది తక్కుకుంది."

శ్రౌతి యిలా వొత్తి చెప్పగా, రామచంద్రుడు, ఏడుపు మొగం పెట్టుకుని పక్కకి తిరిగాడు.

తనకీ అన్నపూర్ణకీ మధ్యవుండిన భూభాగం యింకా యింకా విశాలం అయిపోతోందని కంగారుపడుతూనే "అదిసరే కాని, అన్నపూర్ణ కేమి బదులు చెప్పాడూ పెళ్ళికొడుకు?" అని మళ్ళీ అడిగాడు కృష్ణయజ్వ.

"వాడి మొఘం – అన్నపూర్ణ తప్ప మరెవరూ లేని – సాలీనా పదివేల ఆదాయం వచ్చే – లక్షాధికారిని అప్రాచ్యపుకోరికలు కోరినవాడు అన్నపూర్ణ కేమి చెప్పగలడూ? వాడి కసలు నోరు స్వాధీనం అయితేనా?"

భోగప్పా రామచంద్రుడూ బిక్కుబిక్కు చూసుకున్నారు.

"విన్నావా?" అంటూ మళ్ళీ అందుకున్నాడు శ్రౌతి.

"ఎన్నడూ చూడనిదీ, విని అయినా వుండనిదిన్నీ, పైగా అనుకోనిది కూడానూ, దానా దీనా నాకూ అప్పుడు మాట తోచలేదు; కాని ఆ మాటతో నే నింతవరకూ యెరిగివుండని అంతరాంతరాల్లోకి వెళ్ళిపోయాను. రుక్మిణీ కల్యాణం, సుభద్రాహరణం, ద్రౌపదీస్వయంవరం, సత్యాపరిణయం, శివధనుర్భంగం – ఇలాంటి ఉదంతాలు నా కళ్ళముందు తిరిగిపోయాయి. అప్పుడు అన్నపూర్ణ మొగాన బాసించిన శౌర్య తేజస్సులో నాకు రుద్రమ్మా నాగమ్మా, రాగమ్మ, సాక్షాత్కరించారు."

ఈమాట చెప్పేటప్పుడు శ్రౌతికీ, వినేటప్పుడు సీతాపతికీ శరీరాలు గరిపొడిచాయి.

"అబ్బరమా?" అంటూ అందుకున్నాడు సీతాపతి.

"అన్నపూర్ణ స్కూలుఫైనలు యోగ్యత ముందు నీ ఆనర్సూ, నా బియ్యేస్సీ కూడా యెందుకూ కొరగావనే మనం అంగీకరించాలి. ఇంగ్లీషుభాషని మనలో మనం సంభాషణకే వినియోగించుకుంటున్నాం; గాని–"

"అన్నపూర్ణ తెనుగువాళ్ళతో యింగ్లీషులో మాట్లాడదు తెలుసా?"

"ఇంగ్లీషు అంటకపోడమే అందుక్కారణం అనుకుంటూ వచ్చాను నేను. శాస్త్రిగా రొకమాటు "మా అమ్మాయి చదివిన యింగ్లీషుపుస్తకాల పేర్లయినా వినివుండరు మీ"రన్నారు "ఎంత బడాయిరా" అనుకున్నాను; కాని యిప్పుడర్థం అవుతోంది."

"ఏమనీ?"

"మనం ఆ భాషను మాత్రమే స్వాధీనపరుచుకున్నాం. అన్నపూర్ణ ఆ వాఙ్మయం జీర్ణం చేసుకుంది."

"అదీ అన్నపూర్ణకీ మనకీ వున్న తేడా. దాని భావాలు మారడానికీ, అదొక నిశ్చయానికి రావడానికీ, ఒక పథకం వేసుకుని అవి సాహసించి ఆచరణలో పెట్టడానికీ కారణం అదీ!"

"అందుకు నే నంగీకరించను" అంటూ దురుసుగా ముందుకి వచ్చేశాడు రామచంద్రుడు.

అందరూ చూసి వూరుకున్నారు.

దాంతో రామచంద్రుని పొంగు చల్లారింది. అయినా వుండలేక "ఇంగ్లీషు నేర్చుకోకపోతే మనకుద్యోగాలు దొరకవు. కనక, మనం, ఆ భాష అన్వయపద్ధతీ. ప్రయోగసరణీ – ఇవి మాత్రమే సాధించుకోవాలి. ఆ భావాలు జీర్ణం చేసుకున్నామంటే మాత్రం మన జాతీయత దెబ్బతింటుంది" అన్నాడు, చురుగ్గా చూస్తూ.

దీనిమీద "తీసెయ్ నీ జాతీయత" అంటూ అంతకంటే ఆవేశంతో యెదురుకున్నాడు సీతాపతి.

"మనకున్నది వర్ణవ్యవస్థ కాని జాతీయత కాదు. అది కాలంలో మనదేశం విజాతీయుల పాలబడడానిక్కారణం అదీ. ఈ వర్ణవ్యవస్థకి తోడు అప్పటి మనవాళ్ళకి 'నా రాజు' అనేకాని 'నా దేశం' అనేభావం లేకపోయింది. ఇంగ్లీషు ప్రభుత్వం వచ్చాకే మన కీభావం పుట్టింది. బలపడింది."

"ఇంగ్లీషు ప్రభుత్వంలో మన జీవనసరణి మారిపోయింది. మన విశ్వాసాలు కదిలిపోయాయి." అన్నాడు రామచంద్రు. గుక్క తిప్పుకోకుండా.

"కనకనే మనం మళ్ళీ వెలుగు చూడగలిగాం."

"అవు"నన్నాడు సీతాపతి.

"ఇందులో వున్న విశేషం గుర్తించావా?" అని సీతాపతి నడుగుతూ అందుకున్నాడు శ్రౌతి.

"తనకి తెలుయకుండానే ఇంగ్లీషు ప్రభుత్వం మనకు చేసిన ఉపకారం యిది. అటు 'నా రాజు' అనే భావమూ, ఇటు 'నావిష్ణుః పృథివీపతిః' అన్న నమ్మకమూ ముదిరిన కాలంలో ఊరూరా రాజులు వెలిశారు. దీంతో మనం విభేదమే గాని ఐక్యం అన్నమాట మరిచిపోయాం. అది పోయి 'నా దేశం' అన్నభావం కొత్తగా అనుభూతం

సుందరే అందనుకున్నాడు మొదట; కాని నిదానించగా, పక్కకి చూస్తోందామె సాలోచనగా.

ఆమె కా దని నిశ్చయించుకున్నాడు.

"సుందరే అయితే నువ్వనదుగా?" అనుకుని కూడా అతను సమాధాన పడ్డాడు.

ప్రాణాలు కుదుటపడ్డాయి.

అయితే, సుందరి చాలా ఆదుర్దాపడిపోతోంది, యీ విషయమై.

చివరి కేది యేమయినా తనవల్ల ప్రయత్నలోపం లేదని ఆమె గుర్తించాలి.

"రేపు సాయంత్రం అయిదు కొట్టేదాకా పుచ్చుకుంటూనే వుంటారుట దరఖాస్తులు. పుచ్చుకోడం యేమిటి, డబ్బాలో పడెయ్యడమేట కళ్ళు మూసుకుని" అన్నాడతను, సుందరి వాలకం పరిశీలిస్తూ.

"స్! రామయతండ్రీ!" అని మాత్రం అందామె, కళ్ళు మూసుకుని యిటున్న మొగం అటు తిప్పుకుంటూ,

"పడేస్తూనే వున్నారుట, గుంపులుగా కలిసికూడా వచ్చి!"

ఇలా అని మళ్ళీ పరిశీలించా డతను.

"అయితే—" అంటూ మాట నాన్చేశాడతను. సుందరి దృష్టి యిటు తిప్పాలని.

అనుకున్నట్టే చూసింది; కాని "యేమిటి అయితే?" అనడిగిం దామె, నిలవతీస్తున్నట్టు చూస్తూ

ఆలోచించాడు:

తలలో ఒక మెరుపు మెరవగా కళ్ళు జిగాల్ మన్నాయతనికి.

"నేను చెన్నపట్నం వెళ్ళాను కనక, వెళ్ళి పదిరూపాయల కాగితం అక్కడి పెద్దగుమాస్తాగాడి మొగాన కొట్టాను కనక, నాకు తెలిశాయీ...రహస్యాలు, కూప కూర్మంగాళ్ళ కేం తెలుస్తాయీ?" అనడిగా డతను, గోపాలశాస్త్రినుద్దేశించి, మొగం అంతా గర్వం చేసుకునీని.

"మరి తెలుసుకుంటే కలిగే ప్రయోజనం?" అనడిగింది సుందరి, అవ్యవధానంగా.

అటు చూస్తూనే యీాదాలాభంగానే అడిగింది తానైతే.

కాని అడిగి మాత్రం అతని కళ్ళల్లోకి చూసింది, నిదానంగా.

చూపించిన గడుసుదనం అంతా వ్యర్థం అయిపోయింది, దీంతో.

చలపతి గుండెలు దడగడలాడిపోయాయి

చూపులు చెదిరిపోయాయి.

కంఠం బిగుసుకునేపోయింది.

చూసింది చూసింది. "అవునులెండి. ఎంతమంది యెగబడ్డా అంతమందిలోనూ దొరక్కావలసినవా డొక్కడే. ఎవర్తి పెట్టిపుట్టిందో మరి, అంతమందిలోనూ పెనిమిటి ప్రయోజకత్వం అనుభవించడానికి" అంది సాలోచనగా సుందరి.

చలపతి కొయ్యయిపోయాడు.

ధర్మమే.

ఉద్యోగం దొరక్కపోడం కంటే, బి.ఏ. అయినవాడికి, తన భార్య తన దుర్దినాలు గుర్తించకపోడం చాలా బాధాకరం మరి.

అయితే, ఉద్యోగం స్వాయత్తం కాదు.

ఈ క్లిష్టపరిస్థితుల్లోంచి బయటపడగలగడం మాత్రం స్వాయత్తం. కనక, తన నిర్విణ్ణత ఆమెకి తెలియకుండా వుండాలని గభీమని పక్కజేబులో చెయ్యిపెట్టి అగ్గిపెట్టీ కరీంబీడీ చర్రున పైకి లాగాడు చురుగ్గా చూస్తూ.

ఈ మాటలు కొన్ని వినపడ్డాయి సుబ్బమ్మకి, కొన్ని వినపడలేదు.

వినపడ్డంతవర కయినా సమన్వయం కుదరలేదు; కాని పదిరూపాయలు గమస్తా మొగాన కొట్టిరావడం మాత్రం స్పష్టంగా తెలిసిం దామెకి "ఇంకేం, గడ్డి తినిపించే వచ్చాడు, కనక, ఉద్యోగం తప్ప" దని స్థిరపరచుకుం దామె చలపతికి.

దాంతో, నిరసనభావం పోయి ఆదరభావం పుట్టుకు వచ్చిందామెకి

తన బాధ్యత కూడా గుర్తుకి వచ్చింది.

"గోపిగాడికంటే ముందే వెళ్ళాలి చలపతి. కనక, రేపు తొమ్మిదింటికే భోజనం పెట్టేస్తానితనికి, అరటికాయ ముక్కలు వేయించి" అని స్థిరపరుచుకుంది.

"కాళ్ళు కడుక్కో, నిమిషంలో కాఫీ చేసేస్తా"నంటూ చెంబూ నీళ్ళూ అక్కడ వుంచేసి యింటోకిన్నీ వెళ్ళిపోయింది, వ్యాచలాగ.

ధుమధుమ లాడిన అత్తగారిలా అనడం "దాసోహం" అనడంగా భావించుకుని బాగా పురెక్కాడు చలపతి.

ఎక్కడ లేని చురుకూ వచ్చిందతనికి.

అది చేతుల్లో కనపడింది మొదట.

గుప్పు మంది అగ్గిపుడక, దాంతో; కాని అందుకు మొగం చిట్లించుకుంటూ యిటున్న మనిషి బొంగరం లాగ అటు తిరిగి "నీళ్ళు తోడి వుంచుతాను నూర్దగ్గరికి రండి, స్నానం చేద్దురుగాని" అంటూ పెరట్లోకి బయలుదేరింది, సుందరి, కాళ్ళీడ్చుకుంటూ.

ఇంతలో బీడీ అంటించి, ఎందునా లేని శ్రద్ధతోనూ ఏకాగ్ర దీక్షతోనూ ఒక్క దమ్ములాగి "చూడూ, స్నానికేం గానీ – ఈ రెయిలు ప్రయాణాలతో వుడుకు చేసేసింది. కమ్మగా నిద్రపోయి నాలుగుదినా లయింది, కనుక భోజనం చేసి చెయ్యి కడుక్కునేటప్పటికి పక్క సిద్ధం చేసి వుంచాలి, తెలుసా?" అన్నాడు చలపతి, అక్షరం అక్షరమూ బీడీపొగతో పొదుపుతూ.

"ఏ వూ రండీ మీదీ?"

"అమలాపురం తాలూకా."

"పల్లెటూ రన్నమాట!"

"హా! హా! హా!"

"ఏం, నవ్వుతున్నారు?"

"పల్లెటూళ్ళకి వెళ్ళమంటున్నారు కాంగ్రెస్సు పెద్దలు. పరిస్థితులు పట్నాలకు తరుముతన్నాయి, మరి."

"ఏం చదివారు?"

"చదవడం యేమిటి, తెగేసి అన ర్సాయి వుంటే?"

"ఏం చేస్తున్నారు?"

"ఊరికే కూచోడం యెందు కని – ఎందు కయినా మంచిదని ట్రెయినింగు పూర్తిచేసుకుందా మని – రిజుల్టుస్కూల్లో పని చేస్తున్నానింకా."

"ఎన్నాళ్ళనుంచీ?"

"రమారమీ మూడేళ్ళనుం చనుకోండి!"

"ఏమాత్రం కిడుతోంది?"

"... ...."

"మనలో మనమాట సుమండీ!"

"టీ, బీడీ!"

☆ ☆ ☆

"ఏవూ రన్నా మీది?"

"కర్నూలు. మరి మీది?"

"గజపతినగరం గ్రాడ్యూయేటా?"

"ఎం.ఏ., బి.ఎల్."

"అబ్బా!"

"మరి మీరు?"

"ఎం.ఎస్‌సి. మరి అంతటితో ఊరుకున్నా రేం?"

"ట్రెయినింగు సీటుకోసం నాలుగేళ్ళుగా తంటాలు పడుతూనే వున్నానండీ?"

"బల్లకట్టరూ?"

"ఈమాత్రం కిడుతుం దన్న పూచీ యేదీ?"

☆ ☆ ☆

"విన్నావా?"

"అనుకో."

"నాకీ వుద్యోగం దొరక్క పోతేనే మంచిది సోదరా!"

"అదేమి భ్రాతా?"

"చాలా పెద్దగాథ అది."

"పోనీ, తీరా, దొరికేస్తే?"

"పనిలో చేరిన మర్నాడే ఆరుమాసాల సెలవుకి దరఖాస్తు పడేస్తా, డాక్టరు సర్టిఫికెట్టు జతచేసి."

"సిద్ధపడ్డం యెందుకూ మరీ?"

"ఇల్లరికం రావాలని షరతు పెట్టి పిల్ల నిచ్చింది మొదట 'నా కూతురు లక్షాధికారి గదా, నువ్వుద్యోగం చెయ్యకపోతే నలుగురిలోనూ తలయెత్తుకుని తిరగడం యెలాగా?' అంటూ పీకలమీద కూచుం దిప్పుడు మా అత్తగారు."

"మీ ఆవిడ యేమంటారు?"

"ఉద్యోగం చేసి మీరు పట్నంలో యింటి అద్దె సంపాదించండి. దర్జాగా పోషిస్తుంది మా అమ్మ—"

"ఉద్యోగం దొరక దనుకోండి?"

"నాకేం దొరక్కపోతే? పెళ్ళి కదొక షరతుకాదు, తెలుసా? బాగుందండోయ్, పుత్రెను పుట్టనిదానికి నాదా పూచీ? అదంతా వాళ్ళు చూసుకోవలసిందే."

"సెబాస్!"

"వాళ్ళు పీక్కుతినేశారు, నేను దరఖాస్తు పడేశాను, దానికీ దీనికీ చెల్లు."

"మంచి లెక్కగాళ్ళండీ మీరు!"

"అయ్యో, కిట్టింపు చూసుకోవాలి దేన్లో అయినా."

"దరఖాస్తు పడెయ్యడంలో—"

"ఖర్చుల కని పాతికరూపాయ లిచ్చి పంపింది మా అత్తగారు."

"మంచి ఔదార్యమే!"

"మరి, మన ప్రతిభ?"

"ఇంకేమిటీ విశేషం?"

"లక్షాధికారి మొగుడు ఉద్యోగం కొట్టుకురావడానికి వెడుతున్నాడు. ఆలోచించుకో' అన్నాను. మా ఆవిడ మరో పాతికరూపాయ లిచ్చింది."

"తల్లికి తగ్గ కూతురు—"

"మరి, అల్లుడు తీసిపోయా డనా మీ వుద్దేశం?"

"అబ్బే, మీరా తీసిపోడం?"

"గుర్తించారు కదా? వాళ్ళనీ వాళ్ళనీ చూడవలసి వుంటుందని చెప్పి మూడు రోజులకిందట ప్రవేశించా నిక్కడ. ఇంటి దగ్గిర వీలులేకపోడం చూసుకుని దినానికి మూడు సినిమాలు చూస్తున్నాను దర్జాగా. చివరికి, అరడజను డబ్బాలు పాసింగుషో కొనేస్తాను. 'నన్నేం చెయ్య మన్నా' వనడుగుతూ తెల్ల వారాటప్పటి కింటికి వెళ్ళి కూచుంటాను."

☆ ☆ ☆

"అరే, మీరు విద్వాన్ గదా శర్మగారూ?"

"హైస్కూల్లో దరఖాస్తు పడేసినప్పు డది."

"మరి, యిప్పుడు?"

"బి.ఎస్సి."

"ఎప్పుడూ వినలేదే?"

"మీరు వినం దింకోటేంది."

"అదేమిటి?"

"మాధ్యమిక్!"

☆ ☆ ☆

"మీ రెక్కడ్నుంచి వచ్చారండీ?"

"ముందు మీ సంగతి చెప్పి తరవాత అడగండి, నా భోగట్టా."

"నేను మచిలీపట్నం నుంచి వచ్చాను. బి.ఏ. అయినాను బి ఎల్, చీదేసింది. ట్రెయినింగు కోసం చూస్తున్నాను. నౌకరీకోసం తంటాలు పడ్డమే ఒక గొప్ప ట్రెయినిం గనిపిస్తోంది. జీతం యెంత అని లేదు, ఉద్యోగం చెయ్యాలి. ఇదీ నా దీక్ష, ఇందుకోసం వచ్చా న్నేను."

"ఇక వినండి. నేను మొదట శ్రీకాకుళంలో యిల్లు విడిచాను. చెన్నపట్నం నుంచి యిక్కడ వాలాను. మా అత్తగారి చేతి ప్రసాదం పుచ్చుకుని యిలా వచ్చాను, చివరికి."

"చదువు—"

"నాలుగేళ్ళాయి, బి.ఏ అయిపోయానుగదా?"

"అయితే, మీరుకొట్టేస్తా రిది తప్పదు."

'ఏమి నేస్తం' అలా అనేశారూ?

"మీ దీక్ష అసాధారణంగా కనపడుతోంది"

"ఊహూ!"

"చిల్లిగవ్వా రూపాయీ మీకు సమానం అనిన్నీ తోస్తోంది నాకు."

"కనక?"

"ఖర్చుపెట్టేవాడికి డబ్బివ్వడం పూచీ భగవంతుడిది."

"అన్నారూ? అదీ మాట. ముందిది స్వీకరించండి, దయవుంచి."

"బీడీకట్ట కూడా తెచ్చారు మీరు, భారతజాతీయం అదే దయచేస్తురూ!"

"అదే అన్నమాటేమిటి, రెండూ పుచ్చుకోండి, లోటేమిటీ?"

"నిజంగా, యూరపియన్లు దగ్గిర వుండవలసినవా రండీ మీరు!"

"గుర్తించారుగదా? ఏదీ షేక్ హేండు. అదీ నా ధైర్యం. కీడెంచి మేలెంచమన్నాడు శాస్త్రకారుడు. నాకిది కాదంటారా? బాధపడను. రెండు దినాలుగా హరనాథప్రభువుని ప్రార్థించుకుంటున్నాను, గాఢంగా. ఏమనంటారా?, 'ప్రభూ, నువ్వూ చిన్న నౌకరీచేసి దేవుళ్ళాడినవాడివి. కనక, యిది నాకే అనుగ్రహించు. లేదూ? మా వాడొకడు నా మీదికి పోటీకి వచ్చాడు. నాక్కాకపోతే మరెవరికయినా యిప్పించు. వాడికి మాత్రం' — విన్నారా? చివరికి మీకిచ్చినా సంతోషిస్తాన్నేను."

## 6

కంపెనీ ఆవరణ అంతా నిండివున్నారు దరఖాస్తుదార్లు. పొట్టి, పొడుగు, లావు, సన్నం — నలుపు చామనచాయ ఎరుపు — క్రాపింగులు డిప్పలు ఇసలాలు — ఇజార్లు పంట్లాములు పంచెలు — టోపీలు పోట్టులు టర్కీటోపీలు— చుట్టలు సిగరెట్టులు బీడీలు — కోడిమీసాలు గీరమీసాలు నిమ్మకాయనిలిపే మీసాలు నిశ్మశ్రువులు — ప్రపంచంలో వున్న రకాలన్నీ వున్నాయి వారి దగ్గిర.

అందరూ యేమిటేమిటో మాట్లాడుతున్నారు.

చర్చలు చేస్తున్నారు.
విమర్శిస్తున్నారు.
ఆత్మోత్కర్షా పరనిందా సాగిస్తున్నారు
నవ్వుతున్నారు.
కాని హఠాత్తుగా అందరూ ప్రతిమలయిపోయారు.
చూడగా, అప్పుడే వచ్చిన చిన్నదొర, పోర్టికలో కొలువు తీరాడు.
ఏదో వొక కాగితం చేతబుచ్చుకుని వచ్చి మానేజరు దొర మేజాదగ్గరే వొక పక్కగా కూచోగా దరఖాస్తుల కట్ట తెచ్చి మేజామీద వుంచి, వెళ్ళి దొరవెనుక నుంచున్నాడు బిళ్ళ బంట్రోతు
వచ్చీరావడంతోనే మెయిలుపత్రిక విప్పాడు దొర.
అయిదు నిమిషాలపాటు వంచిన తల యెత్తలేదతను.
దరఖాస్తుదార్లు ఊపిరికూడా బిగపట్టుకుని వున్నారు
అప్పుడు చూశాడు దొర వారికేసి.
ఒక్క నిమిషమే చూశాడు.
వెంటనే వాచీ చూసి మానేజరుతో యేదో మాట్లాడాడు.
తల వూపుతూనే, సులోచనాలు తీసి జేబురుమాలుతో తుడుచుకుంటూ లేచినుంచున్నాడు మానేజరు.
ప్రకృతి అంతా స్తబ్దం అయిపోయింది.
దరఖాస్తుదార్ల గుండెలు మాత్రం దడదడ కొట్టుకోసాగాయి.
మానేజరు ప్రారంభించాడు:
"ఏకకాలంలో దిగ్గజాలవంటి యింతమంది విద్యావంతులను చూడగలగడం మా అదృష్టం. మీ కందరికీ దొరగారు శుభం కోరుతూ స్వాగతం యిస్తున్నారు. మీ అందరి జీవితాలూ మిక్కిలీ తేజస్వంతాలు కావాలనిన్నీ వారు కోరుతున్నారు. అయితే, మాకు కావలసింది ఒక్కడే గుమాస్తా! గప్‌చిప్పుగా వొక యువకుణ్ణి నియమించుకుని మా పని మేము సాగించుకోడానికి వీలు లేకుండా యింతమంది వచ్చి యిది జటిలమైన సమస్య చెయ్యడం మాత్రం మా దురదృష్టం.
"ఈ పదవి గ్రేడ్డు యాభై మొదలు ముప్పాతికదాకాను. సంవత్సరానికి రెండు రూపాయలు ప్రమోషను కూడా వుంటుంది. తమ కొలువులో వున్న వారికి సర్కారువా రిచ్చినంత కాలమూ మేమున్నూ పదహారు రూపాయలు అలవెన్సు ఇస్తూ వుంటాము. ఈ సంగతులన్నీ మీరు మా పత్రికా ప్రకటనలో చూసే వున్నారు.
"అయితే యిందుకోసం దరఖాస్తుచేసి యిక్కడికి వచ్చిన మీ సంఖ్య రెండువందల యాభై. ఒక్క యిసుక రేణువుకోసం సముద్రం వొడ్డుకు వెళ్ళినట్టయిందిప్పుడు మా పని. మీలో తూర్పున బరంపురం, దక్షిణాన చెన్నపట్నం, పడమట బళ్ళారి, ఉత్తరాన దుమ్ముగూడెం – యీ హద్దుల మధ్యస్థానాలయిన అన్ని జిల్లాల ప్రాతినిధ్యమూ, ఈ సంఖ్యా మా కంపెనీ యెడల ఆంధ్రదేశీయుల కుండుకున్న ఆదరాభిమానాలు సూచిస్తున్నాయి. మేమిందుకు మిక్కిలీ గర్విస్తున్నాము

"కాని యింతమందిలో నిర్ధారణ చేసి వొకణ్ణి తీసుకోడం మాకు చాలా కష్టమైన పని. నిజంగా అసాధ్యం అనే చెప్పాలి. ఈ బాధ్యత నిర్వహించుకోడం యెలాగో మేము గుర్తించలేకుండా వున్నాము. కనక, ఈ అధికారం– అంటే, యింతమందిలో నుంచీ వొక యువకుణ్ణి విడమర్చి మాకు నిర్దేశించే అధికారం మీలో వొకరి కిచ్చేస్తున్నాము. ఆ పెద్దమనిషి మాట మేము సర్వాత్మనా శిరసావహిస్తాము. ఏమీ ఆక్షేపించం. కారణాలు కూడా అడగం. మీరందరూ బాగా చదువుకున్నవారు. నిశితమైన ప్రతిభగలవారు. మా పరిస్థితులూ మీ పరిస్థితులూ కూడా చక్కబెట్టగల శక్తిసామర్థ్యాలు మీకు నిండుగా వున్నాయి. కనుక యిందు కంగీకరించే వారెవరో యిలా వచ్చి యీ పీఠం అలంకరించండి."

ఒకటి–రెండు–మూడు నిమిషాలు చూశాడు దొర.

మానేజరు మరో నిమిషం చూశాడు.

అయినా, యెవరూ ముందుకు రాలేదు.

చూసిచూసి దొర యేదో చెప్పగా మానేజరు మళ్ళీ లేచాడు:

"మా ఆశ నెరవేరలేదు. ఇందరు విద్యాధికుల్లో వొక్కరున్నూ మా ప్రార్థన మన్నించలేదు. ఇందుకు మీలో యెవరినీ మేము నెపపెట్టం. పరిస్థితు లలా వున్నాయి మరి. ఇక మాకు మేమయి మాకు తోచిన పద్ధతి అవలంబిస్తాము."

ఇలా అనిన్నీ మళ్ళీ వొక నిమిషం ఆగి, మళ్ళీ దొరతోనున్నూ మంతనం చేసి మానేజరు ప్రారంభించాడు·

"నిజాని కీపనికి స్కూలుఫైనల్లో తేరినవారు చాలు మా ప్రకటనలో యీ సంగతి మేము స్పష్టపరిచేవున్నాము; కాని, మీలో స్కూలు ఫైనలు దగ్గిర నుంచి డబుల్ ఎం.ఏల దాకా వున్నారు కాలేజీ ఫస్టులే కాదు, యూనివర్శిటీ ఫస్టులున్నూ వున్నారు చాలామంది. అంచేత, మేము, ప్రకటించిన అర్హత మాత్రమే పట్టుక్కూచోడానికి వీలులేదు. ఏమంటే? మన ప్రెసిడెన్సీలో మన బాధ్యత అంతా తమ భుజాస్కంధాలమీద వుంచుకుని మూడు గొప్ప యూనివర్సిటీలు ఏటేటా అనేక వేలమంది పట్టభద్రులను నిర్మించేస్తున్నాయి మీలో అన్యరాష్ట్రాల యూనివర్సిటీల కున్నూ గౌరవప్రతిష్ఠలు కలిగించినవా రున్నారు. కాగా, యూనివర్సిటీలను మేము గౌరవించ వలసి వుంది. మా బాధ్యత మేము మరిచిపోలేము కనుక, మీలో యూనివర్శిటీ పరీక్షల్లో వొక టయినా నెగ్గనివారు మాకక్కర్లేదు, వెళ్ళిపోవాలి."

ఇలా చెప్పి, దొరకేసి చూస్తూ తాపీగా కూచున్నాడు మానేజరు; కాని, యువకుల్లో, వొక్కడూ కదల్లేదు, పైపెచ్చు, సముద్రాలన్నీ వొక్కమాటుగా తిరగబడ్డంత కోలాహలం రేగింది వారిలో.

తరవాత కొందరు తమ దౌర్భాగ్యదశని తిట్టుకున్నారు

కొందరు, కంపెనీనీ, దొరనీ, మానేజరునీ, తమకేసి "కదలరేం?" అన్నట్టు కరుగ్గా చూస్తున్న బిళ్ళ బంట్రోతునీ దురుసుగానే తిట్టారు, కంఠం మాత్రం బిగపట్టుకుని.

పెద్దపెద్ద పరీక్ష లిచ్చిన్నీ యీ చిన్న పదవికోసం తమతో పోటీపడుతున్నవారిని లోపల్లోపల పడతిట్టారు, కొందరు

చివరికి ముప్పయిముగ్గురు యువకులు బయటకు వెళ్ళిపోయి, ఆ పదవి యెవరు కొట్టేస్తారో చూసి మరీ వెడదామని యెండ తీక్షణంగా వున్నా ఆవరణ బయట గోడలవారా, చెట్లకిందా మకాం వేశారు.

## 7

పెద్దా పిన్నా తారతమ్యం లేకుండా తమతో పోటీకి వచ్చిన లేతసరుకిలా వెళ్ళిపోయినందుకు, ఉండిపోయిన వారందరూ మిక్కిలీ సంతోషించారు.

వారిలో ప్రతీవాడూ, తనచుట్టూ విద్యాధికులే వుండినందుకు చాలా గర్వించాడు; కాని ప్రతీవాడూ తనకి పోటీగా వుండడం గుర్తించుకుని చాలా అసహ్యించుకున్నాడు.

ఈ స్థితిలో మానేజరు మళ్ళీ లేచాడు.

"మీ రిప్పు డొక సంగతి బాగా గుర్తించాలి. మేమిప్పుడు నియమించుకునే గుమాస్తా కాషియరుకి జూనియరుగా వుండాలి. ఇందుకు తగ్గట్టు, మాకిప్పుడు పట్టభద్రుడే దొరుకుతాడు కనక, క్రమాంతరాల మీద కాషియ రయిపోయే అదృష్టం ఆ యువకుడికిన్నీ పట్టాలి. అంచేత మేమిప్పుడు మేధమేటిక్సు గ్రాడ్యూయేటుని తీసుకుంటాం. తక్కినవారు వెళ్ళిపోవచ్చు" నని చెప్పి అతను సావకాశంగా కూచున్నాడు.

చూసిచూసి "కానివారు వెళ్ళిపోవా"లంటూ వురిమాడు బిళ్ళ బంట్రోతు

వెంటనే మరో నలభై ఆరుగురు వెళ్ళిపోయారు, మెల్లిగా.

మానేజరు చురుగ్గా లేచాడు మళ్ళీ.

ఉండిపోయినవారు, సంఖ్య తగ్గినందుకు సంతోషించిన్నీ మానేజరు మళ్ళీ యెలాంటి పేచీ లేవదీస్తాడో అంటూ దిగులుపడిపోయారు.

మానేజ రందుకున్నాడు:

"చెన్నపట్నం, బొంబాయి, కలకత్తా,ప్రెసిడెన్సీలలో మా కంపెనీకి మొత్తం ముప్ఫయితొమ్మిది బ్రాంచీలున్నాయి. బర్మాలో వుండిన పదీ, సిలన్‌లో వుండిన అయిదూ కూడా మళ్ళీ త్వరలోనే పని ప్రారంభిస్తాయి. ఇప్పుడు మేము నియమించుకునే గుమాస్తా వీటిలో యే బ్రాంచి కెప్పుడు వెళ్ళమన్నా నుంచున్న పాటున వెళ్ళేవా డయివుండాలి. అందు కిష్టపడలేనివారు వెళ్ళిపోవచ్చు" అన్నాడతను మళ్ళీ.

యువకుల్లో మళ్ళీ వోపాటి కోలాహలం రేగింది.

"ముందే చెప్పావు సంతోషించాం" అంటూ గొణుక్కున్నారు, కొందరు మెల్లిగా దారిపడుతూ.

"ఈ మాత్రం భాగ్యానికి బదిలీలు చేస్తాట్ట వీడు, బదిలీలు! ఎవడిక్కావాలి రండయ్యా, యీ కూసు నౌకరీ?" అనుకుంటూ మరికొందరు బయలుదేరారు.

"పరుగెత్తి పాలుతాగడం కంటే నుంచుని పచ్చిమంచినీళ్ళు తాగడం మంచిది" అనుకుంటూ మరికొందరు వెళ్ళిపోయారు.

"పొట్ట చేత్తో పట్టుకుని అరువేల మైళ్ళనుం చిక్కడికి వచ్చాడు వీడు. అందరినీ తనలాగే తయారుచేద్దా మనుకుంటున్నాడు కామోసు– హే!" అంటూ కొంచెం గట్టిగానే అంటూ మరొకడు వెళ్ళిపోయాడు.

వెరశి వారి సంఖ్య 59.

వారిలో ఒక బి.ఎల్. చురుగ్గా వెళ్ళి గేటు మధ్యగా నుంచుని, తీక్ష్ణంగా చూస్తూ మొగం మాత్రం యిటు తిప్పి "మీ ప్రకటనలో యీ షరతు లేదు. మాలో యెవడయినా యీ కొత్త కల్పనకు దావా పడేస్తే యూరపువెళ్ళి తిరిగి చూడాలి నువ్వు, తెలుసా?" అంటూ వురిమి బుర్రవంచుకుని తక్కిన వారిలో అంతర్ధానం అయిపోయాడు.

దీనిమీద చిరునవ్వు రాగా అణుచుకుని మానేజరు మళ్ళీ లేచాడు.

"మన సాంఘికధర్మాలు విలక్షణ మైనవి. ఇతర్ల ధర్మాలతో పోల్చి చూసుకుంటే, వాటిలో చాలా మంచివీ వున్నాయి, చాలా చెడ్డవీ వున్నాయి. ఏమయినా, యుగ యుగాలుగా మన జీవితాలతో పెనవేసుకుని వున్నాయవి. ఎంత కాదనుకున్నా మన మవి పూర్తిగా మార్చుకోనూ లేము, కొంత మార్చుకోకా తప్పదు. ఎంత నవీన దృక్పథం అవలంబించినా మనలో భార్యలను భర్తలే పోషించాలి, నేటికీ, ఎంత ప్రతిభావంతురా లయినా, భార్య, ఏదయినా వృత్తి అవలంబించి ధనసంపాదన చెయ్యడానికి మన ధర్మం ఒప్పుకోదు అంచేత, మేమిచ్చే జీతంతో ఒక యువకుని అర్ధాంగి కూడా సుఖంగా జీవించాలని మా అభిలాష కనక, మాకు బ్రహ్మచారు లక్కర్లేదు, వెళ్ళిపోవాలి" అని చెప్పి కూచున్నా డతను

ఆ మాట ముగిసీముగియడంతోనే యిరవైముగ్గురు యువకులు లేచారు.

వారితోపాటు ఇరవైమూడు కంఠాలు ఖంగుమన్నాయి.

దాంతో, తెలుగుభాషకి వాడిగే హేళన వాక్యాలు చాలామట్టుకు ఆకాశాన తోరణాలు కట్టాయి.

సంగతి తెలుసుకుని దొర గంభీరంగా చూశాడు.

వెళ్ళిపోయినవారిలో కొందరు సిగరెట్టులూ, కొందరు బీడీలు, కొందరు లంకాకుచుట్టలూ వెలిగించగా, కొందరు బయటి చెట్లెక్కి కూచున్నారు.

మానేజరు మళ్ళీ లేచాడు.

లేచాడు గాని వొక్క క్షణం నిదానంగా చూస్తూ నుంచున్నాడు.

చూపులో వున్న ఆ నిదానం వుత్తరక్షణాల లజ్జగా మారింది.

దాంతో అతని కంఠం రుద్ధం అయిపోయింది.

అయినా, చేసేది వొకరి ఆజ్ఞ నిర్వహించడం కనక "ఈ గుమాస్తా, మేమెక్కడికి వెళ్ళమంటే అక్కడికి ఏ క్షణాన–ఏ జంజాటమూ లేకుండా లేడికి లేచిందే ప్రయాణం అన్నట్టు బయలుదేరాలి కనక, సంతానవంతులు కూడా మాకక్కరలేదు. వెళ్ళిపోవాలి" అన్నాడు, చివరికి గద్గదికతో.

వెంటనే పదిమంది యువకులు వెళ్ళిపోయారు.

బిళ్ళబంట్రోతు ముందుకి వచ్చాటప్పటికి మరో నలుగురు లేచారు.

వెడుతూ వెడుతూ వారిలో యిద్దరు వొక్కమాటాగి, తమలో తామేదో

కూడబలుక్కుని, వెనక్కి తెరిగి ఉన్నవారిలో ముగ్గురిని తర్జనితో నిర్దేశిస్తూ "వారిలో వొకరికి పెళ్ళి యీడు వచ్చిన కూతురుంది. వొకరికి ప్రయిమరీ చదువుతూ వున్న కూతురుంది. మూడోవారికి ఎడపిల్లాడూ చంటిపిల్లా వున్నారు పంపించెయ్యండి దొరగారూ!" అన్నారు, చివరికి దురుసుగా వెళ్ళిపోతూ.

దాంతో, యిక్కడి గుంపులో నవ్వులూ విసవిసలూ రేగాయి.

"సిగ్గు సిగ్గు" అన్నారొకరిద్దరూ.

"పొండి పొండి" అంటూ కేకలే వేశారు. దూరాన వొకరిద్దరు.

దానిమీద ఆ సంతానవంతుల్లో వొకడు "మీరు పెళ్ళాలను పోషించుకోవాలి, మేము పిల్లలకు పెళ్ళిళ్ళు చేసుకోవాలి అడిగేవాడు లేకగాని యిందులో వొకటి ధర్మమూ వొక టధర్మమూనా?" అనడిగాడు, చురుగ్గా అడుగు వేస్తూ.

"పెళ్ళాన్నే పోషించుకో లేనివాడు పిల్లల్ని కనెయ్యడం యేమి ధర్మమండీ?" అంటూ సాగతీసుకున్నాడు వున్న వారిలో వొకడు, అటు తిరిగి.

"ఆ కేకలు వేసిన పెద్దమనిషికీ వుద్యోగం దొరికినప్పుడు చూద్దాం రావయ్యా!" అంటూ రెండోవాడు బయలుదేరాడు.

"ఈ వోర్వలేనితనమే మనల్నీకాడికి తెచ్చింది. మీరూ మాతోపాటు వేం చెయ్యవలసినవారే చివరికి, కొంచెం వెనకా ముందూనూ, అంతే!" అంటూ మూడోవాడు వెళ్ళిపోయాడు.

"మనం వుండడమా వెళ్ళిపోవడమా?" అని ఆలోచన పడ్డాడు చలపతి

చాలా మధనపడ్డాడు.

పరకాయించి చూడగా వొకమూల చతికిలబడి వున్నాడు గోపాలశాస్త్రి నిశ్చలంగా.

"బతికాం" అనుకున్నాడు చలపతి.

దండిపోయాడు.

## 8

ఇన్ని వడపోతలకూ తట్టుకోగలిగినవారు అరవై యేడుగురు.

వారిలో ప్రతీవాడూ కంపెనీవాళ్ళుండాలన్న సకల యోగ్యతలూ తనకుండినందుకూ మిక్కిలీ గర్వించాడు.

తనతో బాటుండిపోయిన వారెందరో లోపల్లోపలే లెక్క పెట్టుకున్నాడు, గుండ్రంగా తిరుగుతూ.

ప్రతీవాడూ "ఒక్క గుమాస్తాగిరీ కోసం యింతమందా? ఛీ, మనవాళ్ళకి నౌకరీకోసమే చదువు" అంటూ చీదరించుకున్నాడు.

ప్రతీవాడూ "ఈ పదవి నాదే" అంటూ ఆత్రపడుతూ నుంచున్నాడు.

ఈ స్థితిలో మానేజరు మళ్ళీ లేచాడు.

యువకుల్లో యెవడికి వాడే వూగిపోయాడు.

ఊర్ధ్వశ్వాసతో చెవులున్నూ రిక్కించుకున్నాడు.

సులోచనాలు చేతబుచ్చుకుని ప్రారంభించాడు మానేజరు

"మీ సంఖ్య రెండువందలయాభై నుంచి అరవైయేడింటికి వచ్చింది. దీంతో, మీలో ప్రతివాడూ అసహాయశూరుడని తేలింది. ఎక్కడికి వెళ్ళినా మీరు జయించుకురాగలరు.

"ఇంత చేసినా మా అవస్థ మాత్రం తప్పలేదు. మళ్ళీ మేము తికమకలు పడవలసే వచ్చింది; కాని వుపాయం మాత్రం చాలా గొప్పది దొరికింది. మీరూ మేమూ కూడా ధన్యులం.

"ఘనత వహించిన మన దొరతనం వారు, హేమాహేమీలతో కూర్చి 'పబ్లిక్ సర్వీస్ కమీషన్' అంటూ ఒక సంస్థ నెలకొల్పి వున్నారు అది, మిక్కిలీ ప్రతిభావంతులైన అనేకమంది గొప్ప ఆఫీసర్ల మేధస్సునిగ్గు. అది చాలా చాలా గొప్ప సంస్థ. ఎంత గొప్ప సంస్థ అంటే, ఖండాంతరాల్లో కూడా మన ఆధ్యాత్మిక దృక్పధానికి పేరు తెస్తున్న మహాసంస్థ. దేశానికీ జాతికీ దానివల్ల కలుగుతున్న మేళ్ళు అసంఖ్యాకాలూ అసాధారణాలూనూ. దాని అనుగ్రహం సంపాదించుకో గలిగినవారి జీవితాలు జిగాల్ జిగాల్మని మెరిసిపోతున్నాయి.

"అయితే, ఆ సంస్థతో మా కేమీ సంబంధం లేదు. దాని నిర్ణయాలు శిరసావహించ వలసిన అగత్యమున్నూ లేశమూ కూడా లేదు మాకు; దాని పద్ధతులు మాత్రం మాకిప్పుడు బాగా అర్థం అయినాయి. అంచేత నచ్చాయి; విశేషించి యీ గడ్డుసమయంలో మాకవే తారకాలు.

"కనక, ఆ వరవడి దిద్దుకుని మేమిప్పుడు మూడు ప్రశ్న లడుగుతాం. మీలో ప్రతీవాడూ వాటికి సరి అయిన ప్రత్యుత్తరాలు చెప్పాలి. చెప్పి, అదిగో ఆ మూలకి వెళ్ళి నుంచోవాలి.

"బాగా వినండి.

"మళ్ళీ మళ్ళీ చెప్పం, గుర్తుంచుకోండి.

"ఒకటి,–రేపు పట్టాభిషేకం అనగా, శ్రీరామచంద్రమూర్తి యివాళ యేమేమి పిండివంట లారగించాడు?

"రెండు,–గోదావరి హిమవత్పర్వతం మీద ఎన్నివేల అడుగుల యెత్తున పుట్టేది?

"మూడు – మండు వేసవిలో పట్టిసం కొండచుట్టూ ఎన్ని నిలువుల లోతు నీరుంటుంది?

వినీవినగానే "హోస్, ఇంతేనా?" అనుకున్నారు యువకులు.

దాంతో, ప్రత్యుత్తరాలు చెప్పడానికి వారిలో సగం దాకా తోపుళ్ళు పెట్టుకుంటూ ముందుకి వచ్చినుంచున్నారు.

అది చూసి దొర, నిరసనగా బల్లగుద్ది, యేదో గొణుక్కున్నాడు.

వెంటనే బిళ్ళబంట్రోతుని పంపించి మానేజరు అక్కడ "క్యూ" పద్ధతి యేర్పాటు చేయించాడు.

యువకుల కదివరకే వున్న చురుకు రెట్టించింది.

ఒక్కొక్కడే ముందుకి వచ్చి తడుపుకోకుండా బదుళ్ళు చెప్పేసి నిర్దిష్టస్థలంలో నుంచోసాగాడు కూడా – ఎవడికి వాడే "మనమే కొట్టేశాం" అనుకుంటూ.

కాని, యిద్దరు మాత్రం బదుళ్ళూ చెప్పలేదు, కదలా లేదు.

"ఏం, నుంచున్నారేం?" అనడిగాడు బిళ్ళబంట్రోతు.

అయినా వారు కదల్లేదు.

వారిద్దరూ - వొకడు సుబ్బమ్మ అల్లుడు చలపతిరావూ, మరోడు ఆమె సవతికొడుకు గోపాలశాస్త్రినీ.

"మీ ప్రశ్నలు సరిగా లేవు" అని మాత్రం చెప్పి నిర్దిష్ట స్థలానికి వెళ్ళిపోయాడు చలపతిరావు.

"పట్టాభిషేకం రేపనగా, ఇవాళ, శ్రీరామచంద్రమూర్తి కటికి ఉపవాసం చేశాడు. గోదావరి హిమవత్పర్వతం మీద పుట్టలేదు. పట్టిసం కొండచుట్టూ నడివేసవిలో నిప్పులు కక్కుతూ యిసక తిప్పలు మాత్రమే వుంటాయి" అని వివరంగా చెప్పి గోపాలశాస్త్రి కదిలాడు.

దొర తల పంకించికున్నా డది విని.

"సెబాస్" అన్నాడు మానేజరు అపవారించి.

ఇదంతా వినీ చూసీ, అక్కడ "నాకు నా"కంటూ మోచేతులతో కుమ్ముకుంటూ ఒక్కొక్క అడుగే ముందుకి జరుగుతూ వున్న యువకు లందరూ ముందు కొయ్యయిపోయి, తరవాత నాలుకలు తెగ్గరుచుకున్నారు.

# 9

వెనక్కి చేరబడి తల పంకించుకుంటూ వొక్క క్షణం ఆలోచించి, ముందుకి వంగి మోచేతులు బల్లమీద ఆనుకుని, మెల్లిగా చెప్పాడు దొర యేదో.

అది వినాటప్పటికి మానేజరు మొగాన విన్నదనం అలుముకుంది; కాని చివాలున లేచినుంచున్నా డవ్యవధానంగా.

వెంటనే చలపతిరావుకీ గోపాలశాస్త్రికీ గుండెల్లో గుర్రాలు పరుగులు తీశాయి.

"దొరగారు చెబుతున్న దేమి టంటే?" అంటూ మానేజ రందుకున్నాడప్పుడు:

"రెండువందల యాభైమందిలోనూ మీరిద్దరే సర్వసమర్థులు. మీరిద్దరే యెవరి కయినా బాగా వుపకరించగలవారు. మీరు ప్రత్యుత్తరాలివ్వడంలో విధానం మారినా, మా ప్రశ్న లసందర్భంగా వున్నాయనడంలో ఒక్కటే అయినారు- అంచేత, మేమిప్పుడు, మీ యిద్దరిలో ఒకరి కీవుద్యోగం యిచ్చేస్తే రెండోవారి కన్యాయం చేసిన ట్టవుతుంది. దాంతో, వెవకటి శ్రమ అంతా వ్యర్థం అనిపించుకుంటుంది. కనక, మళ్ళీ మేమింకో పరీక్షచెయ్యవలసే వుంది.

"అయితే, యిది చివరి పరీక్ష!"

అలా అన్నాడే గాని వొక్క నిమిషం మాట్లాడ లేకపోయాడతను.

మర్మాంతిక ఆవేదన మొగం అంతా అలుముకుం దతనికి.

పోనీ, పదవివిబట్టి పద్ధతి చెప్పకపోతేనో అంటే తన అన్నం పడిపోతుంది.

తన పదవివిబట్టి అగత్యం అయి, తన చేతికింది వారిమీద, ఎన్ని మాట్లో యెంతో నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించినవాడే అతను.

అవతలివారి దగ్గిర దోషం వుంటూ రావడం వల్ల అనివార్యం అయిందది, దౌర్జన్యం మాత్రం కాలేదు.

ఇప్పుడు దరఖాస్తుదారులూ నిర్దోషులే, తానూ నిర్దోషే.

ఆ మాటకి వస్తే దొరా నిర్దోషే వొక విధంగా.

రిజిష్టర్డుకంపెనీ లౌకవిధమైన 'లా'కి బద్ధమై వుండాలి మరి.

నిజమే; కాని చరిత్రకే కొత్త దవుతుంది తానిప్పుడు చెప్పబోయేది.

విజాతీయుడి పక్షంగా, మధ్య, తాను, సజాతీయులమీదే నిర్వహించా లది.

కాని, అనివార్యం.

అటూ యిటూ కూడా పరిస్థితులు అలా విషమించాయి.

ఇందుకూ అతని ఆవేదన.

ఏమయినా, గుండె రాయిచేసుకోవలసి వచ్చిం దతనికి.

గుండెలే లేని బంటున్నా కావలసివచ్చింది.

కళ్ళుమూసుకుని సాహసించాడు.

మరోవైపు చూస్తూ "మీ రిద్దరూ వెళ్ళి గేటులో సమరేఖమీద నుంచోండి. దొరగారు పిస్తోలు పేలుస్తారు. వెంటనే బయలుదేరి కంపెనీ ఆవరణ చుట్టూ పరుగెత్తుకి రండి. ముందు వచ్చినవారి దీవుద్యోగం" అన్నాడు గద్గదికతో.

ముచ్చెమటలూ పోశా యతనికి.

దీనికి సాయం, అక్కడ గాలి స్తంభించుకుపోయింది.

చెట్లున్ను కొయ్యయిపోయినట్లు నిశ్చలాలయిపోయాయి.

ప్రకృతి నీరవం అయిపోయింది.

దొరమాత్రం నిర్వికల్పంగా కూచున్నాడు, కుర్చీకి జేరబడి.

బిళ్ళబంట్రోతు కూడా మొగం పక్కకి తిప్పకుని నాలుక్కరుచుకున్నాడు.

చలపతిరావూ గోపాలశాస్త్రి కూడా గుండెల్లో పొడిచినట్టయిపోయారు.

ఏమిటి చెయ్యడం?

ఇద్దరూ గంభీరంగా చూసుకున్నారు.

ఇద్దరూ తీవ్రంగా ఆలోచించుకున్నారు.

వారు విద్యార్థికులే కాని; అంధకారం తాండవం చేస్తోంది కళ్ళ యెదుట. వారు సింహకిషోరాలే కాని; కడుపులో పేగులు మాడిపోతున్నాయి.

అన్నం వండుదా మంటే బియ్యపుగింజల్లేక – చలపతిరావు కళ్ళకి సుందరీ, గోపాలశాస్త్రి కళ్ళకి కామేశ్వరీ – భగభగమండిపోతున్న పొయ్యిల దగ్గిర చతికిలబడి దిగాలుపడిపోయి వున్నట్టు కనపడ్డారు.

కళ్ళు తిరిగిపోయాయి వారికి.

కాని, శృంఖలాబద్ధులు వారు.

పర్వతాలను మించిన బాధ్యతల బరువు లున్నాయి. వారి శిరస్సులమీద.

"ఉద్యోగం కోసం పందెపు గుర్రాల్లాగ పరుగెత్తడం అమానుషం కాదా అంటే, అమానుషం తగ్గాలంటే యిప్పుడు మరో దారేదీ" అంటూ యెవరో సద్దిచెబుతున్నట్టనిపించింది వారికి.

నిజానికి,–

మనిషయినవాడు, చెయ్యరాని చెడ్డా లేదు, చెయ్యలేని మంచీ లేదు.

మనిషయినవాడు పాల్పడరాని స్వార్థమూ లేదు, సాధించలేని పరార్థమూ లేదు.

మనిషయినవాడు దిగరాని నైచ్యమూ లేదు. అందుకోలేని ఉచ్చస్థితీ లేదు.

మనిషయినవాడు, చెయ్యరాని నాశమూ లేదు, చెయ్యలేని నిర్మాణమూ లేదు.

మనిషయినవాడు పుట్టుకతో సర్వస్వతంత్రుడు; కాని మన యూనివర్సిటీల ద్వారాల్లో అడుగుపెట్టాడా – నౌకరీ చెయ్యడానికి తప్ప మరెందుకూ పనికి రాడు.

ఉన్నట్టుండగా, ఈ నగ్నసత్యం కళ్ళకు కట్టినట్టయింది వారికి.

"హు" అనుకున్నారు వారు.

అనుబంధాలు తెం పేసుకున్నారు వారు.

ఉత్తరక్షణంలో పిశాచప్రవృత్తి అలుముకుంది వారిని.

"నా కడ్డేమి"టన్న అహమికతోనూ "నీ లెక్కేమి" టన్న స్పర్థతోనూ బరువుగానూ దురుసుగానూ అడుగులు వేసుకుంటూ వెళ్ళి గేటులో నుంచున్నారు వరసగా వారు.

బిళ్ళబంట్రోతు పిస్తోలు తెచ్చి దొరచేతి కిచ్చి, వెళ్ళి వారిపక్కగా నుంచున్నాడు కాని, గుండెలు గుబగుబలాడిపోగా మొగం పక్కకి తిప్పేసుకున్నాడు.

నుంచోలేక మానేజరు కుర్చీలో కూలబడ్డాడు, మొగాన చేతులు కప్పుకుని.

కాని, దొరమాత్రం చెయ్యిపైకెత్తాడు, గంభీరంగానూ నిశ్చలంగానూ చూస్తూ.

పిస్తోలు ఢామ్మంది.

వెంటనే అక్కడ వారిద్దరూ ముందు కురికారు.

ఎ–ఘిరిపోయారు.

రెండు నిమిషాలకు బయటికిపోయివున్న దరఖాస్తుదారుల కరతాళ ధ్వనులతో దిక్కులు పిక్కటిల్లాయి.

నిదానించి చూడగా, తలకాయ తీసుకువెళ్ళి పొట్టలో పెట్టుకుని దొర యెదట కొయ్యయిపోయి వున్నాడు గోపాలశాస్త్రి

మానేజరు కళ్ళు చెమ్మగిల్లాయి.

పరుగుపరుగున వెళ్ళి గ్లాసులో పోసి సోడా తీసుకువచ్చాడు బిళ్ళ బంట్రోతు.

పిస్తోలు బల్లమీద వుంచేసి, దర్జాగా వెళ్ళి వీపుతట్టి, ప్రసంసిస్తూ షేక్ హేండిచ్చి, చెయ్యిపట్టుకుని తీసుకువచ్చి తన పక్కని కూచోబెట్టుకుని, సాదరంగా సోడాగ్లా సందించాడు దొర గోపాలశాస్త్రికి.

*(1948 ఏప్రిల్ 'ఆంధ్రశిల్పి' నుంచి)*

[15 నిమిషాలకు సరిపోయేటట్టు కుదించి, 15–12–1947 తేదీ సాయంత్రం 7–30లకు మదరాసు రేడియోలో చదివిన చిన్న కథ యిది.]

★ ★ ★

# జాగ్రత్త పడవలసిన ఘట్టాలు

"బారెడు పొద్దెక్కిం దప్పుడే. ఊరివా రందరూ పాచిపనీ చేసేసుకున్నారు; కాని మాయింటో కోడే కుయ్యలే దింకా!"

"..........."

"మొగవాడు నాలుగ్గడియల రాత్రివేళే లేచిపోయినా, చద్దన్నాల వేళ దాకా గదిలోనుంచి యివతలికే రాకపోతే యింకెలాగా వేగడం?"

"..........."

"లేవడానికి తొందర అక్కరలేదు, లేచి లేవగానే కాఫీ కాచుకోడానికి మాత్రం వొకటే పరుగు. ముందు కుంపట్లో నిప్పపడేసే మొగం కడుక్కోడం! ఛీ, గేదీ తాగుతుంది, కుడితి!"

"..........."

"రెక్కల్లో సత్తువు వుందికదా, చెయ్యక యేమిచేస్తుందని దిలాసా అత్తముండలు బతికి వుండవలసిన రోజులు కా వివి."

"..........."

"వాగివాగి అదే వూరుకుంటుం దని మొండితనం కూడాను. సిగ్గా భిడియమూ, భక్తీ భయమూ లేనివాళ్ళ నెన్నంటే మాత్రం యేమి లాభమూ?"

"..........."

"రెండు గడియల పొద్దేక్కే దాకా పడుకుంటే నాకుమాత్రం సాగదా యేమిటి? అయితే, నీకయినా బుద్ధి లేదా అని నాకే గడ్డిపెడతారు లోకులు. మంచయినా చెడ్డయినా యింటి యజమానులకే గాని, మధ్య, సత్రకాయ పీనుగుల కేమి వుంటుందీ?"

"..........."

"ఒకటీ రెండూ కాదు, పదిహేడేళ్ళు వెలగబెట్టాను, కజ్జాకోరు అత్తగారి దగ్గిర కాపరం. కిక్కురు మని యెరగ నెప్పుడూను. తూర్పు తెల్లవారుతోందనగా మొగం కడుక్కుని చీపురుకట్ట పుచ్చుకుంటే, జాము పొద్దేక్కేదాకా వొకటే తుడుపు, వంచిన నడుం యెత్తకుండా. ఇలా అయితే, ఆ కాలంలో మేము కాపరం కడతేర్చామే!"

"..........."

"మనలాగే వైదీకంలో వున్నవాళ్ళ పిల్లని చూడమని యెన్ని విధాలా పోరినా, యిదేదో మంచి సంప్రదాయం అని మురిసిపోయారు గాని, నా మాట చెవినిపెట్టారా? ఏమయినా, యీ మాలకూడు ముట్టకుండా బాగానే దాటారు ఆ మహారాజు. ఇద్దరివంతూ నా పాలబడింది, ప్రారబ్ధకర్మం లాగ."

"దానిల్లు మాయమైపోను, యీ కొంపలో గాజులమలారం దింపడం యెప్పుడయినా వుందా? ఇంకో రెండు జతలు బంగారపువే చేయించుకోరాదూ, నా బ్రాహ్మణ్యం బుగ్గి చెయ్యాలన్న దుర్బుద్ధి కాకపోతే?"

"... ......"

"రామారామా! వాకలి, అంతా వుల్లిపాయల పొట్టే! నేను తుడవలేను బాబూ, నానా పెంటలూనూ."

"........."

"నాచేత రోజా గోమూత్రం తాగించా లని పట్టుదల. నన్నేడిపించే పీనుగులు పుచ్చి పురుగు లోడిపోరూ?"

"........."

"దేవుడు లేడా అంట?"

"....... ..."

"వాకట్లో తుక్కుంటే గింజుకుంటాడు వాడు. పోనీ, యెక్కడ పడితే అక్కడ నానాగడ్డీ పడెయ్య వద్దని అవతలివాళ్ళకి గడ్డి పెడతాడా వొక్కమాటయినా?"

"........."

"ముసిముసినవ్వులు నవ్వుతూ – అవన్నీ దొంగ వేషాలు, నాకు తెలియదూ? ఇంటికి వచ్చాటప్పటికి తక్కుతూ తారుతూ యెదటపడితే, యిక వొళ్ళు తెలిస్తేనా ఆ నాగమ్మకి?"

"........."

"మే మెరగమమ్మా యీ సాని టక్కులు, వాకట్లో మొగాడి కెదురు నుంచోడం–ఛీ, తలుచుకుంటేనే ప్రాణం చచ్చిపోతోంది."

"........."

"సంసారిపీనుగులే యిలా అయితే, యిక బోగం వాళ్ళెందుకూ – అడుక్కుపోవాలి గానీ?"

"........."

"అమ్మయ్యా, రామయ్యతండ్రీ, నడుం పడిపోయిం దోయి నాయనా! అరవై యేళ్ళకే ముద్ద చేసి మూల పడేస్తావా మహారాజా?"

"........."

"ఇదీ వొకదారే. మూడు యజ్ఞాలు చేసింది రామసోదెమ్మ. చచ్చే ముందు, నాలుగు మాసాల పాటు మంచం పట్టి, అవి కిరస్తానీ నీళ్ళా, అది మాల కూడా, అవి యీసడింపులా – మహాప్రభో, పగవాళ్ళ కయినా వద్దలాంటివి. కిందపెట్టే టాకా వొకళ్ళ చాకిరీ చేయించుకునే దౌర్భాగ్యం నాకు పట్టనివ్వకు మా తండ్రీ!"

## 2

"పాడు మొగం మంచం దిగాటప్పటికి తయారు, దిష్టి పిడతలాగ. ఇంతకంటే నల్లపిల్లి మొగం నయం."

"........."

"నేను చీకటితోనే లేవకబోతే తన పుట్టేం మునిగిందీ? ఏ చిన్నకథో యే నవలో చదువుకుంటూనో కబుర్లు చెప్పుకుంటూనో మేము వొంటిగంట దాకా మేలుకుంటాం కనక, నాకు తెల్లవారుజామున గాఢనిద్ర పట్టిపోతుంది. నేను పెందలాడే లేవనందుకు వారికి లేని బాధ తన కెందుకూ?"

"..........."

"ఎవరినో ఆడిపోసుకుంటూ కూచోడమే కనక, తనకెప్పుడూ నిద్రే పట్టదు, తన కర్మం. నాకేం కళ్ళనిండా నిద్రపోకుండా యేడవడానికీ?"

"..........."

"చాకిరీ చేసుకుంటే గాని సాగనివాళ్ళూ, తనలాంటి దరిద్రగొట్టు మనుషులూ లేస్తారు తెల్లవారకుండానూ, నా కర్మం యేమి కాలిందీ?"

"..........."

"తెల్లవారకుండా లేస్తుందని గోదావరికి వెళ్ళి స్నానం చెయ్యడమూ, రామాకృష్ణా అనుకుంటూ కూచోడమూ? ఎంతసేపూ, యెవరినో చూసి వోర్వలేకపోవడమూ, యెవరినో దెప్పటమూ, ఎవర్నో సాధించడమూ—ఇంతే బతుకు. ఎప్పుడూ వంకరబుద్ధే. ఛీ, పాకీదీ బయలుదేరుతుంది చీకటితోనే చీపురు పుచ్చుకుని"

"..........."

"మానమనా, అభిమానమనా? బోలెడు జీతం పుచ్చుకునే దాసీది వుండగా తన కెందుకా పుణికింతాలూ? తాను చేస్తే నేను కూడా చెయ్యకపోతానా, చెయ్యకపోతే సోరంటాలు పెట్టవచ్చుగదా, యిదీ యేడుపు! మొగం నేలబెట్టి యీడిపిస్తాను గానీ, వాకలి తుడుస్తానేం నేను?"

"..........."

"కాఫీకోసం నేను కుంపటి అంటించాటప్పటికి లబోలబో అంటూ బయలు దేరుతుంది గదా, అదేం పుట్టుకో గాని! నేను పుచ్చుకుంటున్నందుకు గింజుకోకపోతే తన కాయోగం లేనందు కేడవరాదూ?"

"..........."

"మామయ్యగా రెప్పుడయినా నోరు చేసుకుని అడిగేవారు పాపం, కాని వొక్కమాటూ కూడా కాఫీ యిచ్చి యెరగ దీ యిల్లాలు. ఎంతసేపూ, యే కారం రాసిన అటుకులో యిన్ని మొగాన కొట్టి, చెంబెడు మంచినీళ్ళు తాగ మనేది, సరసం తెలిస్తేనా?"

"..........."

"ఓమాటు అ విసిరికొట్టడం చూసి, నాకోసం చేసుకున్న కాఫీ పట్టుకు వెళ్ళి యివ్వగా యెంత సంబరపడ్డారు పాపం ఆయన! కాని, యెంత రగడ పెంచిందీ ఆవేళ? మరిచిపోతానా, యీ జన్మలో?"

"..........."

"నిజంగా చచ్చే సుఖపడ్డా రాయన. ఆయన నవ్వుతూ మాట చెప్పవస్తే ధుమధుమ లాడుతూ అందుకునే దీవిడ. ఆ పాడు మొగాన నవ్వే కనపడదమ్మా, అదేం పుట్టుకోగానీ!"

"మా తిండికోసం గోల పెట్టవద్దని యెన్ని మాట్లయినా గడ్డిపెట్టారు మామయ్యగారు; కాని వింటేనా? నల్లరాయి కానీ, మనిషా యేమిటి?"

"..........."

"మేము నాటకానికయినా సినిమాకయినా వెడితే కళ్ళల్లో నిప్పులు పోసుకుంటుంది. వీధి భాగవతాలూ తోలుబొమ్మలూ అయితే, తాను పరుగెత్తవచ్చు. పాపం!"

"..........."

"కొడుకు విస్తరిలో కాస్త మీగడ వేస్తే కళ్ళు చిమచిమలాడిపోతాయి. నేను కాఫీ పుచ్చుకుంటే కళ్ళల్లో కారం చల్లుకోడం అబ్బురమా?"

"..........."

"గోచీ పెట్టి బట్ట కట్టుకుంటే 'కోమటివేషాలు – మేం యెరగం బాబూ' అంటూ గుర్రాలక్కలాగ మొగం తిప్పుకుంటుంది. గూడకట్టు కట్టుకుంటే 'భోగంపాప'లంటూ వూళ్ళోవాళ్ళని కూడా దీవిస్తుంది. దినమంతా, కాకపోతే నూర్లూ నూటయాభైలూ పోసి కొనుక్కున్న పట్టుచీరలు మడికచ్చాపోసి కట్టుకోనా?"

".. ........"

"శిఖ చుట్టుకుంటే వోర్చలేదు గదా? ముడి వేసుకుంటే చూడలేదుగదా? తలలో పువ్వులు ముడుచుకుంటే గుడ్లు మిటకరించుకుంటుంది గదా, యిక నేనీదెయ్యాన్ని పెద్దచేస్తానేం?"

"..........."

"కొడుకు కావాలన్నా కూర చెయ్యదు గదా, యెన్నడూ? నేను మడికట్టుకుని వసారా పొయిలో నిప్పు వెయ్యనినాడు వారి కుపవాసమే గదా?"

"..... ...."

"మెడలో రుద్రాక్షతావళం వేసుకుంటేనే వస్తుందా యేమిటి యెత్తుకు పోడానికి విమానం? నన్నూ నావంటివాళ్ళనూ తిట్టే తిట్లు లెక్క పెట్టుకోడానికి గాని జపం చేసుకోడానికా యేమిటి ఆ పూసలు?"

"..........."

"ఈ పాటికి నీళ్ళు మరిగిపోతాయి. ఈ రాకాసి సోరంటాలకు విరుగుడు అంటూ లేదు. హాయిగా కాఫీ పుచ్చుకుని నిన్న చేసిన ఖర్చులు పద్దురాసుకోకుండా యీ దిక్కుమాలిన గొడవ యేమిటి నాకు? రైతులకు రాసిన వుత్తరాలకు నకళ్ళు కూడా రాయాలింకా. బాబోయ్, అప్పుడే అరున్నర అయిపోయింది, వచ్చేస్తున్నారో, వచ్చేశారో, వారు పొడిబట్టలు కట్టుకుని తల దువ్వుకునేటప్పటికి కాఫీకప్పు నోటికందించేదానికి, యివాళ, నాకింత బద్ధకం వచ్చిందేమిటమ్మా?"

## 3

"ఇంత చెమట పట్టిందే యివాళ?"

"ఫాల్గునమాసం జొరబడింది ఆశ్చర్యమా? కాకపోయినా, వేడివేడి కాఫీ పుచ్చుకున్నది మొదలు తిరగడమే అయె, పట్టిన చెమట ఆరడానికిక అవకాశం యేదీ?"

"చొక్కా తీసెయ్యండి విసురుతాను."
"నీకంత దయేవుంటే, చొక్కా వుండగానే బాగుంటుంది."
"అయితే, కండువా–"
"..........."
"నేను తియ్యగూడదూ?"
"నేను తియ్యకపోతేగా?"
"చూస్తూ నుంచోనా నేను?"
"నువ్వు కండువా జాగ్రత్తచేసి వచ్చేదాకా వూరుకుంటూ కూచోనా నేను?"
"బాగానే వుంది."
"ఇంకేం?"
"..........."
"కొంచెం నింపాదిగా."

"ఇంకా కొంచెం."
"..........ఏం?"
"గట్టిగా విసిరితే నీకు చేతులు లాగుతాయి. పైగా, నీకు చెమటపడుతుంది. నాకు నువ్వూ, నీకు నేనూ–"
"ఊరుకోండి."
"తప్పేం?"
"తప్పా, తప్పన్నరా?"
"అందం అంటూ వుంటే, అందులోనే వుంది, తెలుసుకోగలిగితే"
"అ–వ్వ–"
"అయితే చూడూ. పాలమూరినుంచి రామదీక్షితులు మామయ్యగారు వచ్చారు."
"ఏరీ?"
"బజారు పని చూసుకుని పదింటికి వస్తాడు."
"భోజనం యిక్కడేనా?"
"ఆహా!"
"అయితే, వంట అయిపోతోంది, అరటికాయ పప్పులో వేసినట్టుంది మీ అమ్మ, బాగుంటుందా?"
"బంగాళాదుంపలు వేయించు నువ్వు వెళ్ళి."

"వెళ్ళుమరీ."
"ఒళ్ళు కాస్త ఆరనిస్తారా?"
"ఆయనకు ప్రొద్దుపోదూ?"
"క్షణం–"
"కాఫీ పుచ్చుకోకుండా బయులుదేరి వుండరు గానీ–"
"ఫలహారం చెయ్యరా?"

"చెయ్యరూ? ఎవరు చెప్పారు?"

"ఇంకేం? కాకపోయినా, పదిగంటలంటే పల్లెటూరివారి కాలస్యం కాదు లెండి!"

"మీగడ యేమయినా వుందేమో?"

"సరే, మీకు వుంచదు గదా మీ అమ్మ?"

"దానిగుణం అది పోనిచ్చుకోదు, ఏం చెయ్యం?"

"........."

"అప్పుడే అందుకుంది చూశారా? ఈ గోడ పక్కని నక్కిందండీ మీరింటోకి రావడం చూసి. మీరూ నేనూ యింటో వుంటే పొంచుండి వింటుందండీ, వొక్కమాటు—"

"ఊరుకో."

"నేనూరుకోలే నండీ!"

"........."

"చూశారా, చూశారా? నన్నలా తిట్టిపోస్తూ వుంటే—"

"ఇప్పటిదాకా చూపించిన మంచి అంతా యేమయిపోయిందీ?"

"మంచీ మంటిగడ్డలూను. మంచివాళ్ళకి మంచిగాని, మంకు మనుషులకూనా? ముక్కుకి, మసి రాసుకుని అలాగ మీదిమీదికి వస్తూ వుంటే – ఏం, ఎంచేతా? ఎందు కూరుకోవాలీ? నీకుందా భయం? నీకుందా సిగ్గూ యెగ్గూను?"

"అమ్మా!"

"అమ్మా బొమ్మాను. అలా రెచ్చిపోతూ వుంటే చచ్చు పెద్దమ్మ లాగ చూస్తూ వూరుకుని, నాకోసం యేడుస్తా వేమిట్రా నీ బుద్ధి బుగ్గిగాను? నువ్వు మొగాడవు కావుట్రా?"

"నీ సిగ్గు చిమడాలి. నీ బుద్ధి బూడిద కావాలి. ఆడదానివే నువ్వు? తల్లివే నువ్వు? దేవుడు లాంటి కొడుకు నిలా తిట్టే మనిషి—"

"నువ్వు పెళ్ళానివే? విక్షేపం వంటి నా కొడుక్కి మందులు పోసి, వాడిబుద్ధి విరిచేసి, నామాట వినకుండా చేసి—"

"నీ మాట యేమి వినడం లేదమ్మా నేను?"

"ఏమి విన్నావు నాయనా? దాన్ని అణచగలిగావా? దానికి భయభక్తులు చెప్పగలిగావా?"

"నువ్వణిగావా, యిన్నేళ్ళు వచ్చాయిగాని? నీకు భయభక్తులున్నాయా నాకు లేకపోవడానికి? నోరు లేనిదాన్ని చేసి—"

"నీకే నోరు లేకపోత? రాకాసి లాగ అలా మీద పడిపోతున్నావు, నీకే వాయి లేకపోత?"

"నీకంటేనా; నీ కళ్ళకి నేను రాకాసిలా వున్నానా? దెయ్యపుకళ్ళు, పిచాచపునోరు—"

"ఊరుకోవూ?"

"గడ్డం పట్టుకుని పెళ్ళాం పీనుగుని బతిమాలుకుంటావుట్రా? వోరి నీ బతుకు—"

"పోనీ, నువ్వూరుకోమ్మా, నీ కాళ్ళు పట్టుకుంటాను."

"దాని లొంగతియ్యలేవుగాని నన్నాజ్ఞ పెట్టవస్తావా? పెళ్ళాంగారిమాట విని తల్లిని లోకువచేస్తావుట్రా?"

"నువ్వే లోకువ. నువ్వే తీసికట్టు. హయ్యో, నీకు మొండివా డయినా జవాబు చెప్పగలడా?"

"నువ్వు నంగనాచివా? నువ్వు—"

"మొగుణ్ణి యెగేసి తెగనరికావు, కొడుకు లెక్కా నీకు?"

"మొగుణ్ణి వాజమ్మని చేసి కూచోపెట్టావు, అత్తగారు లెక్కా నీకు?"

"అమ్మా, రామదీక్షితులు మామయ్యగారు వచ్చారు. మన యింటికి వచ్చే వేళ అయింది. నా మర్యాద తక్కనియ్యవూ?"

"రామదీక్షితులు వస్తే నాకు భయమా, గోవిందదీక్షితులు వస్తే నాకు భయమా? తేరతిళ్ళు తినేవాళ్ళని లక్ష్యపెడతానేం నేను?"

"తేరతిళ్ళకోసం వస్తున్నారా బాబుగారు? ఊరుకుంటారేమండీ యింకానూ?"

"ఊరుకోకపోతే వురిపెట్టుకోమను. కాదంటే నువ్వు పెట్టు. నిన్నెవళ్ళేమి చెయ్యగలరూ? కుక్కని సేనునిచేసి కూచో బెట్టావు, వురిపెట్టడానికి నీకేం అడ్డూ?"

"అమ్మా, నన్నేమన్నా సంతోషమే గాని యింటికి వచ్చే పెద్దమనిషిని—"

"పెద్దమనిషంటే? ఎలాంటి పెద్దమనిషిరా రామదీక్షితులు? నెలకి నాలుగయిదు రోజులు నెత్తెక్కి కూచునేవాడు పెద్దమనిషి అంటే యేమన్న మాటరా?"

"అయ్యో అయ్యో, యీ మాటలు బాబుగారువింటే యింకేమన్నా వుందా? నలుగురిలోనూ తల యెత్తుకోగలమా?"

"నీకే వుంది మహా మర్యాద. నీకే వుంది గౌరవం. నీకే మోసింది యింటి బాధ్యత అంతా!"

"దానిది కాదు, నీదే బాధ్యత. అయితే, అది నిర్వహించుకోడం యిలాగేనా?"

"ఇలాగేనా అంటే, మరెలాగ? నేను పప్పుకూరా చారూ చేసి వుంచితే, మళ్ళీ తను బంగాళాదుంపలు వేయించడమా? నేను కొంత వడ్డనా తను కొంత వడ్డనానా?"

"శిస్తులకోసం పోలమూరు వెడితే పదేసిరోజు లుంటున్నాను వారి యింటో. నన్ను మనుగుడుపు పెళ్ళి కొడుకుని చూసినట్టు చూస్తారు వారందరూ! పప్పుకూరటమ్మా ఆయనకు వడ్డించడం?"

"పల్లెటూళ్ళ వాళ్ళకది మాత్రం యెలా వస్తుందీ? కాకపోయినా, రెండో మనిషి వడ్డనలోకి వస్తే నాకు మర్యాదా యేదింక?"

"పోనీ, బంగాళాదుంపలు నువ్వు వేయిస్తావా?"

"వేయించవద్దూ మరీ నీ సెలవయాక? ఇవాళ కన్ను తెరిచిన పీనుగువు, నువ్వు చెబితే, నా మడి మట్టిగడ్డలయినా, నా విష్ణ నీళ్ళు కారిపోయినా చేతులు కట్టుకుని చెయ్యవద్దూ నేను? అయ్యో నా దశ!"

"అదండీ యేదుపు. మీరు చెప్పినట్టు చేస్తే యిక తన పెత్తనం యేదీ అనీ. చూశారా?"

"ఏమిటో చూసేది వాడూ నువ్వూను? చూసేం చెయ్యగలరే నన్ను మీరు? వాణ్ణి మహా పూసుకువస్తున్నావు గానీ, నీవల్ల యేమవుతుందే అసలు?"

"ఏమవుతుందా? ఏమి చెయ్యగలనా?"

"ఊరుకో నువ్వు........అమ్మా!"

"ఏం, ఎందుకురా అమ్మ?"

"నీ హద్దులో నువ్వుంటావా, నీ మాటా నా మాటా కూడా దక్కుతుంది లేకపోతే, లోకంతోపాటే, తెలిసిందా?"

"ఏమిట్రా తెలిసేది?"

"ఏమిటా? నేను చెప్పాలా?"

"..........."

"వీధినపడితే అది నా కొక్కడికే కాదు, తలవంపులు, నీ అధికారం యెంతవరకో, అసలు నీ ప్రమేయం యెంత మాత్రమో గుర్తించుకోడం లేదు నువ్వు. నీకు తోచకపోతే, యెవరి నయినా అడుగు, చెబుతారు."

"నాకు చెప్పగలవా శైవళ్ళురా యీ రాజమహేంద్రవరంలో?"

"తాతయ్యగారు పోయాక నాయనమ్మ మాట యేమయింది?"

"నేను చెబుతాను వినండి. అప్పుడు తన పెత్తనం వచ్చింది. ఇవతలివాళ్ళకి మాత్రం అలా రాకూడదు."

"నేను రానివ్వను. నేను బతికివుండగా నా యింటో–"

"నీ యిల్లు? దొడ్డిగుమ్మం మీద కొంజా వేయించా నెందుకో తెలుసా?"

"అమ్మా, నువ్వు దానికి అత్తగారి వయితే అది చుట్టరికంలోనే, వ్యవహారంలో కాదు. నాన్నగారు బతికివుండినంత కాలమూ నీ పెత్తనం సాగింది. నువ్వేమన్నా చెల్లింది."

"ఇప్పుడు మాత్రం యెందుకు సాగదూ?"

"నేను సాగనియ్యను కనక!"

"అలాగేం?"

"అక్షరాలాను!"

"నువ్వూరుకో. తెలిసిందా అమ్మా? ఇక నువ్వే తప్పించుకు తిరగాలి. నీ మర్యాదా నిలవాలన్నా, మా మర్యాదా నిలవాలన్నా నువ్వీ పద్ధతి కట్టిపెట్టాలి. నా వీలుచాళ్ళనుబట్టి మసులుకోవాలి యింటోవాళ్ళు. నీకది యిష్టం లేకపోతే నీకున్న గోడు నిలవదు"

"నిలవక?"

"గంగలో కలుస్తుంది."

"నన్ను గంగలో కలుపుతావుట్రా?"

"ఇక పెడర్థాలు కట్టిపెట్టు. ఏమంటావ్? నా చెప్పుచేతల్లో వుంటావా వుండవా?"

"పెళ్ళాంపీనుగు చెప్పినట్టల్లా–"

"నాన్నగారు చూపించిన దారే నా కది."

"..........."

"ఏం, యేమంటావ్?"

"నేను బతికివుండినంతకాలమూ పెత్తనం నాది కాని మరివొకళ్ళది కాదు. ఒకళ్ళు నన్నేమీ చెయ్యలేరు. అయినవాళ్ళూ కానివాళ్ళూ నా యింటో పెత్తనం చేస్తే నేను సహించలేను."

"అది బాగా నిశ్చయించుకున్న మాటేనా?"

"ఏమయితే నీకేం?"

"నే నడిగినదానికి బదులు చెప్పాలి."

"నేను చెప్పను, నన్ను నిలవతీసి అడగడానికి నీకేం అధికారం వుందీ?"

"నా అధికారం చూపించనా?"

"తొందరపడకండీ!"

"నువ్వెందు, ఏమమ్మా, యేమంటావ్?"

"..........."

"ఏం?"

"..........."

"నా సంగతి నీకు తెలుసు. నేను మాట అంటే తిరగను సుమా!"

"నేనూ తిరగను."

"కనక?"

"..........."

"తిరగక?.....ఏమి చేస్తావ్?"

"..........."

"ఒద్దుసుమండీ! నన్ను చంపుకుని తిన్నట్టే. నేనే ఓపిక పడతాను. అల్లరి చెయ్యకండి."

"ఏమమ్మా?"

"..........."

"ఈ పూటతో వంటలు వేరు. పద మడికట్టుకో."

"అయ్యో, అయ్యో, నా మాట–"

"మడికట్టుకుంటావా లేదా?"

"అంత కోపం వస్తే యెలాగండీ?"

"నోరెత్తవద్దు."

"నేనేం చేతునమ్మా?"

"నేనేం చేతునమ్మా యేమి టింకా? నసాళం అంటేదాకా తిరిపెట్టావు, ఏమి యెరగనట్టు నటిస్తున్నావు. ఎంతదానివే నీ మొగం మండ? ఎంత పని చేయించావే నీ వాళ్ళు యిదయిపోనూ. వోరి చెవలవాజమ్మా, నువ్వేక సంసారం చెయ్యగలవా? నా పెత్తనం తప్పించి నువ్వు ముందుకి వస్తావుట్రా?"

*(1934 జనవరి; ప్రబుద్ధాంధ్ర)*

★ ★ ★

# తల్లిప్రాణం

"చెప్పినమాట విను" అన్నాడు రామబ్రహ్మం.

బుజ్జగించి లోపుచేసుకుందా మని అతని ప్రయత్నం; కాని, పురుషుని అహంకారమూ, యజమాని అధికారమూ స్ఫుటంగానే ధ్వనించా యామెకి ఆ మాటలతో.

"నేను విననండీ!" అంది భద్రమ్మ తల తాటించుకుంటూ

ఇంకా వూరుకుంటే విషమిస్తుందని తోచినప్పుడు స్త్రీలు కనపరిచే పట్టుదలా ప్రతిఘటనా స్పష్టంగానే వున్నా యామాటలో.

వాటికి మెరుగు పూద్దామని ప్రయత్నించనే లేదామె.

పైపెచ్చు, నిర్లక్ష్య భావమూ కనపరిచింది. నిర్మొగమాటంగా.

ఇదివరలో రెండుమూడు మాట్లీ ప్రస్తావన రాకపోలేదు; కాని, తెలివిగా మాట తప్పించేస్తూ వచ్చిందామె.

అయినా అత నూరుకోకపోడం చూసి యెవరో అతణ్ణి రెచ్చగొడుతున్నారని గుర్తించుకుంది.

కనక, యెప్పటి కయినా యిది తప్పనిదే, తనకి.

అంచేత, దీని అంతు చూడాలని నిశ్చయించుకుంది.

ఈ నిశ్చయంతో యిలా యెదురుకుంది, చివరికి.

ఇందులో పెంకితనం కనపడకపోలే దతనికి.

అయినా, వెనక్కి తగ్గలే దతను.

ఇందులో తనకూ బాధ్యత వుందని ఆమెకి తెలియబరచాలన్న వుద్దేశంతో అందుకున్నాడు, మెల్లిగా.

"అలా కాదు, కొంచెం నిదానించు, దీనివల్ల యేమీ లాభం లేదని నీకే తెలుస్తుంది."

"చదువుకుంటే లాభం లేదని మీరు కనక అనగలిగారు, వూరుకోండీపాటికి."

"శిరోమణి పరీక్ష యిచ్చిన మొగరాజులకే దిక్కూ దివాణమూ లేకుండా వున్న దినా లివి. అమ్మాయి విద్వా నయితే–"

"అయితే, అంటూ సందేహం కూడానా?"

"లేదు, అవుతుందే అను, నీ మాట యెందుక్కా దనాలీ? అయితే, అది వుద్యోగం చేస్తుందా వూళ్ళేలుతుందా?"

"చెయ్యకపోడానికీ యేలకపోడానికీ తెలివితక్కువదా, చేతకానిదా చిట్టితల్లి?"

"అదికాదు నేను చెప్పేది–"

"మరేమిటండీ?"

"కాక,—ఉద్యోగం కోసమేనా చదువు?"

"చెప్పే దేమిటో—"

"ఉద్యోగం చేయిద్దామనే చదువు చెప్పించారు మీ నాయనా, మా నాయనా మీకు. ఏం చెయ్యగలిగారు, మీరు?"

"........"

"మీరే కాదు. బి.యేలూ ఎం.ఏలూ కూడా లక్షమంది మొగపిల్లలు దేవుళ్ళాడు తున్నారు, వుద్యోగాలు దొరక్క. మరి, చదువులు మానుకున్నారా వారిని చూసి తరవాతివాళ్ళు?"

"దాని కవసరం యేమిటని అడుగుతున్నాను నేను, తెలుసా?"

"అంటే—"

"అది తప్ప, మన కిప్పటి కింకెవరూ లేరుగదా, వున్నదంతా సుఖంగా అనుభవించక నౌఖరీ కర్మం యేమిటీ అమ్మాయికీ?"

"అధీనం తప్పితే అత్తవారు విదిపికొట్టే మనోవర్తి డబ్బులకు తప్ప ఎంత వుండినా పుట్టింటివారి ఆస్తిలో అధికారం యేదీ ఆడపిల్లకీ?"

"

"పోనీ, అనుభవించడానికే పెట్టిపుట్టిందా నా చిట్టితల్లి?"

ఇలాంటి మర్మాఘాతం సంభవిస్తుం దనుకోలే దతను.

నోరు నొక్కేసిన ట్టయిపోయింది, దీంతో.

"చేతులారా దాని గొంతుకు పిసికేశారు కాని, కాస్త అయినా తరువాయి అట్టేపెట్టారా మీరు మీ అమ్మాను?" అంటూ ఆమే అందుకుంది, చూసిచూసి

"........"

"మొగుడు చస్తే చచ్చాడు, చదువనీ పుస్తకాలనీ పత్రికలనీ సభలనీ—ఆ సందట్లో పడయినా కాలం వెళ్ళబుచ్చుకోడానికి—"

"కాలమే వెళ్ళబుచ్చుకోవాలంటే, అందుకు లక్షమార్గాలు."

"వాటిలో యిదొకటి, తెలుసా?"

గభీమని మాట తోచకపోవడమే మంచిదయిం దతనికి

ఈ వ్యధానంలో కొత్తదారి కనపడింది.

"మాటకి మాట అనెయ్యడమే గొప్ప అనుకోకు. దాని కోసం డబ్బు ఖర్చు పెట్టటం యిష్టంలేక నే నిలా అంటున్నాననికూడా అనుకోకు. ఇనప్పెట్టి తాళాలు దానికే యిచ్చేస్తాను. నాకేం కావలసినా దాన్నే అడుగుతాను. అది యిస్తేనే పుచ్చుకుంటాను."

"ఉపోద్ఘాతం చాలు, అస లేమిటో చెప్పండి!"

"తీర్థయాత్రలు, దినాని కోనోము, సంతర్పణలు, సమారాధనలు—"

"ఏం, అగారేం?"

"సంసారం అంతా అదే నిర్వహించేస్తుంది. మరి, వివరాలెందుకూ?"

"ఎవరి సంసారం?"

తల యెగరవేసుకుంటూ ఆమె యిలా అడిగాటప్పటికి వులిక్కిపడిపోయా డతను.

"బుర్రకూడా – " అంటూ మాట నాన్చేసిం దామె; కాని, అంతమాత్రానికే కొండవిరిగి మీద పడ్డట్టయిం దతనికి.

జుట్టు తీయించేసుకునీ, సైనుపంచె కట్టుకునీ తన కూతురు తన యింటోనే వంటలక్క అయివుండినట్టున్నా అనిపించింది.

కాళ్ళల్లో వొణుకు పుట్టింది, దీంతో.

మనస్సు చెదిరిపోయింది.

ఇది గుర్తించి "మేనరికం వద్దో అని నే నెంత మొత్తుకున్నా, నాకీ మొగుడు వద్దు మొర్రో మంటూ అదెంత గోలపెట్టినా మొండికెత్తి దాని బతుకింతకి తెచ్చారు మీరు. పుట్టిన వొక్కబిడ్డా మోడయిపోయి అలో లక్ష్మణా అంటూ యేడుస్తూ వుంటే జాలి లేదూ మీకు? కనికారం పుట్టదూ?"

"........"

"దుఃఖం యెరుగరూ మీరు?"

గిర్రున నీళ్ళు తిరిగా యతని కళ్ళల్లో.

ఆమెకేసి చూడలేకపోయాడు, ఆ వాలకంతో.

"అంత చక్కనిపిల్ల మరొక్కర్తి వుందా భూమ్మీదా? దాని తెలివి తేటలకు హద్దూ పద్దూ వున్నాయా? దాని వొబ్బిడీ. దాని నిదానమూ, దాని అరిందాతనమూ యేమయిపోనూ? దాని ఆశలు నిరాశలయి, దాని బతుకు బగ్గంపాడయిపోవలసిందేనా?"

చెవులు గింగుర్లెత్తిపోయా యతనికి.

"నే నెందుకు చూస్తున్నానో కాస్త పరకాయించుకోండి! చదువుసంధ్యలబ్బాయి కనకనే ఆ మంచితనమూ అబ్బింది దానికి. చదువే లేకపోతే – మీ యింటి ఆడబడుచది – మీ అక్కలాగ కజ్జాకో రయిపోయి వుండును. గుర్తించుకోండి!"

తన అక్క సంగతి బాగా తెలిసి వుండ దనుకున్నాడామెకి

తెలిసివుండినా యిప్పుడు మరిచిపోయి వుంటుందనీ అనుకున్నాడు.

కాగా, దీంతో తెల్లబోయాడు.

అదిన్నీ గ్రహించేసిందామె.

అతనికి "నసాళం అంటిం"దనుకుంది.

"ఇక ఫరవాలే"దనిన్నీ నిశ్చయించుకుంది.

"మంచిమాటాడి పంపేద్దాం" అని దయతలచింది, చివరికి.

"మంకుపట్టు పట్టానని మీరు బాధపడనక్కరలేదు. ఇదితప్ప మీరేమి చెప్పండి వింటాను. ఇదివరకల్లా వినలేదుటండీ!" అనడిగింది, లాలనగా.

తేరుకున్నా డతను, దీంతో

"ఈ వొక్క మాటా కూడా వినకూడదూ?" అందా మనుకున్నాడు.

మాట నాలుక చివరికి వచ్చేసింది కూడా; కాని "నా మాట వినడం నామోషీ అనుకున్నారేమో మీరు. తల్లిమాటా వేరే గంపెడు సంసారం నిర్వహించుకుంటున్న అక్కమాటా వినడం కంటే తప్పు కాదు, చేసుకున్న పెళ్ళాం మాట వినడం" అందామె, చురచుర చూస్తూ, అంతలో.

కూతురుకి పెళ్ళి ప్రయత్నాలు చేసినప్పుడు తల్లికే కాదు అక్కకీ తాను బానిస అయిపోయి వుండడం జ్ఞాపకం వచ్చిందతనికి.

అప్పుడు కూతు రేడవడమూ, అందుకు జాలిపడి "నువ్వు మనిషివి కావూ?" అంటూ యిరుగు పొరుగూ తనని నిరసించడమూ, అయినా, తాను హృదయం రాయిచేసుకోవడమే కాక, భద్రమ్మని దాసీదానికంటె నికృష్టంగా చూడడమూ – ఇదిన్నీ జ్ఞాపకం వుందతనికి.

తన మొండితమే యింతకి తెచ్చిందని బోధపడిం దతనికి; కాని వయసు వచ్చిన సుందర వితంతువు – సయానా తన యేకపుత్రిక – పుణ్యస్త్రీ వేషం వేసుకు తిరగడమూ, పెద్ద పెద్ద చదువులూ చదువుతూ సభలకు వెళ్ళి పురుషుల మధ్య కూచుంటూ వుండడమూ – ఇవన్నీ జ్ఞాపకం వచ్చి మళ్ళీ అభిమానం అందుకుం దతనికి.

కాగా "మరొకటీ మరొకటీ అయితే – " అంటూ యేమో అనబోయాడతను; కాని "మరొకటీ మరొకటీ కాక మరేమిటీ యిదీ?" అటూ ఝుమాయించి అడిగిందామె, మాట సగంలోనే అందుకుని.

మళ్ళీ తెల్లబోయాడు.

మాటే అడలేకపోయాడు

ఆమె మాత్రం వూరుకోలేదు.

"అమ్మాయి జోలి మీ కక్కరలేదు. ఆడవాళ్ళ కష్టసుఖాలు మొగవాళ్ళకర్థం కావు. చావలేక బతికివున్నాను నేను. ఏడవలేక నవ్వుతున్నాను. ఎదుర్రొమ్ము మీద కుంపటిలాగ అమ్మాయిని భరించేదాన్ని నేను, మీకేం తెలుస్తుందీ?"

ఒక్క దెబ్బతో అష్టోత్తరశతంగా ఓంకారనాదం చేసే గంట అయిపోయిం దీమాటతో అతని చెవి.

"ఒక్కనాడు మీరింటో లేకపోతే – వొక్కపూట మీరు కనపడకపోతే – ముప్పయ్యేళ్ళు నిండిన నేనే యెలాగో అయిపోతాను గదా, మొన్ననే పదిహేడేళ్ళు నిండిన పిల్ల అమ్మాయికి వైరాగ్యం కలగాలని మీరెలా ఆశిస్తున్నారండీ?

మనస్సు గుబగుబలాడిపోయిం దతనికి.

"పోనీ–మీ మాట చెప్పండి నాతో మాట్లాడకుండా వుంటారా మీరు? నాకూడా కూడా తిరగడం మానుకుంటారా? నాకేసి చూడ్డం కూడా పనికిరాదు, కట్టిపెట్టేస్తారా?"

ఇలా అడుగుతూ చురుగ్గా కూడా చూసిందామె.

ఆ చూపులు భరించలేక పోయా డతను.

"గుర్రం దిగు ఈపాటి" కంటూ జబ్బపట్టుకుని యెవరో దిగ గుంజేసి నట్టున్నా కాగా, మాట్లాడలేకపోయా డతను.

అతనేదో వొకటి అనగలిగితే యేమిటేమిటో అనేసునామె; కాని అతని మౌనం విసుగు పుట్టించింది.

మరో క్షణం కూడా యెదురుచూసింది.

"ఒక్కదానికి బదులు చెప్పకపోతే యేం జేతునమ్మా నేనూ?" అందామె, చేతులు తిప్పుకుంటూ చివరికి.

పూర్తిగా చిత్తయిపోయివున్నా డతను; కాని దీంతో వూపిరాడింది, మెల్లిగా.

నిర్లక్ష్యంగా యెదురుకుని, నిర్మొగమాటంగా నిలవతీసిన్నీ, వుండి వుండి చివరి కిలాగ ఆమె స్త్రీ సహజమైన ధోరణిలో పడిపోయాటప్పటికి పౌరుషం రేకెత్తిందతనికి.

అయినా దెబ్బతిన్న పాము.

ఆలోచించి "ఇప్పుడే కాదూ మాట్లాడవద్దన్నావూ నువ్వూ?" అనడిగాడు మొండిగా, నిష్ఠురంగా చూస్తూ.

"సడే" అందామె; కాని, వ్యవహారం మరో అంతస్థులోకి వెడుతోందాని శంకించుకుంది.

అదే నిజమైతే గ్రంథం తుంచెయ్యాలి. లేకపోతే చిక్కులున్నాయి.

అలా తుంచెయ్యడంలో కూడా విలాసాలు చూపించే అవకాశం వుంది, తన స్త్రీజాతికి.

కాగా, మేజామీద వుండిన ఫలహారప్పళ్ళెం అందుకుని "యిలా తిరగండి" అందామె, చంటిపిల్లవాణ్ణన్నట్టు బెల్లించి చూస్తూ.

ఇదంతా వోరకంట చూశాడతను.

"చేతిలోకి వస్తోంది పిట్ట" అనుకున్నాడు.

అక్కడ ప్రారంభమైన విలాసాలకు మారాకు తొడగాలంటే తనది కోపం కాదన్నట్టు స్ఫురింప చెయ్యాలామెకి, కావ్యార్థ సూచనలాగ.

కనక ఉన్నవాడున్నట్టామెకేసి తిరిగాడు లాఘవంగా.

"దగ్గరికి రండి."

మీదిమీదికి జరిగాడతను "మరేం చేస్తావో చెయ్యి" అన్నట్టు చూస్తూ.

"నాకేసి చూడండి."

నవ్వు వచ్చిందతనికి; కాని, అతిప్రయత్నం మీద బిగపట్టుకుని, గాంభీర్యం కూడా తెచ్చుకున్నాడు, ముందు.

అతితాపీగా మొగం తిప్పుకుని, అంతకంటేనూ మెల్లిగా ఆ మొగం పైకెత్తుకుని, మెల్లిగా కళ్ళు పెద్దవిచేసుకుని, రెప్పవెయ్యకుండా చూశాడు చివరికి.

అతని ప్రయత్నమేమో ఆమె పాలించడమే.

ఊహ కూడా ఆమెను ప్రసన్నురాలిని చేసుకోడమే.

అయితే, నవ్వు బిగబట్టుకోడానికి చేసిన ప్రయత్నం అతి అయి, అతని చూపులకు కరుకుతనం చేకూర్చింది.

అదంతా కోపమే అనుకుందామె.

ఆమె గాంభీర్యం అంతా పూర్వపక్షం అయిపోయింది దాంతో.

బెట్టుసరి కూడా నీరయిపోయింది.

దీనికి సాయం – చెలికత్తెతో మాట్లాడుతూ వంకాయబజ్జి చేస్తున్న కూతుర్ని యేమార్చి వచ్చింది తాను.

ఇక్కడే కూచుంటే ఆమె కేకలేస్తుంది.

ఫలహారం కాకుండానే ఆ కేక వస్తుందేమో?

కనక, "తొరగా కానివ్వండి" అంటూ ఫలహారం చేయించింది, మధ్య మధ్య తాను కూడా కాస్త కాస్త పుచ్చుకుంటూ.

కాఫీ యిచ్చింది కొసిరికొసిరి; కాని, అతనామె చెప్పింది చూస్తూ కూడా అలా బిగపట్టుకునే వున్నాడు మొగం.

ఇదంతా రసాభాస అయిపోయినట్టనిపించిం దామెకి, దాంతో.

మొగాన బేలతనమున్నూ అలుముకుంది.

మరి వుండలేక బుజం పట్టుకుని కదుపుతూ "ఏం కోపం వచ్చిందా?" అంటూ జాలిగా చూసింది.

ఓః!

అఖండ విజయం పురుషుల కది

ఏనుగెక్కినంత వుల్లాసం వచ్చిందతనికి, దీంతో.

శృంగారవిలాసాలున్నూ పుట్టుకు వచ్చాయి, అవ్యవధానంగా.

ఎడమచేత్తో ఆమె నడుము చుట్టేశాడు, వెంటనే బుగ్గకి బుగ్గ ఆనించి పావురం లాగ కువకువలాడుతూ.

## 2

మడతకండువా మెడలో సవరించుకుంటూ వీధిసావట్లోకి వచ్చాడు రామబ్రహ్మం

అతనికోసమే అక్కడ కనిపెట్టుకుని వుండిన వెంకుసోదెమ్మ "ఏమాలోచించావు నాయనా?" అనడిగేసింది నిశ్చలంగా చూస్తూ, వెంటనే.

"ఆలోచించానుగాని, యింకా యేమీ నిశ్చయించలేదమ్మా!"

"ఏమీ అంటే?"

పోలీసుల అదమాయింపులా కనపడిందతనికిది.

ఇంటిల్లపాదికీ తాను లోకువ అయిపోయివుండిన ట్టనుమానం పుట్టి, అభిమానమున్నూ ముంచుకువచ్చేసింది.

పురుషకారం యెలా వుండినా యెత్తింది మగజన్మ మరి.

పైగా గ్రాడ్యుయేటు – సెమీ అయితే యేంగాక.

కనక, యిది బాగాలేదనుకున్నాడు.

ఇక యిలా జరగనివ్వకూడదనిన్నీ నిరుకుచేసుకున్నాడు.

"బదులు చెప్పకపోతే యేం?" అనుకున్నాడు కూడా; కాని "చదువు చెప్పించడమా మాన్పించడమా అని" అంటూ నోరు జారిపోయింది.

పోనీ అంటే, అవతలి మనిషి అతణ్ణి కన్నతల్లి.

ఆ యింటో–అతనిమీద కూడా ఆమెకీ వున్నాయి కొన్ని అధికారాలు, సహజంగా.

పైగా, భర్త అకాలమరణం పొందిన దుఃఖం అంతా మరిచిపోయి, మూడుమూసాల గుడ్డుని పెంచి యింతవాణ్ణి చేసుకుందామె.

తన చెప్పుచేతల్లోనుంచి జారిపోకుండా మిక్కిలీ జాగ్రత్త పడుతూనున్నూ పెంచుకుందామె.

ఇప్పటికీ ఆ జాగ్రత్త మరిచిపోలేదామె.

నలభైయేళ్ళ వాడతను; కాని చంటిపిల్లవాణ్ణి ఆజ్ఞపెట్టినట్టు నడిపిస్తూ వుంటుందతణ్ణి, యెలాంటి సందర్భంలోనూ కూడా.

"కాగా, చెప్పించడం యిదివరకే జరుగుతోంది, యిక నువ్వాలోచించ వలసింది మాన్పించడం మాటే" అంటూ సాగతీసుకుంది, చేతులు తేలవేసుకుంటూ.

అక్కడ యేదో విధంగా తప్పించుకు వచ్చాటప్పటి కిక్కడ యిది!

ఇంటి కంతకీ తా నొక్కడే మొగవాడు.

యజమాని; కాని, ఉన్న యిద్దరు స్త్రీలూ తనమీద అధికారం చెలాయిస్తూనే వుండడం చాల బాధ పెట్టిందతణ్ణి.

కాని, కిమ్మనలేకపోయాడు.

యథాపూర్వకంగానే అందుకుందామె:

"చిన్నాడవూ చితకాడవూ కాదు నువ్వు, కాస్త పెద్ద తరహా నేర్చుకోవాలీపాటికి."

ఇలా అందే గాని, ఆ వాతావరణమే యెరగనివాడికి, ఇవాళ హఠాత్తుగా పెద్దతరహా వస్తుందా?

ఇది యోచించుకోలేదామె.

ఎంతసేపూ తనకి విధేయుడయి వుండేటట్టు చూసుకుంటూ వచ్చినందుకు, పెళ్ళానికిన్నీ విధేయుడయి వుండే ధోరణే అబ్బిందతనికి

అయితే, యీామె వ్యవహర్త.

ఆమె ప్రణయవతి మాత్రమే.

కాదంటే, విలాసవతిన్నీ.

పరోక్షంగా నయినా తానింటికి యజమానురాలు కనక, తన భర్త తన కనుకూలుడై వుండాలనుకుంటుందామె.

ఇది యెప్పుడో గుర్తించేసింది వెంకుసోదెమ్మ.

అది మొదలు, సమయం వచ్చినప్పుడల్లా కోడలిని దూరంగా నెట్టుకుంటూనే వస్తోందామె, మెళుకువగా.

బయటవుండి సాటివాళ్ళని చూసినప్పు డేమనుకున్నా — ఇంటో వుండినా లోపల్లోపల యేమనుకోగలిగినా అత నందుకనుగుణంగానే సంచరించుకుంటున్నాడు.

ఇక్కడే వుంది భేదం, చిన్నప్పుడే తండ్రి చనిపోయిన మొగవాడికీ, తండ్రి చెప్పుచేతుల్లోనే పెరిగిన మొగవాడికీనీ.

నిజానికి, కొడుకు తెలివితేటలు కావాలనడంలో తల్లికీ తండ్రికీ వొకరకమైనదే శ్రద్ధ; కాని వీధికి వెడితే దుస్సహవాసాలలో పడిపోతాడేమోనని అని — కనీసం స్వతంత్రించడం అయినా నేర్చుకుంటాడేమోనని ఇంటోనే మూసి పెట్టుకుంటుంది తల్లి, కొడుకుని.

తండ్రిమాత్రం అలాకాదు, ఇటు దుస్సహవాసాలలో పడకుండానూ చూసుకుం టాడు, అటు స్వతంత్రుడూ వ్యవహర్తా కూడా అయేటట్టూ చూసుకుంటాడు, కొడుకుని.

వీధికి వెళ్ళే మొగవాడికే వుండే దృక్పథం యిది.

రామబ్రహ్మం దీనికి దూరం అయిపోయాడు, చిన్నప్పుడే.

కాగా, తల్లి అన్నా భయమే, పెళ్ళాం అన్నా హాణుకే మొదణ్ణుంచీ అతనికి.

అయితే అటు మాతృవాత్సల్యమూ, యిటు భార్యా ప్రణయమూ గూడా పుష్కలంగా అనుభవిస్తున్నా డతను.

వీధికి మాత్రం వెళ్ళలేదు.

ఎలాంటి వ్యవహారం అయినా అర్థం అవుతుంది కాని; నడవదు.

నడిపించుకుందా మన్న చూపే లేదు.

మొదణ్ణుంచీ సంసారం తన గుప్పిట వుంచుకుని వుండిన వెంకుసోదెమ్మ కిదీ కావాలసింది.

అయితే, చిన్నతనం కావడం వల్ల పెళ్ళాం మాట అంటే తియ్యగా వుండినా తాను కళ్ళెర్రజేసినప్పుడూనా?

## 3

ఈ దిలాసాతో మళ్ళీ అందుకుందామె.

"నువ్విలాగ నీళ్ళు నములుతూ కూచుంటే వల్లమాలిన అప్రతిష్ట చుట్టబెట్టుకుంటుంది సుమా!"

"చదువుకుంటే అప్రతిష్ఠ యేమిటమ్మా?"

"ఆ!"

"పోనీ, పారశాలకి వెడుతోందేమో అంటే లేదాయె. నాలుగ్గోడలమధ్యా - ఇంటో కూచుని, చడీచప్పుడూ లేకుండా—"

"అదేమిట్రా నీ మాటలూ నువ్వూనూ? ఇంటో కూచుని అయితే మాత్రం అదేమి చదువురా?"

"ఏం?"

"నువ్వు వచ్చి మావాళ్ళకి తెలియకుండా నన్ను తీసుకుపో – అంటూ కృష్ణమూర్తికి వుత్తరం రాస్తుందిట రుక్మిణీదేవి. ఆపళంగా వచ్చి అతగాడు అమాంతంగా అమె నెత్తుకుపోయి—ఇలాంటిదేనా యీడువచ్చిన పిల్ల నేర్చుకో వలసిన చదువు?"

"ఏమిటీ?" అనిపించిం దతనికి.

అరికాలిమంట నెత్తి కెక్కింది కాని; అది రుక్మిణి దేవి కల్యాణం కథ అన్నమాట జ్ఞాపకం వచ్చిందంతలో.

"భావకవుల రచనలు చదివితే యేమో గాని మహాభక్తుడు కదా – పోతరాజు రచన చదివినా చెడిపోతారా ఆడపిల్లలు?" అనుకున్నాడు, దీనిమీద.

అది తీరకపోగా "మరి, యిప్పటి యేబ్రాసిపిల్లలు రాసేటట్టే రాసిందేం వుత్తరం రుక్మిణీదేవి?" అంటూ మరో సందేహం కలిగింది.

"అందుచేతనే కామోసు అమ్మకీ గుంజాటన?" అనిపించింది.

అయితే, అటు చూస్తే, కూతురి దృష్టి చెడుతుం దన్న అపాయశంక కనపడింది; కాని యిటు చూస్తే, స్వతంత్రించి వ్యవహరించవలసిన చిక్కు కనపడుతోంది, తనకి.

కాక,–స్థితి వున్నందుకు, "చక్కగా పొద్దున్న బిలియర్డ్సున్నూ, సాయంత్రం టెన్నిస్సూ ఆడుకోకుండా ఈ పాడు గొడవ లేమి" టనిపించింది.

"రాగాలు తీస్తూ, కళ్ళుతిప్పుకుంటూ పాతికేళ్ళవాడు పాఠం చెప్పడమా?" అంటూ ప్రారంభించింది, మళ్ళీ ముసలమ్మ.

"ముసలిపండితుడు చెబితే పనికివస్తుంది కదా?" అనడుగుదామనుకున్నాడు కాని; వశం కాలేదు.

ముసలావిడే అందుకుంది.

"ఎక్కే గుమ్మమూ దిగే గుమ్మముగా ప్రయివేట్లు చెప్పి పొట్టపోసుకునే వాడికి ఆ పట్టంచుల పంచెలూ ఆ జరీకండువాలూ యెక్కణ్ణుంచి వస్తాయో! అవెక్కడి సెంట్లో, ఆ తాంబూలానికి విధీవిరామమూ వుందో లేదో–"

"తక్కిన యిళ్ళ వాళ్ళెందుకు చెప్పించుకుంటున్నారూ ఆయన చేత?"

"అయితే?"

"మనకెందు కీ సందేహం?"

"వాళ్ళ కర్మం, మనకేం?"

ఝుమాయించి యిలా అడిగేసిందే గాని, తన మాటలో తనకే వ్రాతం కనపడలే దామెకి.

ఆలోచించింది.

"సుందరి యేమి చేస్తోం దండీ అమ్మమ్మగారూ?" అంటూ వస్తాడాపిల్లాడు. "అమ్మాయి కొడుకు కూతురా? తా నేమో నాకు కూతురి కొడుకా? వావి యెలా కల్పించాడో చూశావా?" అనడిగింది, వెంటనే "ఏం చెబుతా?"వన్నట్టు చూస్తూ.

"ఆ, ఆ" అనుకున్నా డతను.

దడా దడా కొట్టుకున్నా యతని గుండెలు.

"ఆహితాగ్నుల కుటుంబంరా మనదీ, నీ పూర్వులెవరూ వొకరిచేత వేలు పెట్టి చూపించుకో లేదురా!" అని కూడా అంది, ఆ వేడి తగ్గకుండా.

అయితే, వారి నెవరినీ యెరగడతను కాని, ఆ పూర్వులు – ముఖ్యంగా – అతని పితృపితామహప్రపితామహులు ముగ్గురూ వచ్చి తన యెదుట నుంచున్నట్టనిపించిం దతనికి.

తనలాగ అప్రాచ్యవేషంతో కాక, నీరుకావి ధోవతులు కట్టుకునీ, కాశ్మీరుశాలువలు కప్పుకునీ, కుండలాలున్నూ ధరించీ బ్రహ్మవర్చస్సంపన్నులై వున్నారు వారు.

తళతళ మెరుస్తూ వారిచేతుల్లో చిన్న చిన్న రాగిజారీలున్నాయి.

"మేము స్వతంత్రులంగా బతికాం. మా సంసారాలు మేము స్వయంగా నిర్వహించుకుంటున్నాం. ఆటవస్తువులుగా కాదు. మా తల్లుల మాటమీదా, మా తోడబుట్టువుల మాట మీదా మా ఆడపిల్ల గొంతుకలు కొయ్యలేదు మేము" అన్నట్టూనూ అయింది వారు.

చేత్తో దేవేసినట్టయి పోయిందతని మనస్సు, దీంతో.

"అమ్మ చెప్పినట్టు నడుచుకోడమేనా, కూతురి బతుకు చూడ్డం యేమయినా వుందా?" అన్నప్రశ్న యెక్కణ్ణుంచో వచ్చి చెవులు గింగురు మనిపించింది.

"అమ్మాకు యేముంటుందీ?" అనడిగాడు దురుసుగా దీంతో.

"మచ్చిక పడింది, మాంతా నంటుందా అది?"

"అడిగే దొకటీ చెప్పే దొకటిన్నీ" అంటూ విసుక్కున్నా డతను, మొగం పక్కకి తిప్పుకుని.

"కాకపోయినా, దాని యిష్ట మేమిట్రా?" అంటూ నిలవతీసింది ముసలమ్మ.

ఒక్క నిమిషం అతనిలా చూడలేదు.

తల్లిమాట మాత్రం చెవిని పడింది, ఆ నిమిషాన.

"చదు వబ్బుతోంది గాని లోకజ్ఞాన మేదీ చిట్టితల్లికీ? కనక, అమ్మ అన్నమాట నిజమే" అనుకున్నా డతను.

"న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అన్న కారిక గూడా గభీమని జ్ఞాపకం వచ్చింది; కాని "మీ అమ్మ మాత్రం ఆ సూత్రం కిందికి రాదుటోయ్?" అంటూ యెవరో టొకాయించినట్టయింది.

నిర్విణ్ణు డయిపోయాడు.

"ఆ పిల్లాడు వస్తే యిక మా అమ్మాయి చదువుకోదు వెళ్ళిపొమ్మని చెప్పేస్తా" నంటూ ముసలమ్మే అందుకుంది, అతని తటపటాయింపు చూసి.

అప్పటికీ అతని నిర్విణ్ణత వదలలేదు; కాని అవతలివైపున "జాగ్రత్త" అని తర్జనితో నిషేధిస్తూ భద్రమ్మ ఉగ్రమూర్తి కనపడింది.

స్తబ్ధుడే అయిపోయాడు, దాంతో అతను.

"ఏమంటావ్?" అనడిగింది ముసలమ్మ, చూసిచూసి.

"మాట్లాడ వేమిరా?"

" "

"అక్కా బావా అక్కడ వీధికి రాలేక కుళ్ళిపోతున్నారురా!"

"ఎందుకూ?"

"అయ్యో, అయ్యో—"

"కుళ్ళి కుసిల్లిపోవలసినంత వుప్పెన యేం వచ్చిం దమ్మా వాళ్ళకి?"

"చెట్టంత కొడుకు బుగ్గయిపోయి – ఈడు వచ్చి రంభలావున్న కోడలు వీధెక్కి చదువులు వెలిగిస్తోం దంటే – ఇదేమీ విపరీతం రా, నీకింత మంచీ చెడ్డా తెలియకుండా వుందీ?"

"మన అమ్మాయి మంచిచెడ్డలు మనం చూసుకోమూ?"

"చూసుకోమనే కాదూ నేను చెబుతున్నది మాత్రం?"

"స్నేహితులతో డచ్చీలు కొట్టడంలో వున్న శ్రద్ధ సంసారం విషయమై లేదా యేమిటి మనకి?" అని తనకి తానే ఆకాంక్షించుకున్నా డతను.

"ఛా, యిక యీ పోసుకోలు తిరగాటం మానేస్తే బాగుంటుందేమో?" అనుకున్నాడు కూడా; కాని మొగాలు వేలవేసుకుని యెందరో స్నేహితులు తన కోసం సమాజం భవనంలో పడిగాపులు పడివుండినట్టు కనపడిం దతనికి.

"నువ్వొక్కడవూ లేకపోతే మే మెంతమంది వుంటే మాత్రం యేమి ప్రయోజనమూ?" అని వారు దేవుళ్ళాడుతున్నట్టున్నూ కనపడింది.

తానే వారిలో గొప్పవాడన్న గర్వం పుట్టుకు వచ్చిందతనికి దీంతో.

"పాపం—దరిద్రులు!" అనుకున్నా డింగ్లీషులో.

పైత్యకంతో వేషాలకు పోయేవా రందరిదీ యిదే మచ్చు లోకంలో.

తమ జాతి – తమ దేశం – తమ జిల్లా – తమ వూరు – తమ సంఘం – కనీసం తమ జట్టు తమ దయాధర్మభిక్షాల మీదే నడుస్తున్నట్టు వారి భావన.

అందులోనూ, అందరికంటే యెక్కువ వున్నవాడేమో – రామబ్రహ్మం మరీనూ.

కాగా "వెళ్ళాలి" అంటూ తొందర పుట్టేసిం దతనికి.

మనసులో సంకల్పంతోపాటు కాళ్ళల్లో చలనమున్నూ కలిగింది.

ఒక్క అడుగున్నూ పడింది వీధికేసి; కాని మొగం పై కెత్తుకునేటప్పటికి తల్లి రూక్షేక్షణాలు కళ్ళల్లో గుచ్చుకున్నాయి.

"చూడు" అంటూ గద్దిస్తున్న ట్టందుకుని "అల్లుడు చచ్చి పోయినందు కేమయినా విచారిస్తుందా నీ పెళ్ళాం?" అనడిగింది.

మాట అందలే దతనికి.

"పోనీ, అంటే, సుందరమ్మయినా దుఃఖం యెరుగునా?"

అడిగి వూరుకోలేదు ముసలమ్మ, తెగ సాగతీసుకుంది.

అదెందుకో అర్థం కాలేదు రామబ్రహ్మనికి.

పెళ్ళి కాకపూర్వమూ ధుమధుమలాడుకుంటూనే వుండేవారు సుందరీ కిష్టప్పాను, ఎప్పుడొకచోట చేరినా.

అనిష్టానికి సాయం సిగ్గొకటి – పెళ్ళయాక చూడ్డమే మానుకుం దతణ్ణి ఆమె.

ఈ స్థితిలో రజస్వల అయిం దామె.

స్త్రీ కంటికి కొత్త వెలుగు కనపడే దశ అది.

పరోక్షంలో వున్న భర్తరూపం స్ఫురిస్తూ వుండడమూ, మాటిమాటికీ చూపు అటు మళ్ళుతూ వుండడమూ, భావనలో యేదో మాధుర్యం పొడగట్టడమూ జరిగే సమయం అది; కాని సుందరమ్మ రజస్వల అయిందన్న శుభలేఖ పట్టుకు వెళ్ళిన పురోహితుడు, కిష్టప్ప సుస్తీగా వున్నాడన్న కబురు పట్టుకు చక్కావచ్చాడు, కాకినాడనుంచి.

మరో రెండు రోజులకు "అబ్బాయిని ఆస్పత్రిలో చేర్చారుషరా" అని చెబుతూ ఎగిరి కాకినాడ వెళ్ళిపోయింది ముసలమ్మ.

అదేమిటో, యెందు కలా జరిగిందో చెప్పినవా రెవరూ లేకపోయారు, యింకో రెండు దినాలకు కిష్టప్ప మరణవార్త తప్ప.

"అయినప్పుడు సుందరమ్మ అయినా దుఃఖం యెరుగునా?" అనడిగితే యేమిటి చెప్పడం?

ఇదేమీ ఆలోచించలేదు ముసలమ్మ

"అసలు, నీ పెళ్ళామే మార్చేస్తోంది దాన్ని, నే నెరగనూ?" అంటూ మళ్ళీ అందుకుం దామె.

"ఎలా మారుస్తోందీ?"

"నేను చెప్పాలా?"

"ఈ మాత్రమూ గుర్తించలేవూ నువ్వూ?"

"ఇల్లు గుల్లచేసుకుని చెప్పించాను నీ చదువంతా యేమయిపోయిందీ?"

ఏమిటో అనుమానం.

ఎందుకో కంగారు.

నోరు విప్పి తన తల్లి చెప్పలేని పాడుపను లేమయినా..

చర్రున కోపం వచ్చిం దతనికి.

వూగిపోయాడు, దాంతో.

కాని, తానందుకు పూనుకుంటే సుందరమ్మ కాదు, భద్రమ్మ యెదురుకుంటుంది, తనని.

చల్లబడిపోయా డతను

ముసలమ్మే అందుకుంది, అవ్యవధానంగా—

"నీ మామగారు వీరేశలింగానికి స్నేహితు డని లోకం అందరూ యెరుగుదురు."

"అయితే?"

"అయ్యో, అయ్యో—"

"కాకపోయినా, యిప్పుడాయన లేరుగా?"

"మరి నీ మామగారు?"

".........తప్పతప్పు, ఎవరయినా వింటే బాగుండదు, వూరుకో యీపాటికి"

"ఎందు కూరుకోవాలీ?"

".........."

"ఎవడ్రా నా యెదుట నుంచుని నీ కిది తగ దనగలిగేవాడు?"

"నువ్విలాంటి మాట లంటావు కనకనే నీకూ నీ కోడలికీ పడకపోడం."

"పడకపోతే పడకపోతుంది పోనీ"

"..........."

"దానివల్ల నాకేం దిగబడి పోతుందీ?"

"      "

"నన్నేం చెయ్యగలదురా అదీ?"

"నువ్వు మాత్రం దాన్నేమి చెయ్యగలవూ?" అనుకున్నాడతను, మొగం అటు తిప్పకుని.

"పోరి, అమ్మాయిని నేను కిష్టప్ప కిప్పించా నని–"
"అవును."
"అక్కకీ బావకీ అప్రతిష్ఠ రావాలని–"
"అదేమిటి మళ్ళీ?"
"పిల్లమనస్సు–"
"ఏమిటి పిల్లమనస్సు?"
కొంచెం నిష్ఠూరంగా అడిగా డీమాట.
"ఏమిటమ్మా నీ గోల?" అని కూడా అడిగాడు, పురపుర చూస్తూ.
"గోలకిందే కట్టేశావా నాది?"
"కట్టను. ఏమిటో చెప్పు, మరి."
"నిన్నగాక మొన్న, వొక కోమట్ల పిల్ల, మళ్ళీ పెళ్ళిచేసుకుని మన వీధిలో వూరేగింది, 'నన్నే చూసుకో' మంటూ."
"ఊరేగిం పెందుకోసం మరి?"
"సడే!"
"      "
"పోనీ దాని జోలి నా కెందుగ్గానీ – సంబరపడ్తూ చూశారు అమ్మాయీ నీ పెళ్ళామూను, అరుగెక్కి."
"ఇంకెవరూ చూడలేదూ?"
"చూడకేం?"
"వాళ్ళు తలుపులు బిడాయించుకునే చూశారా, యింటో వుండి?"
"అదా యేమిటి మాట?"
"కాకపోతే మరేమిటి?"
"చూసి తక్కినవాళ్ళందరూ ఛీఛీ అన్నారు."
"అందరూనా?"
"అందరూనా అంటే అదరికీ కావాలా యేమిటి?"
"నీకు మాత్రం యెందుకూ?"

"మన యింటి పద్ధతి బాగా లేదు కనక."
"బాగా లేని దేమిటి?"
"అలా వికటంగా అడిగితే–"
"నీ వేదాంతం యేమిటో నా బుర్ర కెక్కడం లేదు. ఏమిటో పెంచుకుపోతావు గాని, అసలు సంగతి–"
"నువ్వు గ్రహించుకోవాలి గాని, యింతకంటే యేమి చెప్పనురా నేనూ?"
"చెప్పకపోతే చల్లగా వూరుకో. నువ్వూ నీ కోడలూ ఏదో కుళ్ళు పెంచుకుంటూ మధ్య నన్నేడిపిస్తున్నారు. మీ యిద్దరి మధ్యా గానుగులో చెరుకు లాగ నలిగిపోతున్నాను నేను. మీ తగువులు తీర్చడం నా వల్ల కాదు."

టెన్నిస్‌బాటు చేతిలో వుందేమో, యెదటివాడు కట్ చేస్తే కోర్టులో లాగ, వొక్కటే అంగ వేశాడు, వీధిలో కతను.

"వెళ్ళిపోతావుట్రా?" అంటూ గడపదాకా వెళ్ళింది, ముసలమ్మ; కాని అప్పటికప్పుడే మళుపు తిరిగేశాడు కూడా.

"....హోరి చచ్చు పెద్దమ్మా, వెళ్ళిపోతావుట్రా....నీ దగ్గిర యింత చేవ వుంది కనుకనే వొంటికాలి భరతం ఆడుతోం దావగలాడి...అమ్మమ్మనిట నే నీ నిర్భాగ్యుడికి. నా మనుమడు చచ్చి నే నేడుస్తూ వుంటే – రానీ చెబుతాను."

ఇలా రుంజుకుంటూ అరుగుమీదే కణాయించు క్కూచుందామె.

## 4

"చూ–శావుటే అమ్మా!" అంటూ గునుస్తూ వచ్చింది సుందరమ్మ.

పిండివంట యేదో తయారుచేస్తోంది భద్రమ్మ, వంటింటి వసారాలో.

తదేకదృష్టితో చేస్తోంది.

కాగా, యిటు చూడకుండా "యేమిటమ్మా?" అనడిగింది, అంత తొందరలో గూడా గారాంగానే.

"శాస్త్రులుగారు రాలేదుట!"

"ట?"

"అవును."

"ఎంచేతో?"

"వచ్చారుట! కాని వెళ్ళిపోయారుట!!"

"ఏమో?"

"ఏమో!"

"నాయనమ్మవేనా యీ మాటలు?"

"అవును."

"అన్నీ వేషాలు. ఆడదా మనుకొంటోంది ఆట" అంటూ తల తాటించుకుంది భద్రమ్మ, చేతిలో వున్న పని ఆపి, గ్రీవాభంగాభిరామంగా చూస్తూ.

"ఉండకుండా వెళ్ళిపోయినప్పుడు వచ్చినా రానట్టే కాదా–"

"అనడిగిందా?"

"అడిగిం దమ్మా!"

"తర్కం అంతా కురిపించేసిందే!"

"జీతం జీతం అంటూ గొణుక్కుంటూ వెళ్ళిపోయారుట."

"ఆ మాట యెందుకు వచ్చిందో?"

"అడిగాను, 'ఇంతకంటే పెద్దజీతం వచ్చే పారం దొరికిందేమో మరి' అంది."

"అలాగేం? అంతా కల్పన. ఏవో పుల్లవిరుపు మాటలని–"

"పుల్లవిరుపు మాటలతో కుదిర్చిందో లేదో?"

"ఎన్నిమాట్లు పిలిచారో పాపం!"

"పిలుపందకుండా తలుపు వేసేసిం దేమో?"

"అంత జాణ కాదనా?"

"నిన్నూ పిలువరుట, తననీ పిలువరుట, యెప్పుడు వచ్చినా నన్నే పిలుస్తారుట—విన్నావా?"

"అలాగా?"

"మేడమీద వసారాలో నుంచుని కనిపెడుతూనే వున్నాను నేను. అయితే, అది కాదని యిదీ, యిది కాదని అదీ ప్లేటు మార్చడంలో ఫోనుదగ్గిర నాలుగైదు నిమిషాలుండి పోవలసి వచ్చిం దొకమాటు ఆ సందుబాట్లో జరిగివుంటుందది."

"అంతే అంతే."

"సమయానికి నాన్నారు కూడా లేకపోయా రింటో."

"రానియ్యి, అదేమిటో కనుక్కుంటాను."

ఒక్క క్షణం వూరుకున్నా రిద్దరూ.

భద్రమ్మ పని అందుకుంది.

ఇంకో క్షణం వెనక్కీ ముందుక్కీ తక్కిళ్ళాడి "ఇప్పుడు వాళ్ళ రామలక్ష్మికి పాఠం చెబుతూ వుంటాడు" అంది సుందరమ్మ, సిగ్గు తెమల్చుకుంటూ.

"సోమశేఖరం మామయ్యగారి యింటికి వెళ్ళి, వాళ్ళ లచ్చిగా ణ్నొకమాటు తీసుకురా -నువ్వు."

"ఎందుకే అమ్మా?"

"నీకు పాఠం చెప్పడానికి భోజనం చేసి రాత్రి రమ్మని కబురు చేస్తాను శాస్త్రులుగారికి."

దీనిమీద ఏదో అనబోయింది సుందరమ్మ; కాని సాహసించలేకపోయింది

పోనీ అంటే అనకుండానూ ఉండలేకపోయింది.

ఒక్కక్షణం వూగిపోయిందీ ద్వైవిధ్యంతో ఆమె.

ఉండుండి సాహసం చేసింది చివరికి; కాని "పోనీ—" అని మాత్రమే అనగలిగింది

"ఏమంటావు తల్లీ?"

"............"

"చెప్పవే అమ్మా?"

"నీకు తెలవదా యేమిటి?"

"ఈ పని తొందరలో నా కేమీ తోచడం లేదమ్మా!"

"మైసూరుపాకు చేస్తున్నావు కాదా యేమిటి?"

"చేస్తే?"

".. ......"

"శాస్త్రులుగారికి—"

"ఏమో నాకు తెలవదు" అంటూ బుంగమూతి పెట్టుకుంది సుందరమ్మ మొకం అటు తిప్పుకుని.

ముక్కలు మరో పళ్ళెంలో పేరుస్తూ ఆలోచించింది భద్రమ్మ.

పని మానేసి దృష్టి యేకాగ్రం చేసుకునిన్నీ ఆలోచించింది.

"ఇంకేమిటీ మరి?" అంటూ యిటు చూస్తూ అడిగింది, అటు పేరుస్తూనే.
సుందరమ్మ కూడా సరిగా అప్పుడే అటు చూసింది, తల్లివాలకం గుర్తిద్దా మని.
ఇద్దరి కళ్ళూ అభిముఖా లయినాయి.
ఇద్దరి చూపులూ కలిశాయి.
ఇద్దరికీ వూహా కూడా అందింది.
"భోజనాని క్కూడా రమ్మంటాను, సరా?" అంది భద్రమ్మ.
సిగ్గు మరీ ముంచెత్తగా తలుపుచాటున నక్కింది సుందరమ్మ.
"అంత సిగ్గెందుకు తల్లీ, యీ మాత్రానికి? మరి లచ్చిగాణ్ణి తీసుకురా తొరగా" అంటూ మళ్ళీ పని అందుకుంది భద్రమ్మ.
ఓరచూపులు చూసుకుంటూ గుమ్మందాకా అడుగులో అడుగు వేసి, తరువాత వూచ అయిపోయింది సుందరమ్మ
"వెర్రితల్లీ!" అనుకుంది భద్రమ్మ, అది గుర్తించి.
ఆ మాత హృదయం వుప్పొంగిపోయింది ఆ ముగ్ధవిలాసానికి

## 5

మేడమీద పనుండి భద్రమ్మ మెట్లదగ్గిరికి వచ్చాటప్పటికి "ఉత్తరం రాశాడు మా బావ" అంటూ నాలుగు కాగితాలు చేతబుచ్చుకుని హాల్లో నుంచి వచ్చి కలుసుకున్నాడు రామబ్రహ్మం
"ఏదీ?"
"ఇంగ్లీషులో రాశాడు."
"సీమనుంచి యిప్పుడే వోడ దిగారు కామోసు దొరగారు!"
"..... ......"
"ఏమి రాశా రింతకీ?"
జాబు చేత్తో పుచ్చుకుని ఆమె సంబరపడుతూ చదువుకుంటుందనుకుని రాలేదతను.
తాను చదివితే సావధానంగా వింటుందనుకునీ రాలేదు.
తరువాత యేమి చేసినా, ముఖ్యాంశం అయినా వినకపోదుగదా అని అతని ఆశ.
రెండు రోజుల కోమాటు యిలాగ వుత్తరం మీద వుత్తరం వస్తే కొంచె మయినా ఆమె వస్తాయించకపోదనిన్నీ అతని నమ్మకం.
"కనక, దారికి తీసుకురాలేకపో"మని అతని దిటవు; కాని ఆమె మొగం చిట్లించుకోడం చూసి, వినకుండానే పైకి వెళ్ళిపోతూాందేమో అన్న ఆత్రంతో "చాలా దూరం రాశాడు. పాపం" అన్నాడు, జాలిగా.
"వారి పాపపుణ్యాల జోలి మనకెందుకూ?" అందామె, ముక్కూ మూతీ తిప్పుకుంటో, అవ్యవధానంగా.
"కాకపోయినా, అంత దూరం కూడాకూడా రావడానికి నాకిప్పుడు తీరికా లేదు, వోపికా లేదు" అనిన్నీ అంది, వెటకారంగా.
అంటూనే అడుగు ముందుకి వేసేసింది.

"నుంచోవ్వూ?"

"………"

"మాట."

"ఏమిటా మాటా?"

ఆలస్యం చేస్తే యీ అవకాశం కాస్తా జారిపోతుందనుకున్నాడతను.

విషయం సూచిస్తే వాదాని కయినా ఆమె సిద్ధపడుతుందనీ, ఆ సందర్భంలో కొంత కాకపోతే కొంత అయినా మనస్సు మార్చవచ్చు ననిన్నీ అనుకున్నాడు.

"అమ్మాయి చదువు మాన్పించమని రాశాడు" అన్నాడు గభీమని.

ఇది వింది, గభీమని వెనక్కి తిరిగి, యెక్కిన ఆ వొక్క మెట్టూ కూడా దిగి, వురిమి చూస్తూ అతని యెదట నుంచుందామె, ముందు.

చెయ్యి జాడించింది. తల తాటించుకుంది. "మానిపించంగాక మానిపించం అని రాసెయ్యండి వెంటనే" అంది తరవాత, వొత్తివొత్తి.

గతుక్కుమనిపోయా డతను.

"అగ్గిపుల్ల గీసి ముందా వుత్తరం అంటించెయ్యండి, వెళ్ళండి" అంటూనున్ను వురిమింది, వీధికేసి దారి చూపిస్తూ.

వెళ్ళవలసినవాడే అతను; కాని స్తబ్దు డయిపోయి వుండడం వల్ల కదల్లేకపోయాడు.

"కొడుకు చచ్చాక గూడా తమ పెత్తనం యేమిటీ – బోడి పెత్తనం" అంటూ రుంజుకుందామె కరుగ్గా చూస్తూ

"సబబే" అనిపించిం దతనికి; కాని ఆ దురుసుతనానికి మాత్రం కించపడ్డాడు.

ఆమెకి ఉక్రోషం తీరలేదు.

"లేనిపోనివి కల్పించి యేమిటేమిటో మీ అమ్మ వుత్తరం రాసి వుంటుంది. ఇందులో ఆవిడ ప్రమేయం కావలసినంత వుంది, నాకు తెలుసు పూర్తిగా."

"ఊళ్ళో వాళ్ళున్నూ నన్నాక్షేపిస్తున్నారు."

"ఎందుకో?"

"…. …. …."

"ఎవరెవరో?"

"…. …. …."

"ఏమనో?"

"చదువు మాన్పించడం యిష్టం లేకపోతే చెప్పడానికి ముసలి పండితు లెవరూ దొరకలేదా–"

"చదువు మాన్పించమని కాదుగదా?"

"వాళ్ళ వుద్దేశం మాన్పించమనే. ముసలి పండితుల ప్రస్తావన మనం చేస్తున్నదానికి సవరణ."

"పనిలేని మంగలి యేమో చేశాడుట."

"వెంకటదీక్షితులుగారి సోమిదేవి కాళ్ళకి జోడు తొడుక్కునీ, నెత్తిమీద గొడుగు వేసుకునీ నన్నే చూసుకో మంటూ మొగరాజులను రాసుకుంటూ కాలేజీకి వెడుతూ వస్తూ వుంటే నోరెత్తలేనివాళ్ళు–"

"అతనికీ చెప్పిచూశారు."

"చూసి?"

"... ... ...వినకపోతే వాళ్ళేం చేస్తారూ?"

"మనమూ అంతే అయితే!"

"అప్పుడూ అంతే చేస్తారు; కాని–"

"కాని యేమిటి మళ్ళీ?"

"మన విషయమై వారు చాలా బెంగ పెట్టుకున్నారు."

"ఎంచేతో?"

"మన వంశం అలాంటిది, మరి?"

"అలాగటండీ?"

".... .... ..."

"మరి, ఆ బెంగ పెట్టుకున్నవారి వంశాలు?"

".... .... ...."

"పోనీ, వంశం వంశం అని మహా గొప్ప చెప్పుకుంటున్నారు కదా మీరు, మీ వంశంలో మొగవాళ్ళెవరయినా చదువు పూర్తికాకుండానూ, ప్రయోజకత్వం లేకుండానూ వున్నారా యిప్పటిదాకా?"

కొరడా దెబ్బలా తగిలిం దతని కీమాట.

కళ్ళు చీకట్లు కమ్మినట్టున్నూ అయింది.

"మీ అక్కలాగ గిల్లి రక్కి–బరికి–యేడ్చి–దొర్లి–తమ పట్టు నెగ్గించుకున్న ఆడబడుచు లెవరయినా వున్నారా మీ వంశంలో యిదివరకీ?" అనిన్నీ అడిగిందామె.

చెయ్యిపెట్టి కడుపు దేవేసిన ట్టయి దతనికి.

దీనికి సాయం "మీ అక్కతో వేగలేకుండా వున్నానోయ్!" అంటూ తరచు తన బావగారు గోలపెడుతూ వుండడం జ్ఞాపకం వచ్చిందతనికి.

తన కొడుక్కి సుందరమ్మ నివ్వ నని భద్రమ్మ పేచీ పెట్టినప్పుడు భోజనం చేస్తూ చేస్తూ లేచి నుంచుని 'నీ కూతుర్ని నా కొడుకు కిస్తావా సరి, లేకపోతే యిదిగో నేనీ అంటచేత్తో రయిలెక్కి కాకినాడ వెళ్లిపోతాను. నా తమ్ముడికి బిడ్డలు లేరనుకుంటాను. నాకు పుట్టిల్లు లేదనుకుంటాను. నాశనమయిపోయిందనుకుంటాను. బుగ్గియిపోయిందనుకుంటాను. నిండేట్లో కొట్టుకుపోయిందనుకుంటాను.' అంటూ తన అక్క చిందులు తొక్కడం కూడా జ్ఞాపకం వచ్చిందతనికి.

నోరెత్తలేకపోయాడు.

అతని స్థితి కనిపెట్టి "మాట్లాడరేం?" అన్న ట్టొకమాటు తల యెగర వేసుకుని మళ్ళీ అందుకుం దామె.

"మీ అమ్మ, అమ్మాయిని కాకినాడ వెళ్ళిపోదాం రమ్మందిట విన్నారా?"

"ఎందుకూ?"

"వెధవ కోడ ళ్ళున్నవాళ్ళు పనిమనుషులనూ వంటలక్కలనూ పెట్టుకోరుట కాదూ?"

నిజానికి వితంతుపుత్రిక లున్నవాళ్ళున్నూ చాలామంది అలా చేస్తూ వుండడం అతనికి తెలుసు.

తన యింటో తన తల్లి పెత్తనమే సాగితే తన కూతురికిన్నీ అలాంటి గతే పట్టివుండుననిన్నీ అతనికి తెలుసు.

కనక, కొంత అతిగా వుండినా—కొంత అయినా భద్రమ్మ తన తల్లి నెదిరించడం బాగానే వుందనుకున్నాడతను.

కాని, అక్కమాట యేమయినా "బావగారిని కూడా తృణీకరించడమేనా?" అంటూ అభిమానం తెచ్చుకున్నాడు.

తన కొడుకు పోయినప్పణ్ణుంచీ తప్పించుకు తిరుగుతున్నాడు గాని; రామబ్రహ్మానికి చిన్నతనం కావడం వల్ల మొన్నటిదాకా ఆయన ప్రాజాపత్యమే యిక్కడ.

తన తల్లికిలాగే తన బావగారికిన్నీ పరమవిధేయుడయి పెరిగా డతను.

సమయం వస్తే తల్లిమాట అయినా తీసేస్తాడుగాని బావగారి మాట అంటే చాలా గౌరవం అతనికి.

ఇది భద్రమ్మకీ తెలుసు.

సూటిగా, తన ఆడబడుచు పెనిమిటినే తాను తూర్పారబడితే కొంతకాకపోతే కొంతఅయినా తన భర్త క్రుద్ధుడవుతాడు.

కనక, మరోదారి తొక్కాలి.

తన అత్తగా రీయెత్తు మీదనే నెగ్గుకువస్తూ వుండడం యీ మధ్యనే గ్రహించిం దామె.

కాగా "రామేశ్వరం ప్రయాణం కూడా తలపెట్టిందన్న మాటేనా మీ అమ్మ?" అంటూ మళ్ళీ అందుకుం దామె, చురుగ్గా చూస్తూ.

పొడిచినట్టయిం దతని కీమాటతో.

"కాకినాడలో యెలాంటి ఆలోచనలు జరుగుతున్నాయో బోధపడుతోందా, కాస్తయినా?"

"... ... ..."

"ఆ యెండుకట్టెని చూసుకుంటూ అయినా మనల్ని బతకనిచ్చేటట్టు లేదన్న మాటే కాదూ?"

"అలా అందా మా అమ్మ?" అనడిగా డతను పక్కకి చూస్తూ.

"ఇలా చూడండి."

"........."

"వినపడిందా?"

"........"

"అమ్మాయి అబద్ధం చెప్పిం దనే మీ నమ్మకం?"

"నువ్వూ మా అమ్మా వేసే యెత్తులు చూస్తే రణకంపరం యెత్తిపోతోంది నాకు."

"ఏమిటీ?"

"... ... ..."

"ఏమన్నారూ?"

"... ... ..."

"నేనూ వేస్తున్నానా యెత్తులు?"

"దీని పేరేమిటీ మరి?"

"ఇది యెత్తుకి పైయెత్తు వెయ్యడం కాదు, మీ మాతృదేవత వుద్దేశాలూ ప్రయత్నాలూ యేలినవారికి విన్నవించుకోడం."

"........."

"ఏం, అమ్మాయిని విడిచిపెట్టేశారేం?"

"........."

"అర్థాయుష్యపు కొంకనక్క మొగుణ్ణి కట్టిపెట్టిన మీకు సందేహం యేమిటి—దానిమీద కూడా వొక తుట్ట పడేసెయ్యండి."

"పోనీ, అమ్మాయి దానికేం బదులు చెప్పిందీ?"

"దాన్నే అడగండి, మధ్య నే నెందుకూ చెప్పడం?"

## 6

కరిన నరకంలో వున్నట్టున్న అతని కిది మంచి అవకాశం అయింది.

వెంటనే బయలుదేరాడు, బుర్ర వంచుకుని.

కూతురి దగ్గిరికి వెడతా డనుకుని పక్కకి వొత్తిగిల్లిం దామె; కాని మేడమెట్ల మీద అడుగు పెట్టా డతను.

"అలా యెక్కడి కండీ?"

"............"

"మిమ్మల్నే!"

"..............."

"నుంచోండి!"

నిజంగా వురిమిం దామె.

నిలిచిపోయా డతను.

"వెనక్కి మళ్ళండి."

"........"

"దిగండి, మెట్లు"

"ఏం?"

"కాఫీవేళ అయింది."

"వోస్, ఇంతేగదా?"

తెల్లబోయిం దామె.

అప్పటికప్పుడే మరో మెట్టెక్కా డతను.

"అయితే, నేనూ వస్తా పదండి."

"అదేమిటి?"

"నా కాళ్ళ దగ్గరికి మాత్రం రాదా యేమిటి, నేను మేడ యెక్కి కూచుంటే కాఫీ?"

"మరి, తయారు చెయ్యడం–"

"మీ అమ్మచేత చేయించుకోండి."

"ఆ!"

"లేకపోతే మీ అమ్మాయిచేత చేయించుకోండి, నాకేం?"

"నువ్వేం చేస్తావ్?"

"ఇదిగో యిదీ."

"అఘోరించినట్టుంది."

"తప్పొతప్పు, నిక్షేపంలా వుంది."

"........"

"వోః! మీ వంశానికి తగ్గట్టుంది"

"చూడూ!"

"నేను చూడనండీ! అధీనం తప్పిన మీ అమ్మాయి వుండగా నాకేం చాకిరీ చేసేదాకా, మీ యింటో?"

గుండెలు దూసుకుపోయా యతనికి.

ముచ్చెమటలున్నూ పోశాయి.

వొణుకున్నూ పట్టుకుంది.

"ఏ–మి–టి–యి–వా–ళ–యి–లా–"

"నేనెలాగా యిక అత్తవారి యింటికి వెళ్ళిపోవలిసిందాన్నే కనక, వెళ్ళడానికి మంచిరోజులు కుదిరేదాకా మా నాన్నారికి నేనే కాఫీ చేసి యిస్తానంటూ–"

"చేతులు కాల్చుకుంటుందో యేమిటో పాపం!"

వల్లమాలిన ఆత్రం స్ఫురించిం దతని యీ మాటలతో.

"మరేమీ పరవాలేదు, కంగారు పడకండి!"

"ఏమన్నావ్?"

"నా కడుపున పుట్టింది కదా, ఆ మాత్రం శిక్షా లేకుండా–"

"వోసి నీ యిల్లు–"

"దాని ప్రాణాలకే వుచ్చు లాగ్గుతోంది మీ అమ్మ, చేతులు కాలడం అంతకంటే యెక్కువ కాదులెండి!"

"ఈ టెలతో పొడిచేస్తున్నావు నువ్వు నన్ను."

"ఏమిటీ?"

"........"

"నేనా?"

తర్జనితో తనని నిర్దేశించుకుంటూ – తల యెగరవేసుకుంటూ ఇలా అడిగింది భద్రమ్మ, కళ్ళు కూడా యెర్రజేసి.

"అవు"ననడానికీ సాహసించలేకపోయాడు, "కా"దని తప్పూ దిద్దుకోలేక పోయాడతను.

పైగా, తోకతొక్కిన ఆ వురగాంగన యెదట నుంచోడం కష్టం అయిపోయిం దతనికి.

మొగం చాటువెయ్యడం వొక్కటే గతి యిక.

మరో మెట్టెక్కాడు, బుర్రవంచుకుని నీరసంగా.

"వెళ్ళకండి" అందామె.

సింహనాదం అన్నట్టుం దతని కిది.

కదల్లేకపోయాడు.

చూశాడు బెదురుతూనే.

"నువ్వు వచ్చేదాకా కదలకుండా నే నిక్కడే వుంటాను, మనం పైని వుంటామని చెప్పయినా రా పాపం, అమ్మాయికి."

"నా కవసరం లేదండీ!"

".....వోట్టి కొయ్య"అన్నా డతను, నిష్ఠురంగా చూస్తూ,

"ధన్యురాలిని. మీ యింటో బతగ్గల నన్నమాటే నేనిక!"

"జాలి అన్నది యే కోశాన అయినా—"

"మీకుంది మహా!"

"ఉందో లేదో—"

"ఉంటే మీ అమ్మాయి వున్నచోటికే వెడతారు మీరు, దానికి తిప్పట యెందుకు తెచ్చిపెడతారూ?"

"అయితే పద."

ఇలా అంటూ కిందికి బయలుదేరా డతను.

"వస్తాను పదండి" అంటూ మీదికి బయలుదేరిం దామె.

"ఓహోయ్! నువ్వు రావా యేమిటి?"

"నేను వో—ట్టి కొయ్యనుగా?"

"నా మాట విను."

"........"

"పదిమాట్లు చెప్పించుకోక దిగి రా."

చూసి చూసి "పడమటింటి వసారాలో వుంది మీ అమ్మాయి, నేను పొందామ తీసుకువస్తాను, మీరు నడుస్తూ వుండండి."

ఇలా అంది, గబగబా నాలుగు మెట్లెక్కేసిం దామె.

**7**

అతను కూతురి దగ్గిరికే వెడతా డనుకుంది గాని; మరో మెట్టెక్కాటప్పటికి తన పైటకొంగు దిగజారుతున్న ట్టయిం దామెకి.

చూసుకోగా, అది పట్టుకుని పైకే వస్తున్నా డతను, కొంటెచూపులు చూసుకుంటూ.

"మీరెందుకూ పైకి?" అంటూ కస్సుమం దామె, చకిత అయీ, నిలిచిపోయీని.

అప్పటికప్పుడే ఆమె వున్న మెట్టుమీదికి వెళ్ళాడతను.

మరి కొంటెచూపులు చూస్తూ ఎడమచెయ్యి ఆమె నడుముకున్నా చుట్టవేశాడు.

విడిపించుకోవా లంటే ఆమెకి సాధ్యం కాలేదు.

కాళ్ళు కిందిమెట్టుమీదికీ పైమెట్టుమీదికీ రాకపోకలు చేస్తున్నా, ఆ పెనుగులాటలో, బుగ్గాబుగ్గా అనుకునేటంతగా హత్తుకుపోయారు వారు.

"ఊహూ!....వల్లకాదు....నేనొప్పుకోనండీ....వదలండి....వినండి.....అబ్బ, మెట్లమీద కట్ట కట్టుకుని.....ఏమోనండీ....అమ్మాయీ!"

జంకిపోయా డతను, దీంతో.

దాని కదే చెయ్యి సడలిపోయింది.

"తెలిసిందా? ఇక వెళ్ళండి" అందామె, తల యెగరవేసుకుంటూ.

"పన్నెండేళ్ళ బాలాకుమారిలాగ నువ్వు ముద్దొస్తూ వుంటే–"

"అలాగేం? అయితే యిరవై యేళ్ళనుంచి కాపరం చేస్తున్న మనమే–"

"ఇరవై యేళ్ళేమిటి, ముప్ఫయేళ్లు మాత్రం యేమిటి మొగుడికీ పెళ్ళానికీ–"

"మరి మొగుడు లేనివాళ్ళమాట?"

తెల్లపోయా డతను.

"బదులు చెప్పరేం?"

"మాట రాదేం?"

"మేడమీద చెబుతా."

"వస్తాను కిందికి పదండి, చెబుదురుగాని."

"బంగార బ్బొమ్మవు కాదూ?"

గడ్డం పట్టుకున్నా డత నాశగా; కాని అతని చెయ్యి విసిరేసిం దామె, దురుసుగా.

"నాన్నారండీ!" అంటూ పిలుపు వినవచ్చిం దీస్థితిలో.

"అదిగో, పలకరేం?"

మొదట తెల్లబోయాడు; కాని యింకో పిలుపు వస్తే అప్పుడు చూసుకుందా మనుకున్నా డంతలో.

"పోనీ, నువ్వెక్క డున్నావే అమ్మా?" అంటూ మరో పిలుపు వచ్చింది.

"ఏం, నీపని కూడా అయిందా?"

ఇలా అంటున్నట్టు పెదవులు బిగించుకుని తల యెగరవేసుకున్నా డతను.

"............"

"మరి నువ్వయినా మాట్లాడవేం?" అంటూ ముదలకించా డతను.

కథ యిలా అడ్డం తిరిగడం చూసి, గిరుక్కున మళ్ళీ కిందికి బయలుదేరిం దామె, దేనికీ బదులు చెప్పకుండా.

"మేడమీద పని వుందన్నావు, మరి?"

అప్పటి కప్పుడే మెట్ల పక్కని వున్న ద్వారం దాటి హాల్లో అడుగు పెట్టిందామె.

"ఒక్కపూట తాంబూలం ఆలస్యం అయితే యేమీ మిగిలిపోదు" అంటూ ముందుకిన్నీ వెళ్ళిపోయిం దాబిగిని.

"నాకూ దిగడిపోదు" అంటూ అతనూ బయలుదేరాడామె వెనకనే.

# 8

జంకుతూనే వచ్చాడు కృష్ణశాస్త్రి, ముసలమ్మని తలుచుకుంటూ

అందుకు తగ్గట్టు హాల్లోనే సాక్షాత్కరించిం దామె.

ఇక్కడికి నాలుగు దినాలనుంచి ప్రయత్నం, గిల్లికజ్జా పెంచాలని ఆమె.

అతనే తప్పించుకు తిరుగుతున్నాడు, మెళుకువగా.

దినాలు గడిచిన కొద్దీ ఆ పట్టుదల యెక్కువయిపోతోందామెకి.

అతని రూపూ రేఖా చూడనక్కరలేదు, తలుచుకుంటేనే రోషం వస్తోందామెకి

నిద్రాహారాలు తప్పిపోతున్నాయి.

శాస్త్రి కిది తెలుసు.

అతనికీ యెక్కువవుతోంది పట్టుదల.

అయితే, అసలే కార్యవాది అతను.

నలుగురితోనూ మంచిగా వుండి నాలుగు డబ్బులు సంపాదించుకోవాలన్న దీక్షతో వున్నా డతను.

లేకపోతేనా అతనే కజ్జా పెట్టుకుని వుండును, మొదట.

పైగా,—సుందరి తెలివితేటలు చకితుణ్ణి చేస్తున్నాయి.

ఆమె చూపులు మధురభావనలు రేపెడుతున్నాయి.

భద్రమ్మ కనపరుస్తూ వున్న గౌరవాదరాలు ఆశాజనకాలుగా వున్నాయి.

అంచేత కూడా చాలా వోరిమి చూపిస్తున్నా డతను.

"ఇది నిర్లక్ష్యమా, చేతకానితనమా?" అని వెంకుసోదెమ్మ జిజ్ఞాస.

ఏమయినా ఫలితం వొకటే—సహించలేకపోతోం దామె.

మరేమిటీ చెయ్యడం?

తాను పరమ విధేయు డనుకుంటున్న తన కొడుకు తనకిలాగే భద్రమ్మకిన్నీ పరమ విధేయుడే, స్పష్టం అయిపోయిం దిప్పుడామెకి.

నిన్నటిదాకా కుక్కిన పేనయి వుండిన కోడలు కొరకరాని కొయ్య అయిపోయింది, క్షణంలో.

పోనీ అంటే,–మనమరాలు–తన దౌహిత్రుని పెళ్ళాం–తన కూతురి కోడలు తను బతికివున్నట్టే చూడ్డం లేదు.

సాటి ముసలమ్మలున్నూ "ఇదేం పోయేకాలమే" అంటూ వుండేవారు నిన్నటిదాకా; కాని యిప్పుడు "కాలం యిలా మండిపోతోంది. మనం బతికి వుండినా చచ్చినవాళ్ళలోనే జమ. నీ పెత్తనం సాగనప్పుడు, పువ్వు లమ్మిన వూళ్ళో కట్టె లమ్మడం యెందుకూ? కాకపోయినా, చెవులారా వింటూ, కళ్ళారా చూస్తూ యిలా కుమిలిపోవడం కంటే యేమాత్రమో పిల్లిపిల్లని జాగ్రత్త చేసుకునే వున్నావు కదా – నెత్తిమీద కూడా పెట్టుకుంటుంది గదా నీ కూతురు. పోనీ, కాకినాడే వెళ్ళిపోతే యేం?" అంటూ నరాలు కుంగదీసేస్తున్నారు.

నిజమే; కాని "అధీనం తప్పినవాళ్ళకి దేవుడు రాసి పెట్టిన సైనుపంచెలు కాకపోతే మానె, సుందరమ్మచేత చివరికి గ్లాస్కో మల్లు పంచెలయినా కట్టించి మరీ వెడదా" మని చూస్తోందామె.

అందుకోసం క్షణాలు లెక్క పెడుతూ ముళ్ళమీద వుంటోంది.

ఆలోచనమీద ఆలోచన చేస్తోంది.

ఎత్తుమీద ఎత్తువేస్తోంది.

కుట్రమీద కుట్ర పన్నుతోంది.

"మాలకూడు" బలిసిపోతున్న వోపికపట్టుకునిన్నీ వస్తోంది.

అయితే, తా ననుకున్న పని జరగాలంటే ముందు కృష్ణశాస్త్రికి వుద్వాసన చెప్పాలి.

వొట్టి వుద్వాసన చెబితే చాలదు, ప్రాయశ్చిత్తం కూడా చెయ్యాలి.

గుమ్మమే యెక్కనివ్వకుండా వీధిలోవాణ్ణి వీధిలోనుంచే పంపెయ్యాలి.

ఎప్పటికయినా తానే చెయ్యాలికూడా ఆ పని.

సుఖసుఖాల అయేపని కాదు.

కోడలిందు కడ్డుపడుతుంది.

మనమరా లెదురుకుంటుంది.

ఇక కొడుకా "వాజమ్మ!" రగడ ప్రారంభం అయితే యింటోనే వుండలే డావేళకి!!

అయితే, తన కిది సాధ్యమేనా?

పరకాయించుకుందామె.

సాధించా లనుకుంది.

"సాధించి తీరా"లనుకుంది.

మరి దారి?

ఆలోచించసాగింది.

ఆలోచిస్తూ, హాల్లో, కవాచీబల్లమీద కూచునివుం దామె, యీ చూపుతో.

# 9

సరిగా యిలాంటి సమయాన వచ్చాడు కృష్ణశాస్త్రి.

ముసలమ్మ యేడుస్తున్నందుకన్నట్టు పట్టంచుల పంచె కట్టుకునే వున్నా డతను.

పట్టు షర్టే తొడుక్కునీ వున్నాడు.

నోట తమలం వుంది.

బట్టలు ఘమఘమలాడుతున్నాయి.

మెడలో, సేలం పట్టుకండువా మడత తావళంవతుగా మిలమిల్లాడుతోంది.

అతని వర్చస్సు చకచ్చకితం అవుతోంది ఆ వేషంతో.

ముసలమ్మకి కళ్ళు కుట్టాయి, ఆ రూపం చూడగా.

తుమ్మల్లో పొద్దుగూకిన ట్టయిపోయిం దామె మొగం, దాంతో.

అది గుర్తించా డతను.

"ఏదో తలుచుకుంది మళ్ళీ" అనిన్నీ పసికట్టాడు; కాని నిశ్చలంగా గుమ్మం యెక్కాడు, మొగం వంచుకుని.

ముసలమ్మ అనుకోని సన్నివేశం అది.

అతను నిర్లక్ష్యంగా వస్తాడనుకుం దామె.

విర్రవీగుతూ దురుసుగానున్నా వస్తాడనుకుంది.

అందుకు తగ్గ ధోరణి వ్యూహించుకునిన్నీ వుంది, సిద్ధంగా.

కాని, యిది చూసి నిర్విణ్ణ అయింది.

పోనీ అంటే యిదీ ఆగ్రహకారణమే అయిం దామెకి.

"ఇక మెత్తమెత్తగా చెబితే లాభం లే"దనుకుంది.

అయితే, మొగం వంచుకుని వున్నాడే కాని తనున్నూ పట్టుదలగానే వున్నాడు.

"మన కీ అడ్డేమి" టనుకున్నా డతను.

"రామబ్రహ్మంగా రుండగా యీావిడ యెవరు రమ్మనడానికయినా పొమ్మనడాని కయినా?" అనుకున్నాడు.

అగత్యం అయితే "నీ లెక్కేమిటి?" అనడిగెయ్యా లని గట్టిగా నిశ్చయించుకున్నాడు.

దానా దీనా యిద్దరి మనస్సులూ గుబగుబలాడిపోయాయి.

ఇద్దరి చూపులూ నిశితా లయిపోయాయి.

ఇద్దరికీ ఆవేశం హెచ్చిపోయింది.

ఇద్దరి కాళ్ళలోనూ మెరుపువేగం అంకితం అయింది.

వెంటనే, అడ్డంగా నుంచుని అతను హాల్లో అడుగు పెట్టకుండా చేదామని గభీమని గుమ్మంలో కొక్కగంతు వేసిందామె, ఇటు చూస్తూ.

ఆమె నేడిపిద్దా మని అంతకంటే పెద్ద అంగవేసి గుమ్మం దాటేశాడంతకి ముందే అతను, అటు చూస్తూ.

కాని చిన్నతనం.

ప్రతిభ వుందేకాని, అనుభవం చాలదు.

కాగా "ఇంకేం చేస్తా"వన్నట్టు డెకారిస్తూ చూశాడతను, రీవిగా నుంచుని.

"ఇలా వచ్చావా?" అనుకుందామె.

"తొందరపడకోయ్!" అనిన్నీ అనుకుంది.

మెరు పయిపోయింది, నిజంగా.

వెళ్ళి, మండువా హాల్లో మున్న ద్వారాని కడ్డంగా నుంచుంది, మరో అంగలో వెళ్ళి.

"ఇం కేం చేస్తా" వన్నట్టున్నూ చూసింది, కనుబొమ్మ లెగర వేసుకుంటూ.

అప్పటికి తెలిసింది కృష్ణశాస్త్రికి, విజయం తనది కాదని.

"అరే!" అనుకున్నాడు, నాలుక కరుచుకుంటూ.

ఆ బిగిని బిగిని తానా గుమ్మం దాటెయ్య నందు కెంతో పిసుక్కున్నాడు.

"ఏమిటీ దారి?" అంటూ ఆలోచన ప్రారంభించాడు చివరకి.

అప్పటి కప్పుడే పతకం మార్చి మెల్లిగా అందుకుంది ముసలమ్మ అమాయికత్వం నటిస్తూ.

"ఆడపిల్లలకే గాని మొగపిల్లలకు చదువు చెప్పలేవా యేమిటబ్బాయీ నువ్వు?"

"ఏం, చెప్పలేకేం?"

"............"

"దానికీ దీనికీ భేదం యేమిటీ?"

"ఏమో, చదువంటే యేమిటో నాకేం తెలుసునా, యేడుసునా?"

"అది నిజమే, మరి అలా అడిగారేం?"

"తెలుసుకుందామని."

"మీరు ఆడవాళ్ళకీ మొగవాళ్ళకీ గూడా వండి వడ్డించగలరు, కదూ?"

"అయితే?"

"అలాంటిదే యిదీని."

"ఊఁహూ."

"డబ్బెవరిస్తే వారికందరికీ చెబుతాను నేను."

"అలాగా?"

"చదువు కావలసినవాళ్ళుకూడా ఇలాంటి భేదం చేసుకోరెవరూ."

"............"

"యాభైయ్యేళ్ళ యిల్లాలు, డాక్టరు పేరిశాస్త్రిగారి కూతురు జగదాంబగారు సవ్యాఖ్యానంగా రామాయణం చదువుకుంటున్నారు నా దగ్గిర."

"ఆ!"

"మీ యింటి వెనకనే వున్న తారకావధానులుగారి కూతురికి మనుచరిత్ర పాఠం చెబుతున్నానిప్పుడు, తెలుసా?"

"ఏమో, మా కాలంలో యెవరూ యెరుగరులే యిలాంటివి."

"ఈ కాలంలో యెరగనివారు లేరులెండిలాంటివి."

ఇది యెద్దేవా అని గుర్తించేసిందామె.

తానూ దండకం విడేద్దా మనిన్నీ నిశ్చయించుకుంది.

"ఎక్కణ్ణుంచీ అందుకోడం?" అని మాత్రం చూసుకుంటోంది.

మాట కూడా నాలుక చివరికి తెచ్చుకుంది కాని; ఉండుండి "చదువుకోక పోయినా, మీకాలపు ఆడవాళ్ళలో కూడా చదువుల విలవలు తెలిసినవారు చాలా మందే వున్నారండీ, అమ్మమ్మగారూ!" అన్నాడతను కొంటెగా చూస్తూ.

ఇక్కడ మీట నొక్కితే దీపం వెలిగి, అక్కడ గప్పుమంటుంది బల్బు.

అతనీమాట అన్నాడు మెల్లిగా, ఆమెకి కోపం వచ్చేసింది, చర్రున.

అగ్గిమీది గుగ్గిలమున్నా అయిపోయి "చాల్లే నేర్చుకుపోయావ్; నేనమ్మమ్మనా నీకు?" అంటూ కస్సుమంది, వెంటనే.

గతుక్కుమన్నాడు కృష్ణశాస్త్రి; కాని సంగతి అతని కర్థం అయిపోయింది.

బుద్ధి చమత్కృతమున్నా అయింది.

"ఎందుక వుతారూ?" అని యెదురడిగాడు, ముంగోపమున్నా నటిస్తూ.

"మరెందుకు పిలిచావలాగ?"

"మా అమ్మమ్మ వయస్సులో వున్నారు మీరు, దినమ్మా యింటో ఆవిణ్ణే పిలిచే అలవాటుండి, అలా వచ్చేసింది, మాట."

"పోనీ, నాయనమ్మా అనలేవ్వూ?"

"అలా మాత్రం యెందుకనాలీ?"

"ఎందు కనాలా?"

"అవు నెందు కనాలీ? మా నాయనగారిని మాత్రం కనిపెంచేశారా యేమిటి మీరు, మహా?"

"............"

"మా నాయనమ్మ యజ్ఞం చేసింది. ఎన్నోమాట్లు వాల్మీకి రామాయణం పురాణం చెప్పింది. కాశీ వెళ్ళింది. ఒక్క బ్రాహ్మడి కయినా హస్తోదకం యివ్వకుండా పచ్చి మంచినీళ్ళయినా పుచ్చుకునిన్నీ యెరగ దెన్నడూ, తెలుసా?"

"అసలు, నన్ను వరసపెట్టి యెందుకూ పిలవడం?"

"వరసపెట్టకుండా మాత్రం మిమ్మల్ని పిలవ్వవలసిన అగత్యం యేమిటీ నాకు?"

"మరెందుకు పిలిచావ్?"

"మీరెందుకు పిలిచారూ మొదట నన్ను?"

"అబ్బాయీ అన్నాను, తప్పా?"

"అందుకే అమ్మమ్మగారూ అన్నాను, తెలుసా?"

తెల్లపోయిందామె.

మిడుతూ మిడుతూ చూస్తూ వుండిపోయింది, అయ్యో అయ్యో అంటున్నట్టు బోసినో రప్పలించుకుంటూ.

ఈ సందుబాట్లో, ఆమెని తప్పించుకుని మండువాలోకి చూడ్డానికి కొంచెం పక్కగా జరిగాడతను, ముందు.

సుందరీ అంటూ గట్టిగా పిలిచాడు, మోర యెత్తుకుని తరవాత.

ఆ పిలుపులో చనువూ, అంతకంటే యెక్కువగా ప్రేమా మరేమిటో కూడా ధ్వనించా యామెకి.

దిక్కుమొగం వేసుకుని కిష్టప్ప యెదురుగా మంచున్నట్టయిందామెకి, దీంతో.
అభిమానమూ, రోషమూ, క్రోధమూ గుంజేశా యామెని.
"అమ్మాయిగారూ!" అంటూ రుంజుకుంది, దాంతో. బదులు చెప్పలేదతను.
అటయినా చూడలేదు.
"మాట్లాడవేం?" అందామె, వొణికిపోతూ.
"
"విన్నే – వినపడదూ?"
"........"
"చెవులు కొరికేశారా భాములు?"
తుళ్ళిపడ్డాడామాట మీద అతను.
అరికాలి మంట నెత్తికి వచ్చింది.
కాని, అంత రోషంలోనూ కూడా బుద్ధి చమత్కృతం అయింది.
దానికి సాయం కొంటెతనమున్నూ వచ్చింది.
"సుందరీ!" అంటూ మళ్ళీ పిలిచాడు వెంటనే, అంతకంటే ప్రేమ స్ఫురింప చేస్తూ.
గుండెల్లో పొడిచిన ట్టయిం దామెకి, దాంతో.
"అంతకంటే నోరు తిరగదూ నీకూ?"
"........"
"ఎక్కడ నేర్చుకువచ్చా వీపిలుపు?"
"........."
"నాలుకా తాటిపట్టా నీది?"
మాట పడలేక అతనూ, బదులు మాటలేక ఆమే కూడా అగ్గయిపోయారప్పటికి.
అతను నిప్పులు కక్కుతూ చూడగా, గభీ మని లోపలికి వెళ్ళి ఫెడీమని తలుపులు బిగించేసుకుం దామె. ధుమధుమలాడుకుంటూ.

# 10

ఏమిటీ చెయ్యడం?
లోపలికి వెళ్ళడానికి వీలు లేకపోవడమే కాదు, పిలుపయినా అందదు.
"వెళ్ళిపోదామా?" అనుకున్నా డతను, మొదట; కాని, "ఛా, అదేం పని?" అనిపించి దరతలో.
"ఇదివరలో అలా చెయ్యడమే తప్పయిపోయింది" అనుకున్నాడు. చూసిచూసి.
"ఏమయినా–యిదేమిటో తేల్చుకోవా"లనిన్నీ నిశ్చయించుకున్నాడు.
"ముసలిదాని కంటో కారం చల్లితీరా లివాళ" అనిన్నీ నిరుకుచేసుకున్నాడు.
అందుకుపాయం ఆలోచించుకుంటూ తలుపు దగ్గిరికి వెళ్ళాడు.
సందుల్లోంచి చూడగా, పడమటింటిలో నుంచి మండువా హోల్లోకి వస్తోంది భద్రమ్మ, యెందుకో.

వెంటనే తలుపు కొట్టా డతను, మాట్లాడకుండా.

మళ్ళీ కొడదా మనుకుంటూ వుండగా తలుపు తెరుచుకుంది.

"మీరా?" అనడిగింది, భద్రమ్మ.

"నేనేనండి!" అన్నాడు కృష్ణశాస్త్రి, వెనక్కి తగ్గి.

"ఎంతసే పయింది వచ్చి?"

"పావుగంట అయింది."

"పిలిచారా?"

"రెండుమాట్లు—"

"మీరు వచ్చాటప్పటికే తలుపు వేసివుందా?"

"లేదండి, నేను వచ్చాక గూడా చాలాసేపు తెరిచే వుంది."

"మొగం మాడిపోయిన ట్టుంది, ఏమయినా అందా మిమ్మల్ని?" అనడిగిందామె యివతలికి వచ్చి, కంఠం నొక్కుకుని.

కాని, కృష్ణశాస్త్రి మాత్రం గట్టిగానే అన్నాడు – "అంటే మాత్రం యేమిటిలెండి, మీరేమీ పట్టించుకోనక్కరలేదు" అని.

"అస లెందు కనాలి?"

"............"

"నా వాకట్లోకి మనిషి రావడం భయం, ఇక కళ్ళల్లో నిప్పులు పోసుకోడమే!"

"............"

"ఎన్నేళ్ళు వస్తే యేమిటి, సిగ్గూ బిడియమూ లేకపోయాక?"

"..........."

"పగ వున్నచోట అంటే ప్రేమ వున్నచోట తగులుతుంది, తెలుసుకోగలిగితే."

చాలా గట్టిగా–ఝూంకారంగా అం దీమాటలు మండువాలోకి చూస్తూ భద్రమ్మ.

దీనిమీద రగడ పెరుగుతుం దనుకున్నాడు కృష్ణశాస్త్రి.

రగడకు బదులు సుందరి వచ్చింది పడమటింటో నుంచి – "ఏమిటే అమ్మా, అదీ?" అనడుగుతూ.

"ఏముందీ చెప్పడానికీ? మామూలు రోకటి పాటే. అయితే, కాఫీ యేమయినా మిగిల్చావా, అంతా—"

"ఉన్నదంతా అలాగే వుంది, నేనింకా పుచ్చుకోనే లేదు."

"అయితే, శాస్త్రులుగారికి–లోపలికి రండి నాయినా!"

"..........."

"జరిగింది మరిచిపోండి, ఏల్నాటిశని మమ్మల్నింకా విడిచి పెట్టలేదు అంతవరకూ మాతోపాటు మీకూ తప్పవు తిప్పలు."

"తిప్పల కేం గానీ–కృష్ణవేణమ్మగారి యింటో నేను కాఫీ పుచ్చుకునే—"

"మా యింటో కూడా పుచ్చుకుంటే గాని వీల్లేదు."

"నా మాట—"

"నన్ను చంపుకుతిన్నట్టే పుచ్చుకోకపోతే, పదండి. పీట వెయ్యి తల్లీ! ఎందుకూ, కాఫీ లయినాక మా వాళ్ళ యింటికి వెళ్ళి దీనికి విరుగుడు చూసి రానూ, నిమిషంలో?"

మాట్లాడకుండా ముందు సుందరీ కృష్ణశాస్త్రి పడమటింటోకి బయలుదేరారు.
తన గదిలోనుంచి తొంగిచూస్తూ ముసలావిడా, గబగబా పడమటింటోకి వెడుతూ భద్రమ్మా కొరకొర చూసుకున్నారు, తరవాత.

## 11

మర్నాటి మధ్యాహ్నం రెండు గంటలవేళ కింది పడకగదిలోంచి వస్తూ రామబ్రహ్మమూ, అగదిలోకే వెడుతూ భద్రమ్మా గుమ్మంలో తారసిల్లారు.

"ఎక్కడికో ప్రయాణం కామోసు!" అంది భద్రమ్మ.

"అవును."

"మళ్ళీ గదిలోకి పదం డొకమాటు, తరవాత యెలాగా బయటికి వెళ్లాలి."

"ఒక్కమాటేం పదిమాట్లు వస్తాను, పనేమిటీ?"

"ఇనప్పెట్టి తాళం తియ్యాలి."

ఉలిక్కిపడ్డా డతను.

అప్పుడే తాళం వేసి వస్తున్నాడు.

ఉన్నడబ్బు లెక్కపెట్టుకుని, బడ్జెట్టున్నూ నిర్ధారణ చేసుకుని యివతలికి వస్తున్నాడు.

మిగులే కనపడ్డందు కుత్సాహంగానూ వున్నాడు గాని; మళ్ళీ తాళం తియ్యడం వచ్చాటప్పటికి తెల్లపోయాడు.

"చూస్తా రేం, పదండి" అందామె.

"ఎందు కేమిటీ?"

"డబ్బు కావాలి."

"ఏం చేస్తావ్?"

"అమ్మాయికి బట్టలు కొనాలి."

గుండెదడ తగ్గింది.

యాభై అరవై కంటే యెక్కువ తీసుకో దనుకున్నాడు కాని; యెందుకయినా మంచి దని "యేమాత్రం కావాలేమిటి?" అనడిగాడు.

"కావాలి."

"ఏమాత్రం–"

"పెట్టి తియ్యండి, మీరు మిగిల్చిందెంతో చూడాలి, ముందు."

"........."

"తెల్లపోయి నుంచుంటేకాదు"

"........."

"అమ్మాయిచేత మల్లుపంచెలు కట్టిద్దా మని చూస్తోంది మీ అమ్మ, సాగనివ్వను నేను."

"........."

"ఇప్పటిదాకా వుప్పాడచీరలతో సరిపెడుతున్నాను, ఇక దక్షిణాది చీరలు కొంటాను, తెలిసిందా?"

"శోకం—"

"కుళ్ళి కంపెత్తిపోతుంది, అంతేనా?"

ఆమె దీక్ష అసాధారణం అని గుర్తించుకున్నా డతను.

"దీని కంతకీ కారణం ముసలావిడ" అనుకున్నాడు.

"ఆమె యేటి కీడుస్తూ వుండడం వల్లనే యీామె కోటి కీడుస్తోం"దని నిశ్చయించుకున్నాడు.

తనకి మాత్రం ప్రాజాపత్యం కనపడలే దతని కింటో.

ఇద్దరికీ తానే లోకువ.

పోనీ అంటే, ఆ యిద్దరికీ జవాబు చెప్పవలసిన బాధ్యత మాత్రం తనది.

కష్టం తోచింది.

అభిమానమున్నూ వచ్చింది

కాని స్వతంత్రిద్దా మంటే సంసారభారం అంతా మీదవేసుకోవాలి, మరి.

క్లబ్బుకి వెళ్ళడం మానుకోవాలి, తరుచు.

నిజమే కాని; "ఆపని చేస్తే యిక జీవితంలో యేం వుందీ?" అనిపించింది.

చూసి వూరుకున్నాడు చివరికి.

"పదండి" అందామె, చురుగ్గా చూస్తూ.

"........."

"తొరగా తెమల్చాలండీ!"

"మరోమాటు—"

"వల్లకాదు."

"నా మాట విను."

"తాళం తీస్తారా తియ్యరా?"

"వారం రోజుల్లో నేను చెన్నపట్నం—"

"వల్లకాదు."

"ఏమిటి వల్లకానిది" అనిపించిం దతనికి.

దేశదేశాలనుంచీ ఖండఖండాలనుంచీ టెన్నిస్ ఆటగాళ్ళు వస్తున్నారు వాళ్ళని చూడకపోతే జన్మయెందుకూ?

తన ఆట కూడా వాళ్ళకి చూపించా లెలాగో వొకలాగు లేకపోతే—

వొణికిపోయా డతను.

"నడవండి, నడవండి. ఇవాళ అమ్మాయికి కొత్తబట్టలు కట్టబెట్టి తీరాలి. నాలుగ్గంటలవేళ కట్టుకోడానికి ముహూర్తం స్థిరపరిచి వెళ్ళారు వెంకటావధానులు గారు, తెమలాలి."

"........."

"అమ్మాయీ నేనూ బజారుకు వెళ్ళి రావడానికీ జట్కా కూడా తీసుకురావాలి మీరు, చూస్తే కాదు—"

ఇలా అంటూ రెండు జబ్బలూ పట్టుకుని ఇటున్నవాణ్ణి అటు తిప్పిందామె, ముందు.

ఎడమచేత్తో పాదివి పట్టుకుని రెండడుగులున్నూ వేయించింది, తరవాత.

విధిలేక బయలుదేరా డతను; కాని పెట్టెదగ్గిరికి వెళ్ళాక మళ్ళీ స్థాణువులాగ నిలిచిపోయాడు, నీరసంగా చూస్తూ.

"కానివ్వండి" అందామె, పెట్టె చూపిస్తూ.

"కానివ్వడాని కభ్యంతరం లేదు. అయితే, అయిదువందల పై చిలుకే వుంది, ప్రస్తుతం."

"చాలు, అరోధి."

"చాలు నంటే మరి నా మాట?"

"అంటే?"

"ఇప్పటి కొక్క వంద పుచ్చుకో!"

"చాలదు."

"సద్దుకో, పదకొండు వందలు చెరుకుతోట శిస్తూ, పదిహేను వందలు మిరపతోట శిస్తూ, రెండువేలు మామిడితోట శిస్తూ మళ్ళీ వారం—"

"వారం కాదు, వొక్క దినం—వొక్క పూట—వొక్క గంట కూడా ఆగడానికి వీల్లేదు, నా కిప్పుడే కావాలి, పూర్తిగా."

"ఎందుకు చెప్పానో—"

"నేనెందుకు చెబుతున్నానో—"

"నా మాట బొత్తిగా కొట్టెయ్యకు. నాకూ బాధ్యత వుంది యే కొంచెమో—"

"ఈ వుపోద్ఘాతం అంతా యేమిటండీ?"

"నాకూ కావాలి డబ్బిప్పుడు."

"ఎందుకో?"

"రహస్యమా?"

'మీ అమ్మని కాశీ పంపుతారా?"

'టెన్నిస్ బాటు కొంటారా, వున్నవి రెండూ చాలక?"

"సమాజం వాళ్ళకి టీపార్టీ—"

"అబ్బ, చెప్పేదాకా చంపుతావు నువ్వు."

"మొదటే మీరు చెప్పేస్తే—"

"మూడువందల యాభై రూపాయ లిమ్మని కొడుకుని పంపించింది మా అక్క."

"ఓహో!"

"అందుకా దీక్షితులు రాక?"

"     "

"నాకు తెలియకుండా–"

"చేబదు లివ్వడానికి భయ మెందుకూ?"

"చేబదు లంటే పద్దూ నోటూ అక్కర్లేకుండా వారం పది దినాల్లో మళ్ళీ యిచ్చేసి బాకీ కంటారు."

"అవును. నాలుగు దినాల్లోనే పంపేస్తుందిట, మా అక్క."

"ఆ నాలుగు రోజులూ అరువు దొరకదటనా?"

"..........."

"నెలకి రెండువేలు సంపాదించే కాకినాడ ప్లీడరుగారి యజమానురాలికి రాజమహేంద్రవరంలో – మీ దగ్గిర తప్ప చేబదులు పుట్టదా?"

"ఏమన్నా రింతకూ మీరు?"

"సరే అన్నాను."

"అంటారు మీరు, సందేహమా?"

"..........."

"మెడలు వంచి మీ అమ్మ అనిపిస్తుంది, నాకు తెలుసు."

"..........."

"మొన్నటి దాకా కొంప దోచారు, చాల దటనా?"

"..........."

"నాలుగు మాసాల కిందట వెయ్యిరూపాయిలు చేబదులు తేలేకపోయారు మీరు వారి దగ్గిరనుంచి–"

"ఏమయితేం, యిప్పటికి–"

"పనికిరా దండీ!"

చూసిచూసి, తన అసమ్మతి నిట్టూర్పు రూపంగా ఉద్ఘాటించి, పెట్టె తెరిచి పక్కగా నుంచున్నా డతను.

తివాసీ పెట్టె దగ్గిరికి లాక్కుని కూచుంది, భద్రమ్మ.

సొరుగు లాగింది.

వందది వొకటి, కొన్ని పదులు, కొన్ని అయిదులూగావున్న నోట్లకట్ట అందుకుంది.

"ఈ రెండు వందలూ అమ్మాయి బట్టలకు. ఈ నలభయ్యీ శాస్త్రులు గారికి రెణ్ణెల్ల జీతం. అమ్మాయి పరీక్షలో నెగ్గింది కనక, ఈ నూటపదహారూ ఆయనకు బహూమానం, ఈ పాతికా నాదగ్గిర వుండాలి, చిల్లర ఖర్చులకు. ఈ నూరూ, ఎందుకయినా అవసరం కావచ్చు, అమ్మాయి దగ్గిర వుంటాయి. ఈ పాతికా శాస్త్రులుగారికి జామారు–"

"........."

"మిగిలినవి–"

"ఇక డెబ్బయి మిగిల్చావు!"

"మరి సంసారమో? నేతి మనిషీ నూనె మనిషీ గోల పెట్టేస్తున్నారు. పాలవాడు కాళ్ళావేళ్ళా పడుతున్నాడు, యాభైరూపాయలు అడ్వాన్సు కావాలంటూ. కాఫీగింజలు తేవాలి. పంచదార చిటికె డయినా లేదు పొద్దుటకి–"

"కిరాణాకొట్టు మనిషిని రేపు పొద్దుట రమ్మన్నావు కదా మరి?"
"మీరు మరో రోజున రమ్మనండి, మించిపోయిం దేముందీ?"
"మర్యాద అక్కర్లేదు."
"కావాలి కనకనే మరోనా డివ్వడం!"
"కాస్త భాగ్యానికి రెండుమాట్లు తిప్పడం—"
"మీ అక్కకి తప్ప మరెవరి కిచ్చారండీ, అడిగిన వెంటనే మీరు?"
". "
"మీ అక్కకి సమర్పించుకోడంకోసం అమ్మాయికి లేదన్నారు మీరు, మళ్ళీ రమ్మనడం అలాంటిది కాదుగా?"

"అలా చూస్తూ నుంచుంటే కాదు, తాళం వేసెయ్యండి."
"ఇక తాళం వేసినా వొకటే, వెయ్యకపోయినా వొకటే!"
"అలా చేశారు మీరు."
"అదేమిటి?"
"మొన్న మీ పెద్ద మేనల్లుడు వచ్చాడు, అత నెంత పట్టుకు వెళ్ళాడో?"
"ఆ, ఆ."
"లేవండి లేవండి, మేము బయలుదేరాటప్పటికి జట్కా తీసుకు రావాలి మీరు."
"......."
"అలా నుంచుంటే ముహూర్తం దాటిపోతుంది, కదలండి."

"నేనూ అమ్మాయీ బజారు నుంచి వచ్చేదాకా మీరింటో వుండాలి సుమండీ, తరువాతే క్లబ్బుకి వెళ్ళడం."

## 12

కొట్టేసిన పాములాగ పడకకుర్చీలో వాలి వున్నాడు రామబ్రహ్మం, కింది పడకగది వసారాలో.

అతని మొగమంతా అతిజటిలంగా అలుముకుని వుంది, వైరాగ్యం.

నిజానికి, కేవలమూ వైరాగ్యమూ కాదిది – దెబ్బతిన్న సిగ్గు, చేతకాని దైన్యం, స్వతంత్రించలేని అభిమానం – ఏమిటేమిటో మిళితం అయి వుందది.

చేతి కందేటట్టున్న గులాబీ పువ్వులమీద ఎగిరెగిరి వాలుతున్నాయి గండుతుమ్మెదలు.

వసారా దూలంమీద గూడుకట్టుకుంటూ కిచకిచలాడుతున్నాయి, పొట్టి పిచికలు.

ఒకవైపునుంచి నెమలి కేకలూ, మరో వైపునుంచి కోకిల కుహూకూజితాలూ, యెదటి మేడమీద నుంచి ఆగిఆగి వీణా నినాదమూ వినవస్తున్నాయి.

అయినా చలనం లేకుండా పడివున్నా డతను.

మొగాన యీగ వాల్తే – వాలి, తిష్ఠ వేసి, పొటుక్కున్న పొడిస్తే విదిలించుకుంటున్నా డతను, వులిక్కిపడి, అంతే.

"నాన్నారండీ!" అంటూ చక్కా వచ్చింది, సుందరమ్మ ఈ స్థితిలో. ఉలిక్కి పడ్డాడతను.

చూడగా, కళ్ళు జిగజిగలాడిపోయాయి.

కూతురి సౌందర్యం అంత స్ఫుటంగా చూడలే దత నెప్పుడూ.

కాని, కళ్ళు చెమ్మగిల్లాయి జిగాలుమనడం తడువుగా.

మాట్లాడలేకపోయాడు.

కదలనూ లేకపోయాడు.

"ఈ చీర బాగుందా నాన్నారూ?" అంటూ యెదటికి వచ్చి నుంచుంది, సుందరమ్మ.

"నిక్షేపంలా వుంది, అయితే వెల—"

"నూట యాభై మూడున్నర."

"అంత వెలా చేస్తుంది. నీకు చక్కగా కుదిరింది కూడా."

"మరి, దణ్ణం పెట్టుకుంటాను, పాదా లివ్వండి నాన్నారూ!"

కాళ్ళు కిందికి వుంచి నిటాగ్గా కూచున్నా డతను, అప్రయత్నంగా.

రెండు చేతులా అతని పాదాలు ముట్టుకుని కళ్ళ కద్దుకోసాగిం దామె

అద్దుకుంటూనే వుండిపోయింది కూడా.

"ఎంతసేపు తల్లీ! ఇక చాలమ్మా!" అంటూ రెక్క పట్టుకుని ప్రేమతో లేవతీశా డతనే ఆమెని.

చూడగా, బాష్పప్లావితా లయి వున్నా యామె కళ్ళు.

గుండెలు కొట్టుకున్నా యతనికి.

డగ్గుత్తిక కూడా పట్టుకుంది.

అయినా "నేనేం చెయ్యను తల్లీ? నా ఆశలన్నీ నిరాశ లయిపోయాయి. నేను దురదృష్టవంతుణ్ణి, పాపాత్ముణ్ణి. చేతులారా నీ బతుకు పాడు చేశాను. నాకిక పుట్టగతులు లేవు. మేమింతే పెట్టిపుట్టాము మా అమ్మవు కాదూ? ఊరుకో తల్లీ!" అన్నాడు, సప్రయత్నంగా మాట తెచ్చుకుని చివరికి.

"వీరభద్రపురం వెడుతున్నాను, నాన్నారూ!"

"ఎందుకు తల్లీ?"

"వాళ్ళ జానకమ్మ కూతుర్ని తొట్లిలో పెడతా రివాళ. చిన్నమ్మమ్మ వచ్చి మరీమరీ రమ్మని చెప్పి వెళ్ళిం దండీ!"

"దీపాలు పెట్టాటప్పటికి వచ్చేస్తావా?"

"వీలుపడదు నాన్నారూ!"

"అదే మమ్మా?"

"..... ...."

"పోనీ, మీ అమ్మ—"

"రాదుట!"

"ఏం?"

"ఆవిడ మనస్సు బాగాలేదుట!"

"చేతికి వచ్చినంతా డబ్బు పుచ్చుకునీకూడా యిప్పు డిదేమిటీ? అనుకున్నాడతను."

"ఏం వచ్చిందీ?" అనిన్నీ అడిగాడు, కూతుర్ని.

"నాన్నమ్మా అమ్మా మాటా మాటా—"

"ఎందుకూ?"

"అత్తయ్య కొడుకు డబ్బుకోసం వచ్చాడుట కాదూ?"

"అవును.......వస్తే?"

"నా కూతురికి పంపకుండా అడ్డుపడతావా?" అంటూ ఆవిడా "నా కూతురికి లేకుండా చేద్దా మనుకున్నావా" అంటూ—"

"ఇప్పుడు చల్లారిపోయిందా?"

"నానమ్మ చంద్రమ్మత్తగారింటికి వెళ్ళిపోయింది లెండి, అల్కాటుతోటకి."

"బతికాం" అన్నా డతను; కాని వచ్చాక తనతో యేమి రగడ పెంచుతుందో అని భయంగానే వుందతనికి.

"జట్కా తెచ్చి పెట్టరూ నాన్నారూ!"

"రానూ పోనూ—"

"పోనే, రాను వద్దండీ!"

"అదేం?"

"అక్కడ యెంతసేపుండాలో మరి!"

"పిల్లని తొట్టెలో పెట్టడం భాగ్యానికి—"

"రానివ్వ రేమోనండీ!"

"ఎందుకు రానివ్వరూ? వచ్చెయి తల్లీ!"

"ఏం, రాకపోతే యేమిటి నాన్నారూ?"

"నువ్వు బంతిలో లేకపోతే నాకు భోజనం—"

"అలవాటు చేసుకోండి నాన్నారూ!"

"ఏం, అలా అంటున్నావేం తల్లీ?"

"నేనిక అత్తవారి యింటికి—"

"మా అమ్మవు కాదూ? మా తల్లివి కాదూ? ఆ మాట యెత్తకు. అది మరిచిపో. కాకపోయినా, ముసలావిడ మాటకంత పట్టిం పెందుకు తల్లీ?"

"పట్టిం పేముందీ యిందులో? ఏమయినా, యెక్కడున్నా మీ అన్నమే—"

"అదేమిటి మళ్ళీ?"

"కావలసినప్పు డల్లా యెవరినో పంపి యిక్కణ్ణుంచి—"

ఉలిక్కిపడ్డాడు రామబ్రహ్మం.

తన కొడుకు చచ్చిపోయిన నాలుగైదు సంవత్సరాల కొక్క యిప్పుడు మాత్రమే చేబదులుకోసం పంపించింది, తన అక్క.

ఇంతమాత్రానికే యిక్కడ యీ రంధి యెందుకో అతని కర్థం కాలేదు.

సుందరమ్మ కూడా యిలా వుటంకించడం బొత్తిగా అర్థం కా లేదతనికి; కాని ఆలోచనలో మాత్రం పడ్డాడు, దీంతో.

"అక్కడ డబ్బెప్పు డగత్యం అవుతుందో యిక్కడ వుండి–"

"నన్నంత చేతకానివాణ్ణికింద కట్టేశావా తల్లీ?" అన్నాడతను, మాట సగంలో అందుకుని.

ములుకులా గుచ్చుకుంది మరి, ఆ మాట.

"ఇక్కడి డబ్బంతా ముసలావిడ కాకినాడ తరలించేస్తోందనుకుంటున్నారు వీళ్ళు" అనుకున్నాడతను.

"ఎంత భ్రాంతి?" అనిన్నీ అనుకున్నాడు.

నవ్వు రాబోయింది; కాని "నీ అక్కకి యీ వ్యూహాల్లో–నీ దగ్గిర చేబదులు పుచ్చుకోవలసిన కర్మం యేమిటోయ్ మరీ?" అని యెవరో అడుగుతున్నట్టయిం దతనికి.

"దీనిమీద నీ తల్లి అందుకోడం మాత్రం యెందుకూ, యిందులో కుట్ర లేకపోతే?" అనికూడా మరెవరో అడుగుతున్నట్టయింది.

"నిజమా?" అనిపించింది.

అది ఆలోచన రేపెట్టింది.

నెలకి రెండువేలకు పైగా సంపాదిస్తాడు, తన అక్క మొగుడు.

ఒక పల్లెటూరి ఆయకట్టులో సగం భూమి కూడా కొనేశాడు, వరసపెట్టి.

పైగా, పజిల్సులో కూడా డబ్బు కొట్టేస్తూ వుంటాడు, తరుచు.

ఇంతా చేసి వచ్చిందంతా అతను తన అక్క చేతిలో పోసేస్తాడు కాని; తన కని ప్రత్యేకంగా వొక పెట్టె అయినా లేదతనికి.

ఆమె యెందు కెంత ఖర్చు పెట్టినా అదేమిటనడు.

పోనీ అంటే, లక్షలమీద లక్షలు గుట్టలు పెట్టేస్తోంది, తన అక్క

"మరి అలాంటి మనిషికి చేబదులా?"

"అందులోనూ నా దగ్గిరా?"

"ఇదేదో పన్నాగంలా లేదూ?"

"ముసలావిడే నడిపిస్తోందా యిదంతా?"

ఇలాగ సందేహం మీద సందేహం బయలుదేరిం దతనికి, దాంతో.

ఆవిడ సుందరమ్మని "కాకినాడ వెళ్ళిపోదాం ర"మ్మనడం జ్ఞాపకం వచ్చిందతని కాపునాది మీద.

"నా డబ్బుతోనే సైనుపంచెలు కొని చిట్టితల్లిచేత కట్టిస్తుందా అక్క?" అనుకున్నా డావ్యూహంతో.

వొణికిపోయాడు.

నిట్టూర్పు విడుస్తూ కళ్ళు మూసుకున్నా డప్రయత్నంగా.

అదిగో అది కాకినాడలో తన బావగారి మేడ పోర్టికో.

ఒంటెద్దుబండి దింపి, రెక్కపట్టుకుని సుందరమ్మని లోపలికి తీసుకువెడుతోంది తన తల్లి, ఇటు తిరిగి కళ్ళు చికిలించుకుంటూ.

దృశ్యం మారింది.

లోపల వంటింటి పక్కగది.

మారుతాళంతో పెట్టె తెరిచి సుందరమ్మ జరీచీరలూ జాకెట్లూ తన మేనగోడళ్ళు—పర్వతవర్ధనీ, రామలక్ష్మి, సుభద్రా, వెంకుసోదెమ్మా పట్టుకుపోతున్నారు, పదండి పదండి అంటూ వొకళ్ళనొకళ్ళు గెంటుకుంటూ.

మళ్ళీ దృశ్యం మారింది.

"స్నాలగదీ కొళాయీ మనకి పనికిరావు" అంటూ నుయ్యీ, నూతిమీద చేదా చూపిస్తోంది సుందరమ్మకి, తన అక్క అత్తగారు, ధుమధుమలాడుతూ.

మళ్ళీ మారింది దృశ్యం.

"ఎందుకు వచ్చా రమ్మాయిగోరూ మీరీ నరకానికీ? మీ నాన్నగారికి బరువయిపోయారా మీరు?" అనడుగుతోంది పనిమనిషి, దిక్కూ దిక్కూమంటూ నూతిచాటున కూచుని వొళ్ళు తడుపుకుంటున్న సుందరమ్మని, అంట్లు తోముతూ తోముతూ, బెదిరిబెదిరి అటూ ఇటూ చూస్తూ, కంఠం కూడా నొక్కుకుని జాలిగా.

మళ్ళీ మారిపోయింది, దృశ్యం

"దాచుకోండి, దాచేసుకోండి" అని కూతుళ్ళ నవతలికి పంపేసి వచ్చి, తడిబట్టతో వచ్చి తన పెట్టె చూసుకుని తెల్లపోతున్న సుందరమ్మకి సరికొత్త కోరా సైనుపంచె అందిస్తోంది తన అక్క, వికటంగా నవ్వుతూ

చీకటిహాల్లో ఫిలింరీలు తిరిగిపోతున్నట్టు ఆ దృశ్యాలు కనపడ్డాయి, మూసుకున్న ఆ కళ్ళ కతనికి.

గుండెలు బద్దలాసిపోగా "ఇవ్వను ఇవ్వ"నంటూ మరీ వూగిపోయా డతను, పడకుర్చీ జవజవలాడేటట్టు.

"........."

"నాన్నమ్మ యిమ్మంటుందే అనుకో. అయితే, నాకు తెలియదుటమ్మా, ఆమాత్రం?"

".........."

"చేబదు లంటే మళ్ళీ యిస్తుంది కదా అని నేను సరే అన్నమాట నిజమే, నాది బుద్ధితక్కువే, సందేహం లేదు."

"..........."

"పోనీ, యిప్పుడే కాదు, మరెప్పుడూ కూడా చిన్నత్తయ్య కొక్కుదమ్మిడీ అయినా యివ్వను, సరా?"

ఇలా అడుగుతూ వుద్బ్రేత్తుగా లేచి కూచుని చెయ్యి పట్టుకున్నా డతను.

అప్పటికీ అతను వొణుకుతూనే వున్నాడు.

మాట కూడా గద్గదికమై వుంది.

"మీ డబ్బు మీ యిష్టం వచ్చినట్టు చేసుకుంటారు, నాకెందుకు నాన్నారూ, అదంతా?"

"అదేమిటమ్మా, నువ్వు కూడా—"

"నే నేమన్నాను నాన్నారూ? నాకేం కావాలండీ యింక? బతకడానికి గుప్పెడు మెతుకులే కరువయిపోతాయా నాకు?"

నెత్తిమీద పిడుగు పడ్డట్టయిందతని కీమాటతో.

"మా అమ్మవు కాదూ, యిక అలా అనకమ్మా! కాకినాడ మాట మరిచిపో. నువ్వు తప్ప మాకింకెవరున్నారూ? నాన్నమ్మని నోరెత్తనివ్వనిక చూసుకో. ఇనప్పెట్టి తాళాలు నీకే యిచ్చేస్తాను పోనీ. నువ్వు చల్లగా వుండాలి గానీ–" అంటూ వొణుకుతూ వెళ్ళి, ఎడమచేత పొదివి పట్టుకుని కుడిచేత ఆమె గడ్డం పుణికా డతను

"నేనేం తప్పమాట అన్నానని–"

"తప్పోవొప్పో–ఇక అది మరిచిపో. ఏం? దీపాలు పెట్టాటప్పటికి వస్తానను. అని మరీ వెళ్ళు"

"అక్కడి వీలు–"

"వీలంటే, మన యిష్టమే కాదుటమ్మా వెర్రితల్లీ! వచ్చెయ్యి – ఏం?"

"వొంటరిగా కూచుని భోజనం చెయ్యడం నాకు మాత్రం–"

"ఇంకేం? అందుకే వచ్చెయ్య మంటున్నాను"

"అమ్మమ్మా తాతయ్యగారూ కూడా వస్తారక్కడికి మరి. వో పట్టాన అమ్మమ్మ నన్ను వదలదు. మీకే తెలుసు."

"నా మాటగా చెప్పి నువ్వు వచ్చెయ్యి."

"....... ఏడున్నర లోపున నేనురాకపోతే మాత్రం–"

"ఏడున్నరకాదు, ఎనిమిదిన్నర దాకా చూస్తాను. తప్పకుండా రా అమ్మా, ఇవాళ రెండో ఆటకి సినీమాకి వెడదాం."

"జానకమ్మ–"

"దాన్ని తీసుకుని నువ్వు సినిమాకే రా పోనీ, నే నక్కడే కనిపెట్టుకుని వుంటాను."

"........."

"కళ్ళు మూసుకుని నేనిక్క డెలాగో నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని–"

"మీ రలా అంటే నాకక్కడ ముద్ద నోటికి పోతుందా నాన్నారూ?"

"అందుకేగా వచ్చెయ్య మంటున్నానూ?"

"........"

"నేను మరీమరీ చెప్పానని చెప్పు జానకితో. గ్రేటాగార్బో నటించిన ఫిలిం, ఇవాళే మొదలు కూడానూ."

"ఆలస్యం–"

"అవునవుతోంది మరి. జట్కా తీసుకురానా?"

"తీసుకురండీ!"

"రానూ పోనూ...."

"వద్దండీ!"

"నువ్వు భోజనానికి వచ్చే ప్రయత్నంలోనే వుండాలిసుమా!....పోనీ, ఏడున్నరకి టెన్నిస్‌కోర్టునుంచి నే నక్కడికే–"

"చాలా సంతోషిస్తుందండీ చిన్నమ్మమ్మ."

"నాకూ చూడాలనే వుంది, జానకి కూతుర్ని."

"మరి, అమ్మ నిక్కడ వుంచేసి మీ రొక్కరే–"

"అవునమ్మోయ్, గట్టి చిక్కే!"

"నన్నే కాదు, భోజనం చెయ్యకుండా మిమ్మల్నీ–"

"అదీ నిజమే. సరే, జట్కాకోసం వెడుతున్నాను."

తానుకూడా ఆమెతో పాటు జట్కా యెక్కా డతను.

"సోమాలమ్మ గుడివీధిని కాదు, బజారునుంచే పోనియ్యి, కూరల మార్కెట్టు దగ్గిర నేను దిగిపోతాను" అని జట్కామనిషికి చెప్పి మరీ యెక్కా డతను.

అక్కడ బండి దిగుతూనే దిగిన్నీ కూడా మళ్ళీ చెప్పా డతను, తప్పకుండా వచ్చెయ్యమని కూతురితో.

వస్తుందని స్థిరపరుచుకుని ఇంతలో క్లబ్బు గాలి ముసురుకోగా, ద–ర్జాగా టెన్నిస్‌బాటు తిప్పుకుంటూ, కూనిరాగంకూడా తీసుకుంటూ టవునుహాలుకి వెళ్ళిపోయా డతను.

## 13

"ఏం, యింకా కనిపెట్టుకునే వుంటారా, యిప్పుడయినా భోజనానికి లేస్తారా?" అనడిగింది, భద్రమ్మ వచ్చి.

పడకకుర్చీలో పడుకుని వున్నాడు రామబ్రహ్మం, హాల్లో.

మాటిమాటికీ వీధిగుమ్మం కేసి చూస్తున్నాడు, కూడా.

వీధిలో జట్కా చప్పుడయితే "అదిగో వచ్చేసింది చిట్టితల్లి" అనుకుంటూ, నిటార్గా కూచుంటూ, మళ్ళీ మళ్ళీ వాలిపోతూ సతమత మయిపోతున్నా డతను.

తన తల్లీ భార్యా కజ్జా ఆడుకోడం–దాంతో, తన తల్లీ అక్కా తన బిడ్డ ప్రాణాలు కుచ్చులు పన్నుతున్నట్టు తన కనుమానం యేర్పడ్డం–అది అంజనం అయి చేబదులు కోసం కొడుకుని పంపిన తన అక్క దుశ్చింత తనకి పూర్తిగా అవగాహన కావడం–దీంతో తన యేకపుత్రికమీద మమకారం ముమ్మరం అయిపోయివుం దతని కప్పుడు.

ఏది యేమయిపోయినా ఆమె కేఅపాయమూ రాకుండా చూసుకోవాలన్న శ్రద్ధ కూడా పుట్టుకువచ్చి వుందతనికి.

అంచేతనే ఆమెని చూడాలన్న యాతహాతహా.

కాక,–

ఎంత రాత్రయినాసరే, అమె వచ్చాక ఆమెని బంతిని కూచోపెట్టుకునే భోజనం చెయ్యాలని దీక్షపట్టా డతను.

సుందరి స్వయంగా అన్నం తినగలిగినప్పణ్ణుంచీ వుంది, అతనికీ యేక బంతి అలవాటు.

ఆమె బంతిలో లేనిపూట సగంసగమే అవుతుం దతని భోజనం.

దీనికి సాయం, తల్లీ పెళ్ళామూ సరిగా ఆ సమయంలో కీచులాడుకోడం వల్ల మధ్యాహ్నం ఫలహారం సహించలే దతనికి.

కాగా, ఆకలీ యెక్కువగానే వుంది, ఆందోళనకు సాయం.

దానా దీనా వొక్క ఆలోచనా నిలవడం లేదు, వొక్క నిశ్చయమూ రూపు కట్టడంలే దతనికి.

ఎటు చూసినా ముజ్జిడ్డుగా కనపడుతోం దంతా.

అంచేత "యింకో అరగంట చూద్దాం" అన్నాడు.

"మీ యిష్టం" అంటూ గుమ్మం దాటింది భద్రమ్మ.

"అమ్మాయి రావడమే వస్తే తల్లితో కూచుని భోజనం చేస్తుం దీపూటకి, నువ్వు లేవరాదూ నాయనా!" అనడుగుతూ వెంకుసోదెమ్మ చక్కా వచ్చింది, వుత్తరక్షణాన.

ఉలిక్కిపడ్డాడతను, ముందు.

మండిపోయాడు తరువాత.

మాట్టాడ కూడదనుకున్నాడు; కాని "నీ ఫలహారం అయిందా?" అనడిగాడు, నోరు జారి.

"ఆ."

"వెళ్ళిపడుకో."

కదల్లేదామె.

అదే చిరాకుకలిగించగా "అక్క కేం చెప్పి పంపావ్?" అనడిగింది.

"ఏం, చెప్పి పంపితే నీకేం?" అనా లని అతని వుద్దేశం; కాని "ఇప్పుడాసంగతి యెత్తకమ్మా!" అంటూ వచ్చింది, మాట మళ్ళీ.

"ఏం?"

"వద్దన్నాను."

"ఏమ నడుగుతున్నాను."

చ(రు మనిపించిం దీమాట.

వల్లమాలిన రోషం వచ్చేసింది, దాంతో.

ఎగిసిపడి లేచినుంచో వలసినవాడే; కాని నిటాగ్గా మాత్రం కూచున్నాడు, కుర్చీలో.

"కోడలితో తగువు లాడ్డం చాలలేదూ?" అనిన్నీ అడిగాడు, కరుగ్గా.

"నే నేం తగువు లాడానురా?"

"ఇప్పు డిదేమిటి పోనీ?"

"అక్క కేం చెప్పి పంపావని అడిగితే తప్పా?"

"అవి నీ కనవసరం అంటే వినపడదూ?"

"అయ్యో, అయ్యో!"

ఎంత గండ అయినా, మొగవాడు గట్టిగా నిలవదీస్తే చివరికిదే ఆడదాని ధోరణి.

అది గుర్తించి "యిప్పుడయినా వెళ్ళి పడుకో" అన్నడతను, నిష్ఠురంగా.

అని మళ్ళీ కుర్చీలో వాలాడు, యిక మాట్టాడవద్దన్నట్టు.

ముసలమ్మకీ వచ్చింది రోషం, దీంతో.

"నీకు నీ కూతు రెలాంటిదో నాకు నా కూతు రలాంటిది కాదుట్రా?"

"అయితే?"

"నీ పెనిమిటి బతికివున్నంత కాలమూ నీ కూతురి యెక్కువ, యిప్పుడు నా కూతురి యెక్కువ, తెలుసా?" అనుకుంది, తలుపుచాటున పొంచివుండిన భద్రమ్మ.

"మరి, తండ్రి ఆస్తిలో–" అంటూ అందుకుంది ముసలమ్మ.

"తండ్రిది కాదు, తాతముత్తాతలది."

"ఆ?"

"మా నాయన కొత్త ఆస్తి యేమీ సంపాదించలేదు."

"ఉన్నది నిలిపారు చాలదూ?"

"స్వేచ్ఛగా తిన్నాడు. వాకళ్ళకి పెట్టాడు. పెట్టి తాళాలు నీ కిచ్చాడు, నువ్వేం చేసినా చూసి వూరుకున్నాడు, చాలదూ?"

"అలాగా?"

"అప్పుడు నాయన అయితే, యిప్పుడు నేనూ పెత్తనదారుని, ఈ ఆస్తికి."

"ఆస్తి అంతా చిట్టితల్లిది, యిప్పటి మట్టుకి" అనుకుంది భద్రమ్మ, గుండెలమీద చెయ్యి వేసుకుని.

"బిడ్డ లంటే మొగబిడ్డలు–"

"మరి అక్కకి మాత్రం యేమి అధికారం వుందీ, పైతృకం మీద?"

"మహా బాగా అడిగారు" అనుకుంది భద్రమ్మ; కాని అత్తగారి మాటలో "నేను కనక మొగబిడ్డని కనగలిగాను, నీ పెళ్లాం కనగలిగిందా మరి?" అన్న ధ్వని కనపడిం దామెకి.

చివుక్కుమంది మనస్సు.

అభిమానమున్నూ ముంచుకువచ్చేసింది.

ఉడుకుమోత్తనం, రోషం, దుఃఖమూ కూడా వచ్చాయి వురకలు వేసుకుంటూ; కాని "ఆడపుట్టక కాదు నీది" అంటూ జలదరించుకుంది, చివరికి.

"పుట్టింటి ఆశ–" అంటూ అందుకుంది ముసలమ్మ, అంతలో మళ్ళీ.

"ఆశకా దిది – దోచుకోవా లన్న దుర్బుద్ధి" అనుకుంది భద్రమ్మ, పళ్ళు పటపటా్డించుకుంటూ.

"ఆశకా దిది ద్రోహచింత" అన్నాడు రామబ్రహ్మం, అంతలో నిష్ఠురంగా.

"ఆ, ఆ, యేమన్నావూ?" అంటూ కొయ్యయిపోయింది ముసలమ్మ. కాని "ఎన్నాళ్ళకి వినపడిందీ శుభమైన మాట!" అనుకుంది భద్రమ్మ.

పొంగిన్నీ పోయింది, అనుకుని.

"ఎనిమిది న్నర కావస్తోంది, సినీమాకి వెడతానన్నారు గదా – లేవరాదూ, యింకా స్నానం కూడా చెయ్యాలీ?" అనడుగుతూ వెంటనే యెదటికిన్నీ వచ్చేసింది మళ్ళీ, యేమీ యెరగనట్టు

రగడ తప్పకపోతే అత్తగారిని "దులిపేద్దా" మనే వచ్చిందామె.

వెంకుసోదెమ్మ కూడా పరిస్థితులు గుర్తించలేకపోలేదు.

వీలు తప్పితే "చెలిగేదా"మనే నిశ్చయించుకుం దామె కూడా.

రామబ్రహ్మం మాత్రం తెల్లపోయాడు.

"ఓ ఏదో మూడుతుం దివాళ" అనిన్నీ అనుకున్నా డతను.

అంతే జరిగింది కూడా

"మమ్మల్ని మాట్టాడుకోనివ్వవూ?"

"కొడుకుని భోజనం చెయ్యనివ్వవూ?"

"తలుపుచాటున పొంచివుండి–"

"వొంటరితనం కల్పించి మెడలు విరుద్దామని–"

"ఏదో మందుపెట్టి నా కొడుకు మనస్సు విరిచేసి–"

"నా బిడ్డ గొంతుక్కోసి వున్నదంతా కాకినాడ తరలిద్దామని–"

"ఏముం దిక్కడ?"

"ఏముండనిచ్చావు నువ్వు?"

"అవాలు ముద్దచేశాను, కడుపు కట్టిపెట్టుకుని."

"అదంతా కాకినాడ దాటించా వెప్పటి కప్పుడు."

"నా కూతురి నన్నవాళ్ళు పురుగులోడి–"

"నన్ననన్నవాళ్ళు ఫెడీమని–"

"ఊరుకుంటారా లేదా?" అంటూ వురిమాడు రామబ్రహ్మం, అప్పటికి మాట తెచ్చుకునీ, యెగిసిపడి లేచి మంచునీని.

భద్రమ్మ వెనక్కి తగ్గింది, అత్తగారిమీద మాత్రం నిప్పులు కక్కుతూ; కాని "పెళ్ళాన్ని వంచుకోలేనివాడవు నన్నాజ్ఞ పెట్ట చూస్తా వేమిషిరా వాజమ్మా" అంటూ యిటు తిరిగింది, ముసలమ్మ

"వెళ్ళి పడుకుంటావా లేదా నువ్వు?"

"నేను వెళ్ళ నేం చేస్తావేమిటి నువ్వు?"

బోసినోరు పాటించుకుంటూ తల్లి యిలా యెదురుకునే టప్పటికి అగ్గయి పోయాడు రామబ్రహ్మం.

కాని ఆమె నింటోకి పంపెయ్యా లంటే యేమి చెయ్యాలో తోచలే దతనికి

పోనీ అంటే యెదట పెళ్ళాం.

ఇప్పు డూరుకుంటే తాను లోకువయిపోతా డామెకి

తన భర్త అప్రయోజకు డయినా సరిపెట్టుకుంటుంది, తన మాట వినక పోయినా సమాధానపడుతుంది, గాని, తనకి కాక, ఆమె యెవరయినా, మరో స్త్రీకి లొంగిపోతే మాత్రం సహించలేదు, స్త్రీ.

భర్తది కాదు ఆ లొంగుబాటు, తనది అనుకుంటుం దామె.

అది పురుషున కపాయకరమైన సన్నివేశం.

ఇది బాగా తెలుసు రామబ్రహ్మానికి.

"పెళ్ళాం చేతిలో కీలుబొమ్మ అయిపోగూడదు నాయనోయ్!" అన్న నోటితోనే "పెళ్ళానికి లోకు వయిపోగూడదురోయ్!" అని కూడా తల్లే నూరిపోసింది, మరి అతనికి.

కనక?

తల్లినే మందలించా లని తేలింది.

ఆ పని మాత్రం చెయ్యగలడా మరి, అతను?

ముందు నుయ్యీ, వెనక గొయ్యీ అయిం దతనికి.

అవ్యక్తము – అభిమానం, అప్రయోజకత్వం – రోషం, అశక్తత – ఆగ్రహం – యిలాంటి ద్వంద్వాలు విరుచుకుపడ్డాయి, దాంతో

నిప్పులు కక్కుతూ చూశాడు, మొదట

వొణికిపోతూ పరవళ్ళు తొక్కాడు, తరవాత.

"కొట్టుకు చావండి మీ రిద్దరూ" అంటూ వీధిలో కుడాయించాడు, నేలమీద జీరాడుతున్న వుత్తరీయం బుజం మీదికి తీసుకుంటూ, చివరికి.

కొయ్యయిపోయింది ముసలమ్మ.

భద్రమ్మ మాత్రం మహిషాసురమర్దని అయిపోయింది

"నా కూతురికి లేకుండా చేద్దా మని చూస్తున్నావు. నోటి దగ్గిర అన్నం పడగొట్టావు కొడుక్కి నువ్వు మనిషివి కావు. పురుగులోడిపోతావు!" ముసలమ్మ మీద ధాంధూములు చేసి, గిరుక్కున మళ్ళీతలుపులు బిడాయించుకుంది పడమటింటోకి వెళ్ళి.

## 14

కూనిరాగం తీసుకుంటూ అప్పుడే వచ్చాడు రామబ్రహ్మం సినీమా నుంచి.

భద్రమ్మ మేలుకునే వుందింకా.

అయితే, యేదో పోగొట్టుకున్న దానిలాగా, కట్టుళ్ళలో వున్న మనిషిలాగా మంచాన పడి అటమటించిపోతోంది, అటూ యిటూ దొర్లుతూ.

మొగుడు లోపలికి రావడం చూసింది కాని; లేవలేదు.

పలకరించనూ లేదు.

అతనే పలకరించాడు "వొంటిగంట అయింది, నిద్రపట్టలేదూ యింకా?" అంటూ మీద చెయ్యివేసి.

"అలా పడుకోండి" అంటూ గోడవైపు జరిగిం దామె, అడిగినదానికి బదులు చెప్పకుండా.

ఉనికిలోనే కాక ఆమె మాటలో కూడా దిగులూ, దిగులు కంటే విసుగూ, విసుగుకంటే కూడా బాధా యెక్కువగా కనపడ్డా యతనికి.

నిర్విణ్ణు డయినాడు.

"మళ్ళీ రగడ జరిగిందా?" అనిన్నీ అనుకున్నాడు.

చూసిచూసి "అలా వున్నావేం?" అనడిగాడు చివరికి, యెటూ పాలుపోక

"ఉండవలసినట్టే వున్నాను."

"భోజనం–"

"చెయ్యనిచ్చే పట్టే పట్టిందా మీ మాతృదేవత?"

"నువ్వు చేస్తే కొడుతుందా?"

"పెనిమిటిని పస్తుపెట్టి కడుపు విచ్చేలా తినేది కామోసు మీ అమ్మ, మేము నేర్చుకోలే దలాంటి వింకా."

"పస్తు కర్మ మేమీ? నేను హోటల్లో—"

"కట్టుకున్న పెళ్ళాం యింటో మాడిపోతూవుంటే హోటల్లో—"

"స్స."

"ఉన్నవూళ్ళో—సొంత యింటో—సిద్ధాన్నం విడిచి హోటల్లో తినడం మా వూళ్ళో కూడా యెవరూ యెరగరు."

"... ...."

"రాజమహేంద్రవరంలోనూ, మళ్ళీ మీ యింటోనూ మాత్రమే చెల్లిందది."

"... ......"

"చిట్టితల్లి రాలేదు కనక సరిపోయింది, వచ్చేవుంటే అది కూడా కడుపు మాడ్చుకో వలసిందే కదా, మీ అమ్మ ధర్మమా అని?"

"నేను వెళ్ళాక మరే మయినా గందరగోళం—"

"మీ అమ్మ నోరూ వాయీ లేనిదని కామోసు అక్కడికి!"

"... ......."

"అవిడ కండలో కండ మీరు; మీ కామె చేసినవల్లా బాగానే వుంటాయిగానీ—"

"ఏం చేసిందీ?"

"... ... ... .."

"పోనీ, యేమందీ?"

".. .. ... .."

"చెప్పవూ?"

ఇలా అడుగుతూ ఆమె గడ్డం పట్టుకున్నా డతను.

అప్పటికీ బదులు చెప్పలే దామె.

వెంటనే మంచం మీద కూచుని ఆమె మీదుగా వంగి అవతలివైపున చెయ్యి ఆనుకుని, మొగాన మొగం వుంచి "చెప్పవూ? నా గుండె లెలా కొట్టుకుంటున్నాయో చూడూ" అంటూ ఆమె చెయ్యి తన గుండెలమీదికి తీసుకుని నొక్కుకున్నాడు.

"చెయ్యి వదలండీ!"

"నన్నేడిపిస్తావా?"

"ఏడ్చేదాకా మీకేం?"

"నీకు మాత్రం యేమి వచ్చిందీ?"

"పుట్టిన వొక్కపిల్లా మోడయిపోయి, దుఃఖదేవతలాగ వుసూరుమంటూ కళ్ళ యెదట మసులుతూ వుంటే కన్నతల్లి కడుపెంత తరుక్కుపోతుందో—"

"అదంతా నిజమే కాని; యివాళ కొత్త యేమి వచ్చిందీ?"

"ఇది పాతపడ్డం అంటూ వుందా?"

"........"

"మనిషి జన్మ యెత్తినవాళ్ళకి మరుపువచ్చేదేనా యిది?"

"పురిటిలో చచ్చిపోతే వొక్కటే యేడుపయిపోయి వుండును. ఇప్పుడే క్షణాని కాక్షణమే కత్తికోత."

"........"

"నా కళ్ళు దించుకుపోతే బాగుండిపోవును."

"చేసుకున్న దంతా—"

"ఒకళ్ళు చేసిందా, స్వయంగా చేసిందా?"

"ఏమయినా వొకటేగా అనుభవానికి వచ్చినప్పుడు?"

"అనుభవిస్తూనే వున్నాంగా నేనూ చిట్టితల్లీనీ?"

"........"

"ఆ చీర కట్టుకుని, నా నగలూ తన నగలూ పెట్టుకుని అద్దం యెదట నించుని సవరించుకుంటూ వుంటే చూడలేకపోయాను, చిట్టితల్లిని. గిర్రున నీళ్ళు నిండిపోయాయి కళ్ళల్లో."

ఈ మాటతో అతని కళ్ళూ చెమ్మగిల్లా యిప్పుడు

"ఇక అక్కడ నుంచుకోలేకపోయాను. అమ్మా, 'వెడుతున్నానే' అంది. గుమ్మం దాక సాగనంపడాని కయినా కాళ్ళాడలేదు వెళ్ళిరా అని మాట అయినా—"

"నా పనీ అలాగే అయిందక్కడ. బాటు పట్టుకువెళ్ళానే గాని వొక్క మాటయినా బంతి తియ్యలేకపోయాను, సరిగా బలమే లేకుండా పోయింది చేతిలో."

"........"

"మూడు పావులాలు చెల్లించి పీటమీద కూచున్నానే గాని వొక్క మెతుకయినా నోటికి పోలేదు, హోటల్లో."

"దీపాలు పెట్టాక తలనిండా పెట్టి, మెడనిండా వేసి కళ్ళనిండా చూసుకుందా మని బుట్టెడు మల్లెమొగ్గలు కొన్నాను. వీరభద్రాపురం నుంచి పార్వతమ్మ పిన్ని వచ్చి పిలిచిం దంతలో. అదరా బాదరా చిన్న దండ గుచ్చి తలలో పెట్టుకుని చక్కాపోయింది, అమ్మ."

"......"

"మొగ్గలన్నీ అలాగే వుండిపోయాయి."

"....."

"అది శుభకార్యం కోసం వెడుతూ వుంటే, తల్లినయి వుండిన్నీ వెంట వెళ్ళలేక యింటో పడి మగ్గిపోతున్నాను నేను. నిశ్చింతగా హోటల్లో భోజనం చేసి, దర్జాగా సినిమాకి వెళ్ళి, కులాసాగా కూనిరాగం తీసుకుంటూ, కమ్మగా నిద్రపోడాని కింటికి వచ్చారు మీరు, నా బాధ మీకేం తెలుస్తుందీ?"

'నే నెంత యేడుస్తున్నానో—'

"మీరా?"

"........"

"దుఃఖమా మీకు?"

"........"

"అమ్మమాట విని కన్నబిడ్డ బతుకు ధ్వంసం చేశారు మీరు నా కడుపులో రాయి పడేశారు. అక్కని ఆనందపెట్టడానికి. ఇదంతా నవ్వుతూ చేశారు మీరు, నేను మరిచా ననుకున్నారా?"

"......"

"దుఃఖానికి బదులు శాంతీ, నిరాశకి బదులు వెలుగూ సంపాదించుకుందామని చదువుకుంటూ వుంటే అమ్మాయి ప్రాణాలు కూడా తీద్దామని కాకినాడనుంచి వుత్తరాల మీద వుత్తరాలు తెప్పిస్తోంది మీ అమ్మ. పోనీ అంటే, ఆ వుత్తరాలు పట్టుకుని వూరేగుతున్నారు మీరు, నేను చూడ్డం లేదా?"

"ఊరేగుతున్నా నంటే—"

"ఇదంతా యేడుస్తూ చేసే పనా, నవ్వుతూ చేసే పనా?"

"అమ్మాయి మీద నా కెంత ప్రేమ—"

"ఏమిటీ?" అంటూ చర్రున సగం లేచింది భద్రమ్మ, గోడవైపున వున్న మొగం యిటూ తిప్పుకుంటూ.

చుట్టచుట్టుకుని పడుకుని వున్న నల్లతాచు, మనిషి అలుకుడు విని బుస్సు మంటూ పడగ విప్పి తల యెత్తినట్టుంది, ఆమె వాలకం

"పోనీ నీకే వుంది ప్రేమ, సరే. మరి ప్రయోజనం?"

"హయ్యో, దేవుడా! లక్షమాట్లన్నారు మీరిప్పటికి చదువుకుంటే ప్రయోజనం యేమిటని, యిదెక్కడ ధోరణండీ?"

"లోకనిందకి జడిసి—"

"పాడులోకం! అమ్మాయిని ఆడిపోసుకోడం తప్ప మరి పనిలేదూ దానికి?"

"......"

"ఎంతోమంది అధీనం తప్పిన తమ కూతుళ్ళకు మళ్ళీ పెళ్ళిళ్ళు చేసి—"

"నిజమే, చేస్తున్నారు."

"వారి నేం చెయ్యగలుగుతోందీ ఆ లోకం?"

"......"

"మీకు మాత్రం యెందుకూ వారికి లేని భయం?"

"కొంప మునిగిపోదూ?"

"ఇది మునిగిపోడం కాదుటండీ?"

"........."

"పోనీ, మీ రేమీ చెయ్యనక్కరలేదు. దాని మానాన అది వెళ్ళి పెళ్ళి చేసుకుంటుంది, వొప్పుకోండి!"

"వొప్పుకోమంటే—"

"దాన్ని మీ యింటికి తీసుకురా నక్కరలే దిక ఒక దమ్మిడీ అయినా పెట్టనక్కరలేదు దానికేసి చూడనైనా చూడనక్కరలేదు, సరా?"

"తన యిష్టం వచ్చిన పిల్లాణ్ణి పెళ్ళి చేసుకుంటుంది కలో గంజో తాగుతూ తన బతుకది బతుకుతుంది, ఏం?"

"అన్నీ హిరణ్యాక్షవరాలే నీవి."
"మరి, మీ అమ్మవి?"
"........"
"ఇలా చూడండీ! మంచి వయసు వచ్చింది. చదువున్నూ వంటబట్టింది. అందచందాలు తెలిశాయి. తోటి పిల్లల సుఖమూ ఆనందమూ చూసి తనకవి లేకపోయాయే అని కుమిలిపోతోంది, దాంతో. అలాంటి బిడ్డని 'ఇంకా కుమిలిపో, ఏడ్చుకుంటూ మూలపడి వుండు' అనడానికి నోరెలా వస్తుందండీ మీకు?"
".........."
"పుట్టగతులు చూసుకోవద్దూ?"
"........"
"ఏం, బదులు చెప్పడానికయినా తగనూ నేనూ?"
"........"
"అవును, ఆ అమ్మ కొడుకులు కారూ?"
".........."
"ఆ అక్క తమ్ములున్నూ కారూ?"
అప్పటికీ మాట రాలే దతనికి.
ఇక్కడ యిదిలా వుండగా దూరాన బాండువాద్యం.
ఆగిఆగి మధ్యమధ్య కమ్మని సన్నాయిపాట.
చూసి చూసి "మాట్లాడ రేమండీ?" అంటూ రెక్క పట్టుకుని కుదుపుతూ అడిగిందామె, అతణ్ణి.
"అమ్మాయిని చూడాలేను, లోకనింద సహించాలేను!"
"అది యింటో వుంటే చూడక తప్పుతుందా?"
"..........."
"ఏక్షణాని కాక్షణం గుడ్లు పేలిపోవ్వూ?"
"ఇప్పుడు గుండెలు బద్దలాసిపోడం లేదనా నీ వూహ?"
"నిజంగా?"
"వొట్టు" అందా మనుకున్నాడు మొదట; కాని "ఛా" అనుకున్నా డంతలో.
"ఏడుస్తూ కూచుంటోం దది మీ బంతిని, తెలుసా?"
"...........,"
"కమ్మగా ఎలా భోజనం చెయ్యగలుగుతున్నా రండీ మీరు?"
"............"
"మనుమడు చచ్చినందు క్కాదు, అమ్మాయి బతికివున్నందు కేడుస్తోంది మీ అమ్మ, ఇదయినా తెలుసా మీకు?"
"అంతమాటే?"
"కాక?"
"ఈ కాలపు వేషాలు చూడలేక—"
"మరి నేను చూడగలనా ఆ కాలపు వేషాలు?"

"......."

"పయి సంబంధం అయి వుంటే అమ్మాయి మీద యింత పగపట్టునా మీ అమ్మ?"

"నిజమేనా?" అనిపించిం దతనికి.

"అవు"నన్నట్టతని తల కంపించింది, అప్రయత్నంగా.

అది గుర్తించి యెగిసిపడి లేచి కూచుని అందుకుంది భద్రమ్మ.

"నా మాట వినండి. ఎప్పటి లాగే అది యింటో తిరుగుతూ వుంటే మనకీ యాతన తప్పదు. అలా కాక, మనకి కనపడకపోయినా, మళ్ళీ పెళ్ళి చేసుకుని యెక్కడో వొకచోట అది సుఖపడుతోందంటే మన కదొక నిబ్బరమూ అదొక ఆనందమూను."

"... ......"

"అవునా కాదా?"

"నిజమే–"

"అవునా కాదా? అది చెప్పండి?"

"అవును కానీ–"

"ఇక కానీ యెందుకూ మళ్ళీ?"

"అమ్మాయిని విడిచి వుండగలమా మనం?"

"అది యిక్కడ యేడుస్తూ వుంటే నిశ్చింతగా వుండగలం. అది మగ్గిపోతూ వుంటే దర్జాగానూ వుండగలం."

"ఇప్పుడీ ధోరణి యేమిటీ నీకు, కొత్తగా?"

"సింగారించుకుని యెదట నుంచుంటే కళ్ళు జిగాలుమని పోయాయండీ నాకు!"

"......"

"అచ్చంగా పెళ్ళికూతు రయిపోయిందండీ, చిట్టితల్లి!"

"... నీ మాటలు బాగా వినపడ్డం లేదు, ఆ బాజా లేమిటో – వెళ్ళిపోనియ్యి"

భద్రమ్మ మనస్సు గుబగుబలాడిపోయింది

మొగం విరిసింది.

కళ్ళు ఆనందోత్ఫుల్లా లయిపోయాయి.

## 15

"ఏదో వుత్సవం మన వీధికే మళ్ళినట్టుంది చూద్దామా?" అనడిగా డతను, ఆమె చెవి దగ్గర నోరుపెట్టి.

జవాబు కోసం చూడకుండా, పాదివి పట్టుకుని ఆమెని కిందికి దింపాడు కూడా.

వొక్క అడుగున్నా వేశారు, ముందు కలాగే వుండి, యిద్దరూ.

సరిగా యీ సమయాన గది తలుపులు జవజవలాడిపోయాయి.

"అబ్బాయోయ్! నాయనోయ్! కొంప మునిగిపోయిందిరోయ్! సుందరమ్మ గొంతుక్కోసేసిందిరోయ్!" అంటూ బొబ్బలున్నూ వినవచ్చాయి.

కంగారుపడుతూ తలుపు తీశాడు రామబ్రహ్మం.

చూడగా "లబోలబో" మని మొత్తుకుంటూ వెంకు సోదెమ్మ

"ఏమిటమ్మా?"

"ఇంకా యేమిటమ్మా అంఛా వేమిషిరా వాజమ్మా? రారా, కిందికి రారా, అప్రయోజకుడా!"

కొయ్యయిపోయాడతను.

తల్లిలాక్కుపోగా కిందికిన్నీ వెళ్ళిపోయా డాస్థితిలోనే.

రెండోవైపు తలుపులు తెరిచి బాల్కనీలోకి వుడాయించింది భద్రమ్మ, పొంగిపోతూ,

అంతలో నాలుక కరుచుకుంటూ వెనక్కి వచ్చి మల్లెమొగ్గల బుట్ట పుచ్చుకుని మళ్ళీ వెళ్ళిపోయింది, బాల్కనీలోకి.

రామబ్రహ్మం కిందికి వెళ్ళిచూడగా, స్త్రీలూ పురుషులూ కలిసి వీధినిండా పెళ్ళివారు!

గుమ్మాని కెదురుగా–బాల్కనీకిన్నీ కిందుగా చక్కని మోటారు.

వెనక సీటులో పెళ్ళికూతురూ పెళ్ళికొడుకూ, ముందు సీటులో డ్రయివరు పక్కన వృద్ధదంపతులూను.

మనసు బిగపట్టుకుని పరకాయించగా, పెళ్ళికూతురు సుందరమ్మా, పెళ్ళికొడుకు ఆమె ట్యూటరు కృష్ణశాస్త్రిని!

వృద్ధదంపతులున్నూ యెవరో కారు, భద్రమ్మ తల్లీ తండ్రీనీ!!

నిలువునా నీరయిపోయాడు రామబ్రహ్మం.

తిడుతూ కృష్ణశాస్త్రి మీది కురకబోయింది ముసలమ్మ; కాని యిలాంటిది జరగవచ్చునని సైనికుల్లాగ బాణాకర్రలతో పక్కని వరాసగా నుంచుని వున్న కాలేజీ విద్యార్థులు, తీసుకుపోయి ఆమెను హాల్లో కూలవేశారు.

అది చూసిన్నీ కదల్లేకపోయాడు రామబ్రహ్మం.

ఒక్కక్షణం వాద్యా లాగిపోయాయి.

వెనక మోటారులోంచి నలుగురు యువతులు దిగివచ్చి వధూవరులకు కర్పూరహారతి యిచ్చి పక్కల కోసిరిల్లారు, ఆ సమయాన.

ముసిముసిగ్గుతోనూ, మొలకనవ్వులతోనూ పైకిచూస్తూ పెళ్ళికూతురూ పెళ్ళికొడుకూ చేతులు జోడించుకున్నా రప్పుడు.

దేవతలు పుష్పవర్షం కురుస్తున్నట్లు, పైనుంచి, మోటారు నిండా అరవిచ్చిన మల్లెపూలు పడ్డాయి, వెంటనే.

*(1935 జనవరి 'ప్రబుద్ధాంధ్ర' నుంచి సవరణలతో)*

★ ★ ★

# కూతుళ్ళ తల్లి

"చిన్నమ్మమ్మ వస్తోందమ్మా!"

"ఏమి పని తొందరలో వుంటావో అనుకుంటూ–"

"పను లెప్పుడూ వుండేవే, రావమ్మా పిన్నీ! సరిగా పిలిచినట్టు వచ్చావు."

"అదేమిటి, వుత్తరమా రుక్కు చేతిలోది?"

"మరేనమ్మా!"

"ఎవరు రాశారూ?"

"రాజం చెల్లాయి రాసిం దమ్మమ్మా!"

"ఏలూరిలోనే వుంటున్నాడా దాని మొగుడు?"

"ఆ, ఆ, మీదటికి మద్రాసు ప్రవేశిస్తాడు."

"ఇప్పు డెందుకు రాసిందీ రాజు?"

"ఇప్పు డేమిటి, నెల పట్టాక యిది నాలుగో వుత్తరం రకరకాలుగా– కవిత్వం కడతారుట యెవళ్ళేను! అలాగ, అదే రాస్తుందో, అతనే రాయిస్తాడో మరి, యేమిమాటలే పిన్నీ అవి? నా కూతుర్ని నేను మెచ్చుకోడం కాదుగాని, మొగాళ్ళయినా రాయలే రలాగ."

"ఏమి రాసిం దేమిటి, అంతగా మురిసిపోతున్నావు?"

"ఇప్పటికి మూడు మాట్లు చదివింది రుక్కు, నా కింకా సరదా తీరలేదు మరి, వూహించుకో ఆ సొగసు."

"అమ్మమ్మోయ్! మా చిన్నక్కా మా చిన్నబావా బజారుకి వెళ్ళారుట. అక్కడేం?...మరేం?...మా అక్కా?...ఎంతో చక్కని...అదేమిటే పెద్దక్కా?"

"నువ్విలా రా చెల్లీ! చిన్నపిల్లలు వింటూ కూచోవాలి, మాట కడ్డురాకూడదు"

"మరి నాకు కొత్తగౌను కుట్టించమంటావా, పండుగకి అమ్మని?"

"నేను కుట్టిస్తానిలా రా జానకీ, నువ్వు."

"వోయ్! వోయ్! చిన్నమ్మమ్మ నాకు కొత్తగౌను కుట్టి–స్తుం–దిట. ఇక మాట్లాడను. ఏం, అమ్మమ్మా?"

"...రాజులా కూచో నా వొళ్ళో."

"..నువ్విక చదవ్వే పెద్దక్కా!"

"సంకురాత్రికి దాని మొగుణ్ణి పిలవ మేమో అని–యిక దాని ఆదుర్దా యేమని చెప్పను? అయినా, యేమి చేస్తుందో చూద్దామని బదులు రాయనిచ్చాను కాను. మీ అల్లుడుగారిని ఇది చివరి వుత్తరం అన్నట్టు రాసింది, కోపం వచ్చింది కామోసు!"

"నన్ను కూడా వూరించేస్తున్నావు నువ్వు."

"దాని మాట లెరుగుదువుకదా, చిన్నప్పణ్ణుంచీని?"

"అయ్యో, యెరగనూ? నెల్లూరి నెరజాణ అవుతుందనలేదూ నే నెన్నో మాట్లు?"

"ఆపైని మొగుడు ప్లీడరు కూడాను."

"అవునవును, అదీని."

"ఏదీ, పిన్ని వింటుంది మళ్ళీ మొదణ్ణుంచీ చదువు రుక్కూ!"

"నువ్వు మాట్లాడకు. ఏం జానకీ?"

"ఇవాళే కుట్టించాలి మరి గౌను ఏం?"

"దీపాలు పెట్టాటప్పటి క్కుట్టించేస్తాను, సరా?"

"........."

"వినవమ్మా, అమ్మమ్మా! మహాలక్ష్మి స్వరూపురాలు మా అమ్మకి దండాలు. నాన్నగారికి నా నమస్కారాలు చెప్పవలసింది. అక్కయ్యకిన్నీ, బావ వచ్చివుంటే అతనికిన్నీ గూడా నా నమస్కారాలు చెప్పవలసింది. చెల్లాయికీ, తమ్ముడికీ నా ముద్దులు—"

"నా మాట కూడా రాసింది చిన్నక్క – కదూ అమ్మమ్మా?"

"మరే నమ్మా, రాసింది."

"ఇక్కడికి లాంఛనాలు ముగిశాయి, ఇక గొడవలు మొదలు. చదవ్వే రుక్కూ!"

"నాలుగుత్తరాలు రాశాన్నేను, వొక్కదానికీ బదుల్లేదు వింతగా వుంది. ఉడికిన్నీపోతున్నా న్నేను. మీకు కోపం తెప్పించివుంటాను లేకపోతే, యిది యిలా జరిగివుండదు అయితే, చాలాచాలా ఆలోచించా న్నేను, నా తప్పన్నా యేమీ కనపడదు, మళ్ళీ."

"విన్నావా? దీనిపే రేమిటమ్మా? ఎలాగమ్మా దీంతో వేగడం?"

"తప్పౌతుందా?"

"...ఇక్కడ నాకో చెలికత్తె దొరికింది. మా ఔటు హౌసులో అద్దెకున్న వారి రెండోకోడలు, ఆ పిల్ల. మనసు లిట్టే కలిసిపోయాయి మాకు. నిన్ననే పుట్టింటికి వెళ్ళింది. సంకురాత్రి వస్తోంది కాదూ? అందుకోసం వెళ్ళింది."

"ఆ వివరా లన్నీ యెందుకో రాయడం?"

"తాను వెళ్ళి నెలా పదిహేను దినాలు కాలేదింకా. ఆ పిల్ల వచ్చి యెన్నాళ్ళయిందో మరి? అది ముందు వెళ్ళడమే రాసింది గాని యీ సంగతి రాసిందా మరి?"

"ఆ పిల్ల అత్తవారి యింటో యెన్నాళ్ళుందో అన్నాళ్ళూ అయితే గావి, చెల్లాయిని తీసుకురావా యేమిటమ్మా?"

"ఇలా సందేహించే రాయడం మానేసిం దంటావా చెల్లి?"

"ఏమో?"

"మరి, నన్నలా అడిగావేం?"

"చెల్లాయిని విడిచి చాలా రోజు లయింది కనకా, నువ్వెదురుగా వున్నావు కనకాను!"

"ఔనమ్మా, రుక్కు సరిగా చెప్పింది. ఇక వుత్తరం చదవ్వే!"

"నిన్ను తీసుకువెళ్ళడానికి వచ్చారు కారు, మీవాళ్ళింకా. వచ్చివుంటే, నేను మావాళ్ళ యింటికి వెళ్ళడం మానేసి, మీవాళ్ళ యింటికి వస్తును, అంటూనే నన్ను విడిచి వెళ్ళలేక వెళ్ళిం దది, పాపం!"

"అవెక్కడి స్నేహాలే మామ్మా?"

"ఇంకా వినవమ్మా!"

"మేమిద్దరమూ వొక్కచోటే వుంటే యీ పండుగెంత బాగుండునో అనిపిస్తోంది, నాకున్నూ. తప్పనిసరి కావడం వల్ల వెళ్ళింది గాని – మూడు పండుగులూ వెళ్ళగానే–మొగుడితోనే వచ్చేస్తుందిట మళ్ళీ. నన్నూ అలాగే ముక్కనుమునాడే వచ్చెయ్య మని చాలా చెప్పి వెళ్ళింది. లేకపోతే, వొప్పకోదుట."

"అలాగే రమ్మంటే యేమన్నమాటా?"

"కనిపెట్టావుగదా? అదే లాపాయింటు."

"అలాగే రమ్మంటే, పండుగు వెళ్ళగానే తనలాగ మొగుడితోనే వచ్చెయ్యమని అర్థం. ఇందులో రహస్యం యేమి వుందమ్మమ్మా?"

"అంటే, చెల్లాయిని తీసుకు వస్తే చాలదు, దాని మొగుణ్ణి కూడా తీసుకురావా లన్నమాటేనా?"

"లేకపోతే, దాన్ని వొకర్తినీ తీసుకువస్తావా? చూశావా అమ్మమ్మా?"

"పోనీ, నాలుగుత్తరాలు రాసింది గదా, యెంతసేపూ తన మాటే రాస్తుంది గాని తన మొగుడి మాట రాయదేం స్పష్టంగా?"

"చిన్నపిల్ల గదా, అలా రాయగలదా సాహసించి?"

"అదేనే, మీ అమ్మ అన్నదాల్లో తప్పేమీ లేదమ్మా! దాని మొగుడు ప్లీడరు కనక, ఆ గడుసు రాత చూసి లా పాయింటు అంది మీ అమ్మ. నీ మొగుడు జమీందారు కనక, నువ్వు అలా రాస్తే టెక్కు అంటుంది, అంతే భేదం."

"ఏం, ముసిముసినవ్వులు నవ్వుకుని వూరుకుంటావేం?"

"అది మాత్రం చిన్నపిల్ల కాదుటే, చెల్లెల్ని వెనకవేసుకు వచ్చిందిగానీ?...చదువమ్మా, వుత్తరం చదువు."

"...పెద్దపండుగు, ఇక, నాలుగు రోజులే వుంది. అంటే ఆవేళా యీవేళా కాక మధ్యని రెండు రోజులే వున్నాయి."

"అయితే?"

"మాకు రాయడం యెందుకమ్మా ఆ మాటా? ఆ మాత్రం లెక్క కూడా చేతకాదా నాకు?"

"నాన్నగా రింకా రాలేదే మని అడగడం, అది."

"మరే మరే?"

"మా అమ్మ బదులయినా రాయకపోడం వల్ల చెల్లాయి అక్కడ యెంత యిదయి పోతోందో–"

"మరి నీ మాట మీ అయన యెప్పుడు వస్తాడూ?"

"మా అమ్మ నడుగు ఆ మాట."

"నాకేం తెలుస్తుంది పిన్నీ, ఆ జమీందారుగారి సంగతి?"

"ఉత్తరం రాయించావా?"

"అలా అడుగు, నిలవదీసి."

"అడిగితే నాకేం భయమా? నువ్వు న్యాయం చెప్పవమ్మా పిన్నీ! రాజం యిక్కడ లేదు కనక, దాన్నీ, దాంతో పాటు దాని మొగుణ్ణీ మేము పిలవాలి. తా నిక్కడే వుంది కదా, తన మొగుణ్ణి మేమెందుకు పిలవాలి? రమ్మని తాను రాసుకుంటే– అతగాడు వస్తే–పప్పూ అన్నమూ పెట్టి, మేము, పచ్చంచుల బట్టలు–"

"చూశావా అమ్మమ్మా? నీ పుట్టింటికి రమ్మని రాయడానికి నీకేం అధికారం వుందని అడిగితే నేనేం చెప్పగలనమ్మా?"

"పోనీ, మేమే రాస్తాం, నిజమే; కాని తాను రాయడం మానేస్తుందా? తను రాయకుండా అతగాడు వస్తాడా?"

"నే నేం రాస్తానమ్మా?"

"ఏమో, నాకే తెలుసూ?"

"అది కాదు, నేను చెబుతాను వినవే అమ్మాయీ! నువ్వు పండుక్కి రమ్మని రాస్తావు, అంతే. రుక్కు ఆ మాటే యెత్తుకోదు. ఆ అగత్యమే లేదు దానికి. మిమ్మల్ని చూసి చాలా రోజు లయింది. నాకళ్ళు కాయలు కాసిపోయాయి. వీధి గుమ్మంలో నుంచుని మీకోసం యెదురుతెన్నులు చూడ్డంతోనే సరిపోతోంది, నా పని. నాకు అన్నం సయించడం లేదు–"

"వూరుకో వమ్మా!"

"నాకు నిద్ర రావడం లేదు ఇప్పుడయినా నుంచున్న పాళంగా రాకపోతే–"

"మా పెద్దక్క బెజవాడ వెడుతుందా యేమిటి అమ్మమ్మా? అయితే, నేనూ వెడతాను. ఏమే పెద్దక్కా, తీసుకువెడతావా?"

"సెబాస్, జానకి చెప్పింది బాగుందే అమ్మాయ్"

"చూశావా? నా కూతుళ్ళ ధోరణి యిలా వుంది. తమ మాటేగాని నా గొడవ అక్కర్లేదు వాళ్ళకి. ఏం చెప్పుకోనమ్మా?"

"తప్పా తల్లీ? వాళ్ళ ఆశలన్నీ నీమీద వున్నాయి. నువ్వు కాకపోతే, వాళ్ళ ముద్దుముచ్చ ట్లెవరు తీర్చగలరు తల్లీ?"

"ఏం, అమ్మమ్మ వున్నమాట చెప్పింది. ఇప్పుడయినా వుత్తరం రాయిస్తావా, నాన్నగారితో చెప్పి?"

"నువ్వే చెప్పరాదూ, మీ నాన్న గారితోనూ?"

"చూశావా అమ్మమ్మా, మళ్ళీ?"

"దగ్గిర వుండి, మీ నాన్నచేత నేను రాయిస్తాను గానీ, యేదీ, చెల్లాయి వుత్తరం చదువు."

"...మమ్మల్నీ యేటి పండుక్కి తీసుకువెళ్ళడాని కిష్టం లేకపోతే– అంటే వీలులేకపోతే మానెయ్యవచ్చు, పట్టు బందీ లేదు. అయితే–"

"ఇక 'అయితే' అన్నమాట యెందుకూ మరీ?"

"అదే లౌక్యం. ఇంకా విను."

"ఆ సంగతయినా నువ్వు రాయవలసే వుంటుంది మాకు. ఏమంటే? ఈ

సంవత్సరం పండుక్కి, నా కోసమూ మీ అల్లుడుగారి కోసమూ కొన్ని యేర్పాట్లు చేసి మరీ వెళ్ళవలసి వుంటుంది మా అత్తగారికి. అంతే గాని, మరెందుకూ తొందరపెట్టడం లేదు నిన్ను."

"మరెందుకూ కాకపోతే, అంతస్నేహం గదా, ఆ పిల్లతోనే వెళ్ళక పోయిందీ దాని పుట్టింటికి?"

"పోనీ, ఆ మా టయినా రాయించావా నువ్వు?"

"ఏం, మరి రుక్కమ్మ కేమి చెబుతావో చెప్పవే!"

"చెప్పడాని కేం వుందమ్మా? దానితో మేము రాస్తేనే చేసుకుందా తాను స్నేహం?"

"అతికింది, జవాబు."

"ఇంకోటి కూడా వుంది చూశావూ? ఇక్కడికి రావాలనుకున్న ఆ పిల్ల, తాను ముందు వెడుతోంది గదా, రాజు నెందుకు తీసుకువెళ్ళలేదూ తనతో?"

"అవునేవ్! నాకు తోచిందే కాదు చూశావా, యీ పాయింటు?"

"ఇంకా వుందమ్మా, మరో పాయింటు."

"అదేమిటి మామ్మా?"

"రాజు మాట చెప్పు. తానిక్కడికి ముందు వస్తే తనతో ఆ పిల్లని తీసుకువచ్చును గదా, ఆ పిల్ల ముందు వెడుతున్నపుడు దాని వెంబడి తానే యెందుకు వెళ్ళింది కాదూ?"

"భేష్! చెన్నాపట్టం ప్లీడర్లు కూడా చెప్పలేరు దీనికి బదులు."

"అయ్యో, వెర్రి అమ్మమ్మా! చెన్నాపట్టం దాకా యెందుకమ్మా యీమాత్రం భాగ్యానికీ?"

"అయితే, నువ్వు చెప్పుచూతాం."

"రాజుతో ఆ పిల్ల నిక్కడికి రాకుండా చేసిందీ, ఆ పిల్లతో రాజు వెళ్ళకుండా చేసిందీ అమ్మ కాదుటమ్మా?"

"అదెలాగేవ్?"

"పోనీ, రాజుకి రాయవద్దు బదులు, ఆ పిల్లకయినా రాసిందా, అమ్మ?"

"సెబాస్! నోరు కుట్టేశావు నువ్వు. రాజే అనుకుంటే, యుక్తిలో కూడా దానికంటే పైదానవే నువ్వు. సరే గానీ, యేదీ తరవాయి చదువు."

"అయితే, మా పెద్దతోడికోడలూ బావగారూ నిన్న మెయిలుకే వెళ్ళారు. విశాఖపట్నం. మా మరిదికి మొన్న శ్రావణంలోనే పెళ్ళయింది కనక, అతణ్ణీ మా అత్తగారినీ, మా మామగారినీ, ఆడబడుచునీ పిలవడం కోసం మొన్నరాత్రే వచ్చారు, మామగారూ, చిన్నబావమరిదీనీ."

"వస్తే?"

"ఏమో?"

"పిలుపులయి పోయాయికనక యీవాళ పొద్దున్న వెళ్ళిపోయారు వారు. మా అత్తగారూ, మరిదీ, ఆడబడుచూ రేపు వెడతారు."

"వెడితే?"

"అదేమో?"

"గుడివాడే కనక, మా మామగారు వెడుతూ వస్తూ వుంటారు."

"లేకపోతే వస్తుండ మను, యెవళ్ళకేం, ఆ పెళ్ళాం గారికే లేనప్పుడు?"

"నిన్న నేనూ, మీ అల్లుడుగారూ, మా అత్తగారూ బజారుకి వెళ్ళాం. మా మరిది మామగారికీ, బావమరిదికీ బట్టలు పెట్టాలి కాదూ, అందుకోసం వెళ్ళాం. బలవంతం చేసి మా అత్తగారు తీసుకువెళ్ళారు నన్ను."

"పిలవగానే యెందుకు వెళ్ళగూడదో?"

"కాకపోయినా, లక్షపనులు చేసుకుంటారు తాము. అవన్నీ మాకు రాయడం యెందుకమ్మా, తీరి కూచునీ?"

"ఏదో వుంది, యెత్తు."

"పెద్ద యెత్తే వుంది, వినవమ్మా తల్లీ!"

"వర్తకుడు నాలుగైదు చాపులూ చొక్కాగుడ్డ తానులూ ముందు పడేశాడు."

"పడేశాడో, డబ్బు దోచుకుంటాడో?"

"వాటిలో వొక జామారు ముద్దులు మూటకడుతోంది."

"అయితే?"

"నేనే చూడకుండా వుండలేకపోయా నది. నా చేతిలో వున్నది మీ అల్లుడుగారు లాక్కున్నారు. అది విడిచిపెట్టనే లేకపోయా రాయన."

"బోధపడుతోందా?"

"హు—హు—హు—"

"అదిచూసి 'నువ్వెందుకోయ్ కొనుక్కోడం? ఈ పండుక్కి, మీ అత్తవారు, ఈమాత్రం జామారు పెట్ట రనుకున్నావేమిటి?' అన్నారు, మా అత్తగారు."

"పెడతాం మాంతాం, ఆవిడ పురమాయిం పేమిటమ్మా మాకు?"

"జాణేనేవ్ నీ వియ్యపురాలు, ఏమిటో అనుకున్నాను గానీ, నేను?"

"ఆవిడ పూజలూ పురస్కారాలూ చూసి చాదస్తం మనిషి అనుకున్నావు కామోసు పాపం, నువ్వు. అవన్నీ వాళ్ళదగ్గిర నుంచీ వీళ్ళ దగ్గిరనుంచీ అవీ యివీ వొడుపుగా లాగడానికి మార్గాలు."

"పోనీ, అలాగే కాగట్టు. వెళ్ళినచోటనల్లా పేచీలు పెడుతూ కూచోడం కంటే, వశీకరణం కోసం అయినా అమ్మవారిని పూజించడం మంచిదే గా? కాకపోయినా—పండుక్కి మీరెలాగా పెడతారు, సందేహం లేదు. అయితే, అలాంటి జామారే దొరుకుతుందన్న మాటేమిటి, మీ కీ వూళ్ళో?"

"దొరుకుతుందే అనుకో. అయితే మాత్రం? రాజు మాట చెప్పు. తన మొగుడి క్కూడా తనకి నచ్చిందే పెట్టాలన్న పట్టు బందీ యేమిటమ్మా మాకూ?"

"అదీ నిజమే!"

"అదేమి టమ్మమ్మా, నువ్వు కూడా అలా అంటావ్? అల్లుళ్ళకి పెట్టే బట్టలు కూతుళ్ళ కళ్ళకింపుగా వుండద్దుటమ్మా?"

"అవునే అమ్మాయీ! కూతుళ్ళకి మంచిమంచి చీరలిచ్చి, అల్లుళ్ళకి యేమడిగి పనికి వచ్చేవో యిస్తావుటే మరి?"

"నువ్వు కూడా వాళ్ళలోనే కూడుతున్నావు, పిన్నీ!"

"న్యాయం చెప్పడం గాని, మాతో కూడ్డమా యేమిటమ్మా యిది? నయమే!"

"నువ్వు మరీని. చెల్లాయి మొగుడికి మంచి జామారు పెడితే, నీ మొగుడికిన్నీ అలాంటిది పెట్టక తప్పదు గదా అని దాని మాటలు బలపరుస్తున్నావు, నువ్వు. ఇలా అయితే, యీ సంవత్సరం మే మల్లుళ్ళని తీసుకురానే తీసుకురాం, చూసుకో!"

"పోనీ, మానుకో, మాకోసం తీసుకువస్తోవా?"

"హొశావ్! నువ్వు మంచి జామార్లు పెట్టక పోతే మానె, సంకురాత్రి పండుగల్లో మొగుడూ పెళ్ళాలను విడతీస్తావుటే అమ్మాయీ?"

"మహా బాగా అడిగా వమ్మా.....ఏం, వూరుకుంటావేం, యేమి చెబుతావో చెప్పు, అమ్మమ్మకి?"

"మాట్టాడదు....పైగా, నవ్వుకుంటోంది, చూడవమ్మా, అమ్మమ్మా!"

"అది వొట్టి నవ్వు కాదమ్మా! అదృష్టవంతురా లయిన గృహిణి అనుభవించే ఆనందం అది, అది సరే కాని యేదీ, వుత్తరం చదువు."

"దేని కయినా మా అమ్మవు నువ్వు, నీ యిష్టం. ఆపైని నాన్నారున్నారు, పెద్దలు, మీ రిద్దరూ యేమి చేసినా మంచే చేస్తా రెప్పుడూను; కనక, మమ్మల్నీ యేడు తీసుకువెళ్ళాలని మీకు లేకపోతే యిబ్బంది లేదు."

"అలా ఆ మాట మళ్ళీ రాయడం యెందుకూ?"

"నే ననేదీ అదేనమ్మా! 'తీసుకువెడితే గాని నేను వొప్ప'నని ధరణాకూచోడం అంటావా, కాదంటావా యిది?"

"సందేహ మేం, యింకా?"

"పోనీ, అంతటితో సరిపెట్టిందా? చూడు, తరవాత యేమి రాసిందో?"

"మీకు, మమ్మల్నియేడు తీసుకువెళ్ళాలని వుండకపోతే, ఆ మాటయినా, నాన్నా రక్కరలేదు, నువ్వయినా నాకు రహస్యంగా రాస్తే—"

"రాయవు నువ్వు, తనేం చేస్తుందేమిటి?"

"రహస్యం మాత్రం యేమిటమ్మా మాకు?"

"నిజమే. చెప్పి మరీ మానేస్తారు మీరు. తనేం చెయ్యగలదంట?"

"వినవమ్మా, నా తల్లి!"

"నా డబ్బు పెట్టి నేను కొని, మీ రిమ్మన్నారని చెప్పి—"

ఆ!"

"మే మతగాణ్ణి తీసుకురాకపోయినా మేము జామారు వెల యిచ్చుకో వలసిందే నన్నమాట. ఇదేం చోద్యమమ్మా, పిన్నీ?"

"హొశావ్! ఇది నీ యిల్లు గోకేస్తుంది గాని మానదు. సంవత్సరానికి రెండుమూాడు వందలయినా మూటకట్టి వుంచాలి దీనికోసం."

"ఆ, రమ్మన్నారు తిమ్మన్నబంతికి. తతిమ్మావాళ్ళో మరీ, దానికే అంతపెడితే? ఇలాగ, వున్నదంతా ఆడపిల్లలకు పెట్టేసి, వొక్కగా నొక్క నాయన, మొగపిల్లాణ్ణి పాడుచేసుకోనా?"

"మాకు పెడితే తమ్ముణ్ణి పాడుచెయ్యడం యెందు కవుతుందీ? అదేమిటమ్మమ్మా, మా అమ్మ అలా అంటుందీ?"

"కాదే అనుకో. మా యింటి కతనువస్తే – అంటే మేము తీసుకువస్తే సుమా– మాకు తోచినకాడికి మేము పెడతాంగాని, యిదేం ముడుపా?"

"నిజమే. ఇది కొత్తపద్ధతి."

"ఇందులో వున్న కిటు కేమిటో కనిపెట్టలేక పోయావు నువ్వు."

"ఇంకేం వుందే?"

"కూతుళ్ళను పండుక్కి తీసుకువచ్చి, వున్నకాడి కేదో పచ్చంచుల బట్టలు పెట్టడం వుంది, లోకంలో. అల్లుళ్ళ కిన్నీ పెట్టి తీరాలన్న నిర్బంధం లేదెక్కడా."

"అవును, అయితే?"

"అసలు, తననే తీసుకువస్తామో తీసుకురామో అన్న స్థితిలో, తన మొగుడికే ముందు కొనిపించేసుకుంటే?"

"మరేనేవ్! ఎంత యెత్తెత్తిందే, మొన్నటిపిల్ల, రాజు."

"పెద్దదాన్ని చూడూ, యెలా నవ్వుకుంటోందో? అంతా గూడుపుఠాణీ."

"నవ్వుకుంటోం దంటే తప్పా? పట్టుకు వెళ్ళతగ్గవాళ్ళు కారూ వాళ్ళు, మరీ?"

"పట్టుకు వెడితే, యిలాగటమ్మా?"

"అయితే, అమ్మాయీ! ఇప్పటికీ తెచ్చుకుంటూనే వున్నావు కాదుటే నువ్వు, నీ తమ్ములతో పోరి, యేటాను?"

"మహాబాగా అడిగా వమ్మా!"

"అడగ మను, నాకేం భయమా? నా మరదళ్ళు తెచ్చుకోడం లేదూ? అలాగే నేనూ తెచ్చుకుంటున్నాను."

"రేపు పొద్దున్న నీ కోడలు తెచ్చుకోదూ? నువ్వూ తెచ్చుకుని – నీ కోడలు తెచ్చుకుని– మధ్య నీ కూతుళ్ళా చేతకాని వాళ్ళు? బాగుందేవ్!"

"చేతకానివాళ్ళా? ఆ వుత్తరం చూశావా? నే నెప్పుడయినా రాశానా, మా అమ్మ కలాగ?"

"నువ్వు రాసేదాకా వూరుకుందా మీ అమ్మ?"

"మళ్ళీ అడుగు, గట్టిగా అడుగు."

"అదేమిటి పిన్నీ, వాళ్ళ నలా వూసుకువస్తావూ? వాళ్ళు దగ్గిరా నేను దగ్గిరా నీకు?"

"నువ్వే దగ్గిర."

"ఇంకేం?"

"కానీ–"

"ఇక కానీ యెందుకూ?"

"అసలు కంటే వడ్డీ ప్రియం అని సామెత కనక, నువ్వు నా కూతురి వయితే, వాళ్ళు నా కూతురి కూతుళ్ళు కనక, వాళ్ళే దగ్గిర నాకు."

"ఉన్నమాట చెప్పావమ్మా, నువ్వు ధర్మదేవత వమ్మా, నీకు దణ్ణమమ్మా!"

"వోస్ ధర్మదేవతటు ధర్మదేవత! మా పిన్ని నా పక్షం అయితే దణ్ణం గిణ్ణం పెడుదువేం నువ్వు?"

"ఇంతెందుకూ, వొక్కటి చూడు అమ్మాయీ!"

"ఏమిటది?"

"ఇప్పుడు నేను నీకో కమలాఫలం యిస్తా ననుకో."

"ఇస్తావు."

"నువ్వది అనుభవించ గలవా?"

"నావల్ల కాదు సుమా!"

"మరేం చేస్తావూ?"

"నా బిడ్డలకు పెట్టుకుంటాను."

"అప్పుడు నా కెలా వుంటుంది?"

"పరమానందంగా వుంటుంది."

"కనక, నీ బిడ్డలు దగ్గిరా నాకు, నువ్వు దగ్గిరా?"

"ఇంకేం చెప్పగలనమ్మా నేనూ?"

"నువ్వు చెప్పడం యెందుకమ్మా నాకూ?"

"నాకంటే నా కూతుళ్ళే దగ్గిర అయితే, నీ మనమరాలి వుత్తరమే విను, పోనీ!"

"ఏది రుక్కూ, చదువు."

"ఉండు. ఇంతకీ, అంత తొందర యెందుకో తెలుసా?... చదవ్వే అమ్మాయీ!"

"ఆలస్యం చేస్తే, ఆ చాపు మరెవ రయినా పట్టుకుపోవచ్చు అందుకు నా ఆందోళన."

"శా—బా—సు!"

"అలా అయితే అతడు కొనుక్కోవాలి. కాదంటే, ఆశ రేకెత్తించింది కనక, తల్లి కొని యివ్వా లతనికి. తన కెందుకమ్మా, ఆ పురపురా?"

"ఈమాట వెంకుసోదెమ్మ అత్తగారికే రాయి నువ్వు తప్పేం?"

"అయితే, నా మాట పుచ్చుకునే కొనుక్కుంటున్నారా, చెల్లాయి అత్తవారూ, నీ అత్తవారూ కావలసిన వన్నీని? ఏమే పిన్నీ?"

"అవును గానీ—యిది అలాంటిది కాదు గానీ—"

"ఇది రావలసిందే గాని కావలసింది కాదుగా? కదుటమ్మా అమ్మమ్మా?"

"అవునేవ్! మరి నీ కూతురికి బదులు చెప్పు, చూతాం."

"అవును గానీ—ఇది అలాంటిది కాదు గానీ—"

"అదేమిటి?"

"మళ్ళీ అదేమి టేమిటి? నీ కూతురికి నువ్వు చెప్పినట్టు లేదేం నా కూతురికి నేను చెప్పింది?"

"మీ అమ్మ వాలకం చూశావుటే రుక్కూ?"

"నీ వాలకం మా అమ్మకి వచ్చింది, మా అమ్మ వాలకం మాకు వచ్చింది, చూడ్డాని కేం వుం దమ్మమ్మా?"

"నీ పెద్దకూతురి ధోరణి చూశావుటే అమ్మాయీ?"

"నా చిన్న కూతురి ధోరణి చూడ్డం అయింది కనకనా, అప్పుడే నా పెద్ద కూతురు దాకా వెడుతున్నావు, మరి?"

"అవునవును, ఏదీ, చదువు రుక్కూ!"

"వెల యెంతో విన్నావా?"

"అది కూడా రాసిందీ?"

"ఏమి చెప్పకోనే మా తల్లీ? చదువు రుక్కూ!"

"...మీ అల్లుడుగారి వుబలాటమూ, నా ఆదుర్దాచూసి 'వెల యెంత?' అనడిగారు, మా అత్తగారు. వియ్యంకుడుగారికి కొన్న జామారు లాగ యే పది రూపాయలకో వస్తుం దనుకున్నారు, పాపం ఆవిడ. 'యాభయ్యో అరవయ్యో వుంటుందేమో బాబూ' అని నేను పితపిత లాడిపోయాను. ఇంతా చేస్తే, ముప్ఫయి రూపాయలు చెప్పాడు వర్తకుడు. పాతిక రూపాయల కిస్తే మనకి లాభం. మరో రెండో మూడో యిచ్చినా నష్టం లేదు. సరికొత్త రకంకనక, మీ అల్లుడుగారు మనసుపడుతున్నారు కూడా కనక, ముప్ఫయి రూపాయిలూ యిచ్చినా యెక్కువనిపించదు."

"ఆహో, ఆహో, యెంత చక్కగా తేల్చిందే లాభనష్టాలు? మీ చాతుర్యమే నా తల్లీ?"

"డబ్బిచ్చేవాళ్లు మరొకళ్ళయితే, మరో పది యిస్తే ధర్మంగా కూడా వుంటుంది, కదుటే పిన్నీ?"

"మహా బాగా చెప్పావు. ఏదో సామెత చెప్పిన తరవాయిగా–"

"ఇంకా వినవమ్మా, అప్పుడే అయిందా?"

"నిజం చెప్పవద్దూ? నా మట్టుకు నాకు, లెక్కలు చూసుకుంటే వెల యెక్కువే అనిపిస్తోంది. అయితే, ఆ చక్కదనమూ, ఆ కొత్తదనమూ చూస్తే తక్కువే అనిపిస్తోంది, మళ్ళీ."

"ఇందాకటికంటే బాగుందీ ధోరణి. సెబాస్!"

"ఆ రాత దగ్గిర కవిత్వం యెందు కయినా పనికి వస్తుందా, దీర్ఘాలు తియ్యడానికీ, రాగాలు పెట్టడానికీ గానీ?"

"రాగాలు తియ్యడమే కనపడుతుంది గాని, వొక్క అక్షరమయినా తెలుస్తుందా, బాగుండడానికీ బాగుండక పోవడానికీని."

"అవునవును."

"....తప్పటడుగులు వేసుకుంటూ తమ్ముడు మసులుతూ వుంటే మన యిల్లెంత శోభాయమానంగా వుంటుందో ఆ జామారుతో ఆ షాపు అంత దేదీప్యమానంగా వుంది!"

"ఆ, ఆ!"

"ఇంకా వినవమ్మా మా తల్లీ!"

"మీ అల్లుడుగారు వుభయపింజలూ పోసి కట్టుకుంటారు కనక, అప్పుడది మరీ సొగసుగా వుంటుంది."

"వోహో, వోహోహో!"

"అతగా డది కట్టుకుని యెదుట నుంచున్నట్టు తోపిస్తోంది, చూశావా దాని శక్తి?"

"కనక, కొనమ్మా, కొను. పిల్లల వుబలాటం తీర్చకపోతే పండుగ చేసుకున్నట్టే వుండదు, శ్రమే గానీ."

"సరే, నువ్వింకా మారుదారినే వున్నావు."

"అంటే?"

"నేను కొనడం యేమిటమ్మా, యింకా కూచుం దనుకున్నావా యేమిటది, ఆ షాపులో?"

"నువ్వనే దేమిటో నా కర్థం కావడం లేదు, తరవాత యేమి రాసిందో చదువు రుక్కూ!"

"ఆ జామా రింటికి తెచ్చుకోడమా, దానితో పాటు తామూ షాపులో వుండిపోడమా అన్న అవస్థలో పడ్డారు, మీ అల్లుడుగారు. 'వెళ్ళిపోదాం రండర్రా' అంటూ వొకటే తొందర ప్రారంభించారు మా అత్తగారు. ఒక్క క్షణం నాకు మతిపోయింది. చూశాను చూశాను, నువ్వు నన్ననుగ్రహించకపో వన్న ధైర్యంతో జామారు చేతపుచ్చుకుని 'డబ్బిచ్చేస్తాను. మీ మనిషిని పంపండి మా యింటికి' అని వర్తకుడికి చెప్పి, కారెక్కేశా న్నేను, చివరికి."

"చూశావా, చూశావా?"

"చూశావా అంటే అంతకంటే మరేం చెయ్యగలదమ్మా, చెల్లాయి అప్పాడమ్మమ్మా?"

"చూసేం చేస్తుం దమ్మమ్మ, నాకు తెలుసు, నువ్వే నేర్పావు దానికి."

"అదేమిటో ఆ గొడవ కూడా కాస్త నా చెవిని పడెయ్యవే అమ్మాయీ!"

"తన మొగుడికోసం తనకి నచ్చిన జామారు కొనుక్కువచ్చింది నిరుడిది. దీన్ని చూసి యీ సంవత్సరం అదీ చేసిందాపని. తోడిదొంగలు వీళ్ళు!"

"అవునా?"

"నిజమే నమ్మా! అసలేమి జరిగిందో విన్నావా?"

"నువ్వు చెప్పావా?"

"మాకు నచ్చిన చీర లేరుకోమని నన్నూ చెల్లాయినీ బజారుకి తీసుకు వెళ్ళారు నిరుడు నాన్నారు. మేము చీర లేరుకొన్నాక, అల్లుడుగారికి జామారు కూడా నన్నే యెంచుకోమన్నారమ్మా!"

"ఇంకేం? నువ్వెంచుకున్నావు, తప్పు మీ అమ్మది కాని, నీది కాదమ్మా?"

"నా తప్పేమి టమ్మోయ్, మధ్యని?"

"మరి నువ్వెందుకు వెళ్ళావు కాదూ, బజారుకి?"

"తండ్రి వెళ్ళారు కనక సేలం పట్టు చీరలతో సరిపెట్టారు వీళ్ళు, నేనే వెడితే, బెంగుళూరి చీరలు చంకన పెట్టుకుందురు."

"ధర్మమే. తల్లికీ తండ్రికీ వున్న భేదం అదే కాదూ మరీ? అయితే లే, యీ సంవత్సరం కొనమ్మా, బెంగుళూరి చీరలు, మాట తేనే తెచ్చావు కనక."

"నూటొక్క దణ్ణాలు నీకు. మా అమ్మకి మళ్ళీ మళ్ళీ చెప్పు, ఆ మాట నువ్వు."

"నేను చెప్పనక్కరలేదే వెర్రిపిల్లా! మీ అమ్మకి తెలిసినట్టెవరికి తెలుసూ, అందచందాలు మన వాళ్ళలో?"

"అందాల కెక్కడికి పిన్నీ? మీ అల్లుడుగారు సంచులకు సంచులు సంపాదించి పోస్తున్నారు కనక, తాళాలు కూడా నా చేతి కిచ్చేశారు కనక, అందాలు చూపించ గలుగుతున్నాన్నేను. రాజుమాట చెప్పవమ్మా?"

"చెప్పడాని కేం వుందే? మొగుడి క్కూడా జామా రెంచుకోమని రుక్కుకి చెప్పిన నీ మొగుడు రాజుని మాత్రం యెంచుకోమనడూ? ఇలా అనుకుని అది సాహసించింది. నిక్షేపంలా వుందది చేసిన పని."

"మొదణ్ణుంచీ వాళ్ళపక్షమే మాట్టాడుతున్నావు, నువ్వు."

"వోసే, అమ్మాయీ! నన్నంటావు గానీ, వాళ్ళపక్షం కాకుండా వుండగలవా, నువ్వు మాత్రం?"

"అమ్మబాబోయ్! ఊరికే అన్నాను గానీ, నే నుండగలనా? నా కూతుళ్ళ వంటి కూతుళ్ళున్నారా, పృథివి మీద మరెవరికయినా?"

"అదిమాత్రం నే నొప్పుకోనుసుమా!"

"అదేమిటమ్మా?"

"మరి, నా కూతురువంటి కూతుళ్ళు మాత్రం—"

"వోస్, అదా? మా అమ్మకంటె ఎక్కువ యిదిగా చూస్తావు నన్ను నువ్వు. మా అమ్మ యెక్కడో నెల్లూరిలో వుండినా నువ్విక్కడ వున్నావు కనకనే నేను బతగ్గలుగుతున్నాను."

"నా తల్లి నా తల్లి, నీకేమీ లోటు లేదమ్మా! జమీందారు వాళ్ళు కూడా నిన్ను పోలరమ్మా! నీ కూతుళ్ళు గూడా అచ్చంగా నీలాగే వుంటున్నారు తల్లీ!"

"రాజు అలా వుత్తరం రాసిందంటే యెందుకు రాసిందీ? తన వుబలాటమూ, చనువూ చూపించుకుంది గానీ—"

"కనక, తొరగా వుత్తరం రాయించెయ్యి, అల్లుళ్ళకి."

"ఉత్తరా లెందుకమ్మా, మీ అల్లుడుగారు తొమ్మిది గంటల బండికి వెడితేనూ?"

"కాకినాడ వెళ్ళా రన్నావు, నాన్నారు?"

"కాకినాడ కాదమ్మా, బెజవాడ!"

"చూశావా, నా దగ్గిర దాస్తావా?"

"ఈపాటికి బెజవాడ చేరుకుంటారు మీ నాయన. నీ మొగుణ్ణి వెంటబెట్టుకుని రాత్రిబండిలో యేలూరు వస్తారు. చెల్లాయినీ మరిదినీ కూడా వెంటబెట్టుకుని రేపు మెయిల్లో యిక్కడికి వస్తారు, నే నేం దాచానే? దాచడాని కేం వుందమ్మా యిందులో?"

"కాకినాడ అని———"

"నే నన్నానా యేమిటి? బెజవాడ అనపోతే కాకినాడ అని వచ్చింది కామోసు మాట. నాకు జ్ఞాపకం లేదు సుమా!"

"మీ అమ్మ కాకినాడ అంటేం, బెజవాడ అంటేం. రేపు మెయిల్లో నీ మొగుడిక్కడికి వస్తున్నాడు, సరా?"

"........."

"మీ అమ్మా బెంగుళూరి చీరలు కూడా కొని పెడుతుంది, సరా?"

"అవునుటే అమ్మా, చెప్పవ్? చూశావా అమ్మమ్మా?"

"నీకూ చెల్లాయికీ సమంగా యిమ్మని మూడు వందలిచ్చారు మీ నాయన చేతికి. మీ యిష్టం వచ్చినవి కొనుక్కోండి తల్లీ!"

"ఇష్టానిష్టాలు మేము చెబుతాం, కొనడం మాత్రం నువ్వే అమ్మమ్మని కూడా తీసుకువెడదాం బజారుకి."

"వస్తానమ్మా, నేనూ వస్తాను, ఇంతకంటేనా? ఇంటో కూచోలేక యిట్టే వచ్చినందుకు మంచిమాటలే చెవినపడ్డాయి. మరి పోతా......"

"కాస్సేపు కూచోవే మా తల్లీ!"

"కూచోను, కూచోను. మావాణ్ణి పండక్కి పిలుచుకువెళ్ళడానికి బావమరిది వచ్చాడు. మిరాయి పొద్దున్నే చేయించి వుంచాను గాని, యింకా–కాఫీ–అదిగో మూడు కొడుతోంది–బాబోయ్! నా కొడు కేం కంగారు పడిపోతున్నాడో..."

"ఇదిగో, మళ్ళీ వస్తావు కాదూ, సావకాశంగానూ?"

"..........."

"ఏమిటీ పిన్ని అంటోంది, నీ కయినా వినపడిందా తల్లీ?"

"ఏమిటో భోజనం చేశాక అంటోంది, రాత్రో రేపు మధ్యాహ్నమో మరి"

"చిన్నమ్మమ్మ నాకు గౌనూ పరికిణీ కుట్టించకుండా వెళ్ళిపోయింది, చూశావుటే అమ్మా?"

"బుల్లిమామయ్యతో చెప్పా వెళ్ళి.....తొరగా వెళ్ళు."

*(1934 ఫిబ్రవరి 'ప్రబుద్ధాంధ్ర' నుంచి పెంపకం)*

★ ★ ★

# ముళ్ళచెట్టూ కమ్మనిపువ్వూనూ

"అబ్బాయీ, పెద్దముండనాల్గే పేలించక యీపాటికి కాస్త కూకలేసుకో. ఎంతటివాళ్ళయినా లోకానికి కసింత వెరవాలి."

"ఏమి వచ్చిందమ్మా యిప్పుడు?"

"నన్నడుగుతున్నావా కోడై కూస్తూ వుండగా?"

"పైవాళ్ళ మాటలు నువ్వు చెప్పినంత నిర్ధారణగా వుండవుగా?"

"అప్పయితే నేనే చెబుతాను. నాకేం చెప్పక? అయితే, యెన్నని చెప్పను?"

"ఉండడమే వస్తే ఉన్నవన్నీ చెప్పాలి."

"ఉండడమే వస్తే అంటే? ఉన్నాయనా లేవనా?"

"నేను చూశానా?"

"చూడనూ చూడక, విననూ వినక మరేమి చేస్తున్నావూ?"

"ఉదయం పది కాకుండానే ఆఫీసుకి పోవాలి గదా—"

"గౌరవం గంగలో కలిసిపోతూ వుంటే నువ్వది కాపాడుకోవద్దూ? ఆఫీ సెక్కువా, కుటుంబ గౌరవం యెక్కువా?"

"నువ్వు చక్కబెట్టవలసినదానవు కాదా, పోనీ అంటే సంగతి సందర్భాలు నాకు చెప్పవలసిన పూచీ నీకు లేదా?"

"నువ్విలా వెనక వేసుకువస్తూ వుంటే అది నన్నిక లక్ష్యపెడుతుందా?"

"జరిగిందేమిటో చెప్పమంటే సోది మొదలు పెడతావేమిటమ్మా?"

"నా మాటలు సోదికిందే కట్టేశావు గదా? బాగుంది నాయనా?"

"సోది కాకపోతే మరి జరిగిపోయిన అకార్యకరణం యేమి టయినట్టు?"

"ఒక్కటనా రెండనా చెప్పడానికి?"

"ఉన్నవన్నీ చెప్పు, కొన్ని విడిచిపెట్టటం యెందుకూ?"

"నీకు మానాభిమానాలే వుంటే వొక్కటి చాలదూ. నా వెఱ్ఱికానీ?"

"........"

"విన్ననడం యెందుకూ? ఈ దినా లలాంటివి. పూర్వకాలపు మనిషిని నే నెంత మొత్తుకుంటే మాత్రం యేమిషీ?"

"ఏమి జరిగిందో చెప్పలేవు. ఊరుకోనూ లేవు."

"చెప్పలేకపోడం ఖర్మం యేమీ? చూసిందీ విన్నదీ చెప్పలేకపోడానికి నేనేం కల్పన చెయ్యాలా? క్షణానికో క్షణానికో బూడిద అయిపోయేదానికి నా కెందు కనిగానీ—కళ్ళారా చూస్తూ వూరుకోలేకా యీ పాట్లు. మాటిమాటికీ నువ్వు చెప్పుదెబ్బలు కొడుతూనే వున్నావు. అయినా, కన్నకడుపు. బిడ్డలున్న వాళ్ళకే

గాని నా యాతన బోధపడదులే. నువ్వెంత తీసిపారేస్తూ వుండినా, నీ కపకీర్తి వస్తూ వుంటే చూడలేకుండా వున్నాను, కనక, నువ్వు నన్నిలా అనవలసిందే. ఎందుకులే? పడ్డవాళ్ళెప్పుడూ చెడ్డవాళ్లుకారులే."

"అందరూ అంతేనా?"

"ఏ కర్మమూ యెరగనివాళ్ళంతే!"

"ఎరిగినవాళ్ళెవరో, ఆ యెరిగివున్న దేమిటో చెప్పరాదూ?"

"మేలుకునేవుండి కళ్ళు మూసుకున్నవాళ్ళని లేపడం యెవరితరం నాయనా?"

"........."

"పీసపాటి వారి యింటో పుట్టాను, కల్లూరివారి యింటో పడ్డాను. రెండూ కూడా వోహో అనిపించుకున్న వంశాలే. అంచేతకాని, కులం తక్కువదాన్నయితే నాకీ గుంజాటన యేం?"

"ఇక్కడ కులం తక్కువ వాళ్ళెవరూ?"

"ఎవళ్ళయితే మాత్రం నా కెందుకూ?"

"ఇంకేం? అలా అని మనస్సుకి సమాధానం చెప్పుకో. ఎప్పుడేమని పోతారో అని కుర్రాళ్ళు భయపడేలాగ–"

"నేనదే చెబుతున్నాను."

"నువ్విలా తొందరమాట లంటూవుంటే ఆ మర్యాదా నిలుస్తుందా మరి?"

"నిలిచేచోట నిలుస్తుంది. నిలిపేవాళ్ళు నిలుపుతారు. మర్యాదా అక్కర లేనివాళ్ళూ, అదేమిషో యెరగనివాళ్ళూ యేమి నిలుపుతారూ?"

"అయితే, మర్యాదా కలవాళ్ళు లేనివాళ్ళతో సరిగా వెళ్ళవచ్చునా?"

"పై వాళ్ళయితే నువ్వన్నట్టే; కాని సంబంధం వుంది కదూ? బతికి వుండినంతకాలమూ వొక యింటోనే మగ్గిపోవాలి కదూ? లేకపోతే వొకళ్ళ గొడవ నాకేం?"

"........."

"నా కొంపకి ముప్పు వచ్చి నే నేడుస్తున్నాను గాని–"

"నిండింటో కూచుని నువ్విలా అనవచ్చునా అమ్మా?"

"అనక యేం చెయ్యను? మాలకూడు తినమంటావా?"

"........."

"సానికొంపా సంసారి కొంపా యిది?"

"........"

"మొగవాడు అనాథ అయితే ఆడది నడివీధిలో బాగవతం కడుతుంది, అబ్బురమా?"

"అమ్మా, అరికాళ్ళకింద మంటలు పెట్టేస్తున్నావు."

"నా మాట నీ కంత కష్టంగా వుందా నాయనా? ఇదిగో, లెంపలు వాయించుకుంటున్నాను. అపరాధం వచ్చింది, క్షమించు."

'బుద్ధి గడ్డితిని విన్ను కదిపాను, ఇక కిక్కురుమంటే అడుగు."

"........"

"ఇంకోమాటీ గొడవ తెస్తే చెప్పుదెబ్బలు కొట్టు."

"... ..."

"మంచికి రోజులా నాయనా యివి? పెళ్ళాంగారు వచ్చాక యిక తల్లిముండ యెందుకూ?"

"........"

"మంచీ చెడ్డా తెలుసుకోడానికీ, కీర్తీ అపకీర్తీ గుర్తించుకోడానికీ, యెవళ్ళని దిద్దుకోవలసినట్టు వాళ్ళని దిద్దుకోడానికి యెంతటివాళ్ళు కావాలి నాయనా? మొగాడయి పుట్టగానే సరా, చదువుకోగానే తీరిందా?"

"ఎన్నేళ్ళు నిండితే యేమిటి - సిగ్గూ భిడియమూ లేకపోయాక? ఇంతకీ దేవుడు నా గొంతుక్కోశాడు. ఆ మహారాజుని వుంచేసి నన్ను తీసుకుపోరాదూ? నాకీపాట్లు లేకపోవునే?"

"అమ్మా, యిందాకణ్ణుంచి సాధించేస్తున్నావు; పేగులు తోడేశావు కాని; వొక్క తప్పు చూపించలేకపోయావు."

"అవునోయి నాయనా! నువ్వింతవాడ వైనాక యింకా నోరు తెరిచి- అయ్యో, నా బతుకా?"

"........."

"నా గ్రహచారం కాకపోతే వెంకుసోదెమ్మతో నేను కాశీ వెళ్ళిపోయి వుండనూ?"

"........"

"దిక్కుమాలిన జన్మ, నాకు కాశీవాసం కూడా లభిస్తుందా? ఎంత పాపం చూడాలో, యెన్ని కుళ్ళు మాటలు వినాలో, యెన్ని తిట్లు తినాలో, యెన్ని చెప్పుదెబ్బలు పడాలో, అప్పుడే అయిందా?"

"......"

"ఎవళ్ళు చేసుకున్న దెవళ్ళనుభవిస్తారూ?"

"చెప్పవలసిందీ, చెప్పేదీ యేమయినా వుందా - యింతేనా అమ్మా?"

"ఉంటే మాత్రం యేమి లాభం నాయనా? ఇప్పటికయినా అభిమానం వచ్చిందేమో అనుకున్నా, నంతే చివరికి రొష్టు నాకా? నలుగురి నోళ్ళలోనూ పడిపోడం నేనా? అడ్డమైన కుంకలూ నాకు చక్కట్లు దిద్దరావడమా?"

".........."

"ఇంతకంటే యీ కొంప బాగుపడి యేడిస్తేనా?"

"ఇక నే నాఫీసుకి వెళ్ళిపోవచ్చునా అమ్మా?"

"వెళ్ళవచ్చు నాయనా, నిశ్చింతగా వెళ్ళవచ్చు. కళ్ళు మూసుకుంటే సరీ. మొండివాడు రాజుకంటే బలవంతుడుష!"

"హు!..."

"ఓస్! దాని పేరు పౌరుషం కామోసు. ఇలాంటి వాజమ్మలకే అలాంటిది? గడ్డి తిన్నట్టు తిని, కుడితి తాగినట్టు తాగి - వుందనా లేదనా? పూర్వపువాళ్ళు ఇంత మట్టీ సంపాదించి పోయారుకదా?"

## 2

"ఏమి వచ్చిందేమిటి?"

"........"

"అంతగా వెక్కి వెక్కి యేడవ్వలసినంత పనేం జరిగిందేమిటి?"

"........"

"నాతో చెప్పకపోతే యెలాగా?"

"నోటితో చెప్పాలా సగం చచ్చి వుండీ కూడా?"

"చెప్పకుండానే తెలుసుకోవచ్చు ఇంటో వుంటే. అయితే, యెంత దుఃఖ కారణం యేర్పడ్డా కొంచెం సమాళించుకోవాలి, బొరుమని యేడవడం ప్రయోజకత్వమా?..."

"నామీద చెయ్యి వెయ్యకండి. నేను మాదిగదాన్ని. సానిపాపని."

"ఇష్టాలు లేనప్పు డెన్ని మాటలయినా వస్తాయి. అయినా—"

"నే నేమయినా అన్నానా?"

"నువ్వే అన్నా వనలేదు."

"ఇద్దర్నీ సరిచేస్తున్నారా?"

"ముందు కజ్జాకి సిద్ధపడ్డ కొంకనక్కని చెప్పుదెబ్బలు కొడతారా మీరు?"

"........"

"పోనీ, ముందు నేను తగవుపెట్టడం యెన్నడయినా యెరుగుదురా మీరు?"

"........"

"నే నిక వేగలేను. నేను బతికి వుండాలంటే నా కేదయినా దారి చూపించండి."

"....ఒక్కటే దారి"

"గోదారి కదూ? మీరలా అనక మరేమంటారు?"

"ఇంతకీ, జరిగిం దేమిటి?"

"మీరు వినకుండా వున్నారా? నిజంగా మీకు తెలియకుండానే వుందా?"

"నీ కష్టాలు వినలేదు కాదూ?"

"నా కష్టాలు వినాలని వుందా?"

"........"

"అవును, పెట్టిపుట్టందే సుఖా లెలా వస్తాయీ?"

"రామరామా! ఇంత దిక్కుమాలిన బతుకయిపోయిందా నాది?"

"చెప్పవు కాదూ?"

"బందరు వుప్పెన. రావడానికి మరేం వుంది, చెప్పడానికి మాత్రం కొత్తగా యేమి వస్తుంది?"

"ఎందుకు వచ్చిందీ?..."

"నా చెయ్యి వదలండి. నేను బతికి వుండడమే కారణం. మరేం వుంటుందీ కారణం?"

"నా కర్మం కాలిపోయింది. నా అవస్థ యింతట్లో తీరేదీకాదు, మానేదీ కాదు. తెల్లపోయి అలా కూచుంటారేం? కాఫీ చల్లారిపోతుంది, పుచ్చుకోండి. తొరగా వెళ్ళకపోతే అవతల మాటపడాలి, లేవండి."

"లేచి యేమిటి చెయ్యడం? ఇంటో యిలా రవులుతూ వుంటే నోటికి పోతుందా కాఫీ అయినా?"

"నన్నేనా - అందర్నీ అడుగుతారా ఆ మాట?"

"అడగవలసిన మనిషి నడుగుతాను. అడిగితే గ్రహించుకోగల మనిషి నడుగుతాను. తాబట్టిన కుందేటికి మూడేకాళ్ళనే వాళ్ళని అడిగేం లాభమూ?"

"అయితే, యిక నా గతి యింతే?"

"వోపిక పట్టు, అపదలు కాపరాలు చెయ్యవు."

"చాల్లెండి నేర్చుకుపోయారు - మీ వేదాంతాలూ మీరూను. ఇప్పుడేనా మీరు 'యింటో యిలా రవులుకుపోతూ వుంటే నోటికి పోతుందా' అనడిగారు? పైనున్న మీకే అలా వుంటే, ఆ రవులుకుపోయేవాళ్ళ కెలా వుండనూ? నల్లేరు మీద బండిలాగ వస్తూవుంటే దిక్కులేనివాళ్ళ కెలా వుండనూ?"

"........."

"అయ్యో, నీకింత గండకత్తెర వచ్చిందా అని వోదార్చడానికయినా తగనూ నేనూ?"

".........."

"నా వాళ్ళేవరూ దగ్గిర లేరనా యీ లోకువ?"

"నే నేమి పాపం చేశానూ? నా వాళ్ళుమాత్రం యేమి లోపం చేశారూ?"

"......."

"పెళ్ళిలో అడిగినంత కట్నమూ, కోరినన్ని లాంఛనాలూ గుమ్మరించలేదూ? అయిదు రోజులూ మొగాన కాసులు కొట్టలేదా, యెదాన చీరలు పెట్టలేదా? తానేమి చేసినట్టూ తన బతుక్కి?"

"........"

"పెళ్ళిలోనే మొదలు పిడిపించడానికి. ఊరంతా ముక్కుమీద వేలు పెట్టుకున్నారా రాగతనం చూసి. ఒక్కపూటయినా సంబరపడుతూ భోజనానికి వచ్చిన పాపాన పోతేనా? తిన్న అన్నం వంటపట్టనిస్తేనా?"

"కార్యం నాటికి మూలపడ్డా పులుసు విరగలేదు. ఒక్కటే ధోరణా జన్మ అంతా?"

"........"

"నన్ను చూస్తే అంత చిమచిమలాడిపోతాయేం కళ్ళు? నేనేం విషం పెట్టాననీ?"

"........"

"తనకి నావంటివాళ్ళు లేరూ? అంతకంటే నేనే విధంగా చెడ్డానూ? అడిగే వాళ్ళులేకగాని తన ఆశవంటి ఆశకాదూ అందరిదీ?"

"నా కేసి చూడూ!"

"నే నేడుస్తూ వుంటే చూడాలని వుందా?"

"

"అంత రాసి రంపాన పెడితే అదెలా బతుకుతుందని అడక్కూడదూ?"
"ఇదివరక కడగలేదూ?"
"నింపాదిగా అడిగితే మర్యాదా తక్కించుకునే వాలకమే అది?"
"కన్నతల్లి—"
"చేసుకున్న పెళ్ళాన్నయితే కోసి కొరత వెయ్యవచ్చు, కదూ?"
"నాభిదగ్గిర నుంచి వచ్చిన మాటేనా అది?"
"నపాళం అంటుకుంటూ వుంటే నాభి లెక్కేమిటండీ? అటేడూ, యిటేడూ— పధ్నాలుగుతరాల నా వాళ్ళు దిక్కుమాలినవాళ్ళయిపోతున్నారు, మరి, తనవాళ్ళు?"
"ఎలాగో వొరగతోసుకు వెళ్ళకపోతే—"
"అయ్యో, నా బతుకు తెల్లవారిపోతే యింకా వొరగతీసుకుపోడం యెలాగండీ?"
"ఇదివరకటిలాగే—తప్పు నీమీద లేకుండా—"
"ఇంకేం? తప్పు నాది కానప్పుడంత మీదమీదకి రావడం యేమి?"
"మళ్ళీ మొదలా?"
"మళ్ళీ యేమిటి, యెప్పటికప్పుడే మొదలు. ఎప్పటికయినా అంతం అంటూ వుంటేనా?"
"అలా అనకు."
"వొళ్ళు మండుకుపోతూ వుంటే అనక ముద్దు పెట్టుకుంటానా? ఎన్నాళ్ళనీ వోపికపట్టడం?"
"    "
"నావాళ్ళ వూసెత్తడానికి తనకేం అధికారం వుందీ?"
"ఊరుకోవూ?"
"నా తమ్ముడు రేపు పెద్ద కలెక్ట రయిపోతాడు, సీమవెళ్ళిన వాళ్ళెవరయినా పుచ్చి పోయారా? తనవాళ్ళే సీమ వెళ్ళగలిగివుంటే తా నిక కిందా మీదా వుండునా?"
"......."
"నావాళ్ళెవళ్ళూ రెయిళ్ళలో టిక్కట్లు వసూలు చెయ్యడం లేదు, తెలుసా?"
"నన్నయినా చూడవూ?"
"మిమ్మల్ని చూస్తున్నాను కనకనే నా తిప్ప లిలా వున్నాయి. తనతో సరిగా నేనూ తూర్పారబట్టేదాన్నయితే నా కీ గతేం?"
"ఇంకేం మరీ? వోపిక పట్టడం తప్పదని నీకే తెలిసినప్పు డీకాస్తామాత్రం యెందుకూ?"
"మరే!"
"లే, నా మాట విను. నాకు ఆలస్యం కానివ్వకు."
"ఉండండి, నన్ను వదలండి. నేను లేవగలను. మీరు వెళ్ళి చేతులూ కాళ్ళూ కడుక్కురండి"
"అన్నీ అయిపోయాయి. ఇక నువ్వు లేవడమే తరవాయి...."
"అబ్బా, వులిక్కిపడ్డానూ...నన్నిట్టే బుట్టలో పెట్టగలరు, అక్కడ మాత్రం కిమన్నాస్తి. ఏడ్చేదాన్ని నవ్వించినా, నవ్వేదా న్నేడ్పించినా నన్నే కాదూ?

ఒక్కమాటయినా నీకిది బుద్ధికాదని అక్కడ చిక్కగా చివాట్లు పెడితే నాకీ కించలేకపోవును గాదూ?"

"చూడూ?"

"చూస్తూనే వున్నాను మీ అభిమానాలు!"

"చివరి కిదీ మాట?"

"ఉన్నమా టంటే ఉలు కెక్కువ కొందరికి."

"ఉంటే యీ యెడమొగాలూ పెడమొగాలూ యెందుకూ?"

"పైవాళ్ళు చూసి 'పాపం, కాబోలు' అనుకోడానికి."

"ఏదీ, నాకేసి చూస్తూ అనూ ఆ మాట."

"పధ్నాలుగు మాట్లంటాను, నాకేంభయమూ?"

"లేదని నే నెరగనా?"

"ఏమిటే...."

"ఏవయితే యేమి లెద్దూ. చూడూ, గంతులు వేసేవాళ్ళతో సరిగా గంతులు వెయ్యడం కాదు ప్రజ్ఞ. ఒక శ్శైగిరెగిరిపడేటప్పు డెదటివా శ్భూరుకుంటే తప్పెవరి దవుతుందీ?"

"ఇక యెన్నయినా చెబుతారు మీరు కబుర్లు. అయితే లెండి, ఎప్పుడూ చీకటే వుంటుందా?"

"అదీ మాట!"

"ఇవాళ పొయ్యి అంటిచాటప్పటికి కాలుదువ్వింది. మనసు మనసులో లేదు. జీడిపలుకులు మాడే పోయాయో వేగనే లేదో? పకోడీలు పాకాన పడ్డాయో–"

"నీ చేత్తో వండితే యెప్పుడూ అమృతోపమానంగానే వుంటుంది నాకు; నీమొగాన చిరునవ్వు మెరిసిపోతూ వుంటే ఎందులోనూ నాకు లోపమే కనపడదు."

"....ఏం, కమ్మగా వుందా?"

"ఏం, మెచ్చుకున్నందుకా బుగ్గపోటు? అయితేలే, కామశాస్త్రకర్తలు దీనిమీద చాలా గ్రంథం పెంచారు. ఏవయినా, వార్షికమేఘం శరన్మేఘంగా మారిపోయింది. నా కదే పదివేలు. నా మనస్సిప్పటికి కుదుటపడింది."

"అవునవును, ఎదటివా ళ్ళుసూరుమంటూ వుంటే కొందరి కానందం. ఆ మహాతల్లి బిడ్డలు కారూ?"

"మళ్ళీ యిలా తిప్పావూ చక్రం?....ఇంకెందుకూ నాకూ? అయితే, కభుర్లేనా, నువ్వేమయినా–"

"నా మొగాన చిరునవ్వు మెరిసిపోతూ వుంటే మీ కన్నీ బాగానే వుంటాయన్నారు, మీ రుల్లాసంగా వుంటే నా కడుపు నిండిపోదూ?"

"హోయిహోయి, రత్నాల మూట! వెల కట్టగలమా ఆ మాటకి? గాఢారణ్యం లోనుంచి నందనోద్యానంలో పడ్డట్టుంది నాకు–ఏదీ వొక్క–"

*(1930 జూన్ 'భారతి'నుంచి, సవరణలతో)*

* * *

# యావజ్జీవం హోష్యామి

"అబ్బాయి నెత్తుకోవాలి."

"తెల్లవారిందా?"

"మీ కింకా కనపడలే దేమో గాని గంటయిం దప్పుడే."

"....ఏడిసిన ట్టుంది జవాబు."

"జవాబు మట్టుకేనా?"

"సంతోషించాం గానీ – తొరగా దయచెయ్యి."

"మిమ్మల్నింకా చాలా సంతోష పెట్టాలి కదా, దయచెయ్యక అక్కడ కాపరం వుంటానా మరి?"

"కాపరం వుంటానా అంటే, ఆశమ్మలూ బోసెమ్మలూ చేరతారు కాదూ?"

"చేరితే?"

"కబుర్లు మొదలుపెట్టక బుర్ర వంచుగు రమ్మంటున్నాను."

"నేను మొదలుపెట్టను లెండి."

"వాళ్ళు మొదలుపెడితే అందుకుంటావా?"

"మీరు వద్దనలేదే?"

"ఇప్పుడంటున్నాను. ఎవర్నీ పలకరించకు."

"అంతే కదా మహాభాగ్యం? అలాగే లెండి."

"ఎవరయినా పలకరించినా పలక్కు."

"అదొక టుందీ యింకా? అయితే, పలికే దాకా పలకరిస్తే?"

"అంత అవసరంయేమి వచ్చిందని అడుగు."

"అడుగుతాను. తప్పకుండా అడుగుతాను. మీ రడగమన్నారని చెప్పి మరీ అడుగుతాను, సరా?"

"అడుగు."

"అయినా, వోపట్టాన చెప్పకపోతే?"

"–నీ–మొఘం–"

"ఏమీ మించిపోలేదు, సావకాశంగా మీ మొఘం కడుక్కోండి ముందు."

"ఇదిగో, యిదే చెప్పడం, యివాళ త్వరగా వంట కావాలి."

"అంత తొందర కేం వచ్చిందో?"

"నిన్న రాత్రి భోజనం యెలా చేశానో–"

"నే నేమి వంట చేశానో, యెలా వడ్డించానో–"

"సాక్షాత్తూ కాశీ అన్నపూర్ణవు, లోటు చేస్తావా నువ్వు?"

"అదిగో, చూశారా? వెక్కిరించ బోయినా వున్నమాటే వచ్చింది, న్యాయం యెక్కడికి పోతుందీ?"

"అంతా న్యాయమే – తక్కువేం? అంచేతనే తెల్లవారాటప్పటికి తిన్నదంతా అయిపోయి, కడుపు మళ్ళీ నకనక లాడిపోతోంది."

"నయమే కాదూ? కొంతమంది చెయ్యే కాదు, కళ్ళు పడ్డా జీర్ణంకాదు తెలుసా?"

"ఇక చాలించి, తొరగా–"

"అంత తొందర అయితే, నేను వచ్చాటప్పటికి పొయిలో నిప్పు పడెయ్యండి."

'ఇల్లలక్కుండానే?"

'వల్లకాకపోతే యిల్లే ముందు అలికెయ్యండి, మిమ్మల్నెవరువద్దన్నారూ?"

"ఏం వండుతా వీపూట?"

"ఏమి వండమంటారు చెప్పండీ మీ నోట!"

"ఇంటో యేమేమి వున్నాయ్?"

"దొండకాయలు కోసి పట్టుకురండీ, పండిపోయే టట్టున్నాయ్!"

"పాడు దొండకాయలు– చచ్చుదొండకాయలు– దిక్కుమాలిన దొండకాయలు– వద్దు వద్దంటూ వుంటే పెరట్లో పడేశావు పాదు."

"మీ తిట్లే బలం అయి విరగకాస్తోం దది. కనక, పాదు కింద పద్మాసనం వేసుక్కూచుని తావళం తిప్పుకుంటూ–"

"ఎందు కెందుకని వూరుకుంటున్నాను గానీ–యెర్రగా చూశానంటే మండి చక్కాపోతుంది నీ దొండపాదు, ఏమనుకున్నావోను!"

"నే నేమీ అనుకోను గానీ–నేనే దొండకాయలు కోసి, నేనే తరిగి, నేనే పొయిమీద పడేస్తాను గానీ–మీ యెర్ర చూపేదో పొయిలో పెట్టిన చెక్కపేళ్ళమీద ప్రసరింప చెయ్యండీ చూతాం!"

"ముందు నోరు మూసుకో, తరవాత యింకేం వుందో అఘోరించు."

"

"పనసకాయా?"

"........"

"అనబగాయా?"

"........."

"గుమ్మడివుందా?"

"........"

"పెండలమా?"

"........"

"దిక్కుమాలిన సంజ్ఞలు చాలించి, యీ పాటికి నోరు తెరిచి చెప్పు."

"అరిటిపువ్వండీ!"

"ఛా!"

"నేతిబీరకాయ–"

"ఛూ!"

"అయితే, మునగాకు తీసుకురండి. ఆషాఢంలో మరిచేపోయాం, మీరూ నేనూ కూడా."

"అంతకంటే గడ్డి నయం."

"మీకంత నోరూరిపోతూ వుంటే అదే వండి పెడతాను, తెచ్చుకోండి పాపం!"

"........"

"........ "

"ఇంకేమీ లేదుషే కొంపలో?"

"పోనీ, మీమట్టుకి గోంగూరా పప్పూ వెయ్యనా?"

"నీకో?"

"ఉల్లిపాయలు–"

"ఎన్నిమాట్లు బుద్ధిచెప్పినా అవి మానవు. ఎవరయినా విన్నా చూసినా తలవంపులు."

"పనికట్టుకువచ్చి మీ తల వంచుతూ కూచోడాని కెవరున్నా రండీ యిప్పుడు తీరుబడిగా?"

"మిడుతూ మిడుతూ చూస్తే యేమన్న మాటా?"

"నువ్వు రాకపూర్వం వుల్లిపాయ లెవ రయినా యెరుగుదురా యీ కొంపలో?"

"మీ అమ్మ వండడం నే నెరుగుదును, తెలుసా?"

"తెలుసు, నీకోసం వండింది."

"ఇప్పుడూ నా కోసమే, యిక మీ కేం బాధా?"

"దిక్కుమాలిన అలవాటుగానీ – పుట్టింట యెలా యేడ్చినా–"

"శుభ మల్లే నిండింటో కూచుని అలా యేడ్పులు తెచ్చుకుంటా రెందుకూ? మీ నోట్లో శని వుంది కాబోలు, మీరు మానుకోండి, హరీ అనేదాకా నేను మాత్రం మానను."

"మానవు నువ్వు. మాన్తావూ? ఓ శాస్త్రమా, వో సంప్రదాయమా?"

"ఏం లోటు వచ్చింది?"

"అంతా లోటే. అవి తినవచ్చునని యేశాస్త్రంలో వుందీ?"

"పొడుం పీల్చమని యే శాస్త్రంలో వుందీ?"

"........"

"మీ తాత వేదవేత్తలుట. మీ నాన్న తర్కపండితులుట; కాని, కావ్యాలయినా పూర్తికాకపోయె మనకి. తిమ్మప్పదీక్షితులుగారు సాయంపడితే గాని, మొన్న కొల్లూరి రఘునాథావధానులుగారి యింటో వొడుగు చేయించలేకపోతిమి మనం. అయినా, సంప్రదాయం కావలసి వచ్చింది మనకి, సంప్రదాయం!"

"చేతగానప్పుడు, ఎవళ్ళ రుచి వాళ్ళదనీ, యెవళ్ళ అలవాటు వాళ్ళదనీ, యెవళ్ళ పద్ధతి వాళ్ళదనీ నోరు మూసుకు వూరుకోడం చేతగాదాయె మనకి?"

"........."

"మీకీ పట్టింపు లెందుకోగాని యీ వూరి విద్వాంసులంతా తింటూనే–"

"రహస్యంగా–"

"మీరూ రహస్యంగానే కానివ్వండి, వద్దన్నవా రెవరూ?"

## 3

"ఏమట్టుకి వచ్చింది వంట?"

"బాగుంది సడసం!"

"ఏం?"

"వెర్రి కుదిరింది, రోకలి తలకి చుట్టమన్నాట్ట!"

"అంటే?"

"అన్నం వార్చాలా, మీ తొందరే మీదా?"

"చంద్రుడు మొగమూ నువ్వూ – ఇంకా అక్కడే వున్నావూ?"

"బయలుదేరానా? అడుగుపడుతోందా? ఒకటి రెండు మజిలీలు దాటానా? ఎంత పరుగెత్తినా యిక్కడా అక్కడా లేదు కదా–"

"సిగ్గూ బిడియమూ లేకపోతే సరి."

"ఆరగించేవారు మీరు కాగా, వంట చెయ్యడానికి నేను సిద్ధపడ్డందుకు, కదూ?"

"వెళ్ళిపోతారా? యేమిటి?"

"..........."

"అన్నట్టు మరిచిపోయి మడికట్టేసుకున్నాను, పిలిచినట్టే వచ్చారు పాపం, బియ్యం కొలిచి అక్కడపెట్టి మరీ వెళ్ళండి."

"......ఇంకా యెసట్లో బియ్యం పొయ్యలేదూ?"

"ఇప్పటి కింకా పొయ్య లేదే అనుకోండి. మీతో అబద్ధాలాడ్డం యెందుకూ?"

"ఎసరు కాగిందా, పోనీ?"

"ఎసటినీళ్ళు కళపెళ్ళాడితే బియ్యపుగింజలు కుతకుతలాడ్డం యెంతసేపండీ?"

"మరి వార్చాలన్నావేం, అదే తరవాయి అయినట్టు?"

"అత్తెసరుమెతుకులూ పచ్చిపులుసూ తినడం నా వల్లకాదు సుమండీ!"

"ఛా, బుద్ధితక్కువ పెద్దమ్మా....."

"అలా రుంజుకుంటూ వెళ్ళిపోతే కాదు మరి. అంట్లు పట్టుకువెళ్ళి దాసీది చెరువుదగ్గిరే కూచుంది, తొరగా పట్టుకురావాలని చెప్పిరండి వెళ్ళి."

"ఆసి నీ యిల్లు–ఎసరుపడెయ్యకుండానే యీ కబుర్లన్నీ?"

"గిన్నెలు లేందే నేనేం చేతునమ్మా, నడమంత్రం కాకపోతే?"

"పొయ్యిలో నిప్పయినా వేశావా?"

"సడే, యిప్పుడే కాదూ పొయ్యిలికానూ? ఆరాలా?"

"మాట్టాడితే విషపుచూపులు తప్ప మరో ప్రయోజకత్వం లేదు. వాటి మొగం మండ, చెక్కపేళ్ళు వో—ట్టి పచ్చిముద్దలు, ఎందువి తెచ్చుకోడం చేతకాదు మళ్ళీ."

"............"

"బుడ్డెడు కిరసనాయిలు పోశాను, భగ్గుమనడమే కాని—"

"ఏమీ లేందే మడికట్టుకున్నా వెందుకు మరీ?"

"చద్దన్నం తినకుండానే నుండలేను బాబూ!"

"ఏం చేస్తున్నావ్?"

"ఏం చెయ్యమంటార్?"

"ఏమి టా మాటా?"

"ఏమి వచ్చిందీ లోటూ?"

"నా కర్మమూ నీ యోగమూనూ, తెలిసిందా? దానికేంగాని—యెవరూ వచ్చారుట మన యింటికి?"

"మీది కర్మమే, సందేహం లేదు, నాది యోగమే తక్కువేమీ లేదు. దానికేంగానీ—అందు కెవరేమి చేస్తారు గానీ – మా మరిది వచ్చాడు"

"మీ శిష్యుడు బాపన్న కాడు, సుందరం."

"నాశిష్యుడయితే నే నున్నచోటికే వచ్చును, వెతుక్కుంటూ."

"నిజమే!"

"అయితే, పెద్దమనిషి యేడీ?"

"అత నలా వెళ్ళాడు, మీ రిలా వచ్చారు."

"ఎక్కడికి వెళ్ళాడూ?"

"ఇంటికి."

"ఏం?"

"మహాబాగుం దండోయ్! ఎవళ్ళ యింటికి వాళ్ళు వెడితే తప్పా?"

"అప్పుడే వెళ్ళా డేమని అడిగాను, తెలివి."

"ఎప్పటి కయినా వెళ్ళాలా వద్దా అంటాను, సడసం."

"సైకి లుంది కనక, బుద్ధి పుట్టిందంటే యిట్టే వస్తాడు, అట్టే వెడతాడు. అతనికేం, రాకపోతాడా, వచ్చి వుండిపోతాడా? అక్కడికీ, వచ్చిన పని అయిపోయినా యెంతసేపు కనిపెట్టుకున్నా డనీ పాపం!"

"కనిపెట్టుకున్నా డంటే అతడు వచ్చినట్టు నా కేం కల వస్తుందా?"

"నడుస్తూనే కునికిపాట్లు పడతారు మీరు, కల కేమీ భాగ్యం – దయ రావాలి గానీ."

"రాతగ్గవాళ్ళమీద తట్టలతో గుమ్మరించుకోండి వున్నదంతా, మా కక్కర్లేదు."

"అక్కర్లేనివా డెందుకు వచ్చాడూ?"

"అబ్బాయి మీదా నా మీదా దయవుంది కనక పిలవడానికి వచ్చాడు, మీ దయకోసం కాదు."

"పిలు పెందుకో?"

"ఎల్లుండి సత్యనారాయణ వ్రతం చేసుకుంటున్నారు వాళ్ళు."

"ఏమిటో యెల్లుండి విశేషం?"

"మా లచ్చికి పుట్టినరోజూ, వాళ్ళకి పెళ్ళయిన రోజూను."

"........"

"అతనికి తెలిసిన ట్టుందచందా లెవరకి తెలుసునూ? మా లచ్చికున్న సుఖమూ ఆనందమూ యెవరి కున్నాయీ మాలోను?"

"ప్రయాణం కాబోలు!"

"కాక?"

".......... ....."

"మానాన్నా?"

"............"

"మానగలనా?"

".... ......."

"రేపొద్దున్న యెందుకయినా వాళ్ళు మన యింటికి రావాలా మళ్ళీ?"

"వెళ్ళకపోతే నువ్వేడుస్తావు, వెడితే నేనేడవాలి. కాస్తయినా మడీ మైలా అని వుందా? ఆ గుడ్డలతో తింటాడు నానా—"

"ఊరుకోండి, వూరుకోండి నేర్చుకుపోయారు మహా! ఎంతసేపూ వుప్పుపిండీ కొయ్యరొట్టీ తప్ప మరొకటి యెరగని వాళ్ళకి రకరకాల పిండివంటల రుచి యేమి తెలుస్తుందీ? ఫలహారాలు టేబిలుమీద పెట్టుకుని కుర్చీలో కూచుని పుచ్చుకోవాలో, తడిగుడ్డ చుట్టబెట్టుకునీ పొయ్యి దగ్గిర చతికిలబడి మింగాలో యేమి తెలుస్తుందీ?"

".........."

"కాకపోయినా, అంత యేడుస్తూ మీ రెందుకూ రావడం? అక్కడ యేమీ చెడిపోదు, యిక్కడ యేమీ మిగిలీ పోదు. అత్తెసరు వేసుకుంటూ యింటో కూచోండి చల్లగా, నేను మాత్రం వెళ్ళక తప్పదు. 'కార్యం చిన్నది కదా మానేస్తారేమో, వల్లకాదు సుమండీ' అంటూ గడ్డం పట్టుకుని – బతిమాలుతున్నంత ప్రాధేయపడ్డాడు పాపం, సుందరం. వెళ్ళకపోతే నలుగురూ నన్ను ఛీ అనరూ? కాకపోతే మీరు బాపన్న యింటికి—"

"మనిషంటే బాపన్నే మనిషి; కాని సుందర్రామయ్య—హు!"

"అయ్యో దేవుడా చెప్పబోయి చెప్పబోయి బాపన్ననే చెప్పాలి, నల్లగా – మసిబొగ్గు నయం."

"నలుపూ యెరుపూనా యేమిటి ప్రధానం? అతగాడు స్నానం చేసి—"

"భోజనాలవేళేగా స్నానం అతనూ మీరూనూ? అప్పటిదాకా యింజన్లో బొగ్గుమనిషిలాగ అతనూ, గాడిపొయి దగ్గిర మనిషిలాగ మీరూ—"

"ఒక వీభూది పెట్టుకున్నా, వొక గంధం పెట్టుకున్నా బాపన్న–"
"అచ్చంగా, చారల కుండ కదూ?"

"అతనికీ సుందరానికీనా తెచ్చారు సాపత్యం?"
"ఏమి తక్కువా?"
"రామయ్యతండ్రీ, యే జన్మలో చేసుకున్నామో నేనూ మా వెంకమ్మా ఘోరపాపం! లేకపోతే మా కర్మం యిలా కాలిపోయివుండదు."
"ఎప్పుడూ సుందర్రామయ్యకోసమే యేడ్చావు, చేసుకున్న పెళ్ళామయినా–"
"చేసుకున్న పెళ్ళా మయితే మాత్రం, అనాకారపు – చాదస్తపు – కొంకనక్క మొగుడు దొరికితే యేడవదూ? చేసుకోకపోతే మాత్రం సుందరాన్ని చూసి వెంకమ్మా నేనూ–"
"ఆ, యీపాటికి వేషాలు చాలించు, యెవరయినా వింటే తలవంపులు."
"అంత తలవంపుల కేం వచ్చిందీ? అందంగా వుంటే యెవర్తి మరిదిని యెవర్తి మెచ్చుకోకుండా వుండగలదూ? మీ రూపం విరూపాక్షరూపం అయినందుకు గింజుకోక అతగాడంటే అలా మొగం మూడ్చుకుంటారేం?"
"........."
"నా వాళ్ళ నంటే నే నూరుకోను. నా చెల్లెలినంటే వొకటీ నన్నంటే వొకటీనా?"
"బాపన్న మాత్రం నీకు మరిది కాడూ? అత న్నెందుకన్నావూ నువ్వు?"
"అనక, ముద్దు పెట్టుకుంటారు మిమ్మల్నీ అతన్నీ. మరిదయితే మాత్రం, నా చెల్లెలే అతన్ని చూస్తే యేడుస్తూ వుంటుంది తెలుసా?"
"భర్త అంటే–"
"మరి భార్య అంటేనో?"
"........."
"బ్రెవిభూది మాన మనీ, క్రాపింగు పెట్టించుకోమనీ, చొక్కాలు తొడుక్కోమనీ, పొగాకు నమలవద్దనీ, తెల్లవా రాటప్పటికి స్నానం చేసి చలవ మడతలు కట్టుకో మనీ, సంభావన్లకి తిరగవద్దనీ మా చెల్లెలు చిలక్కి చెప్పినట్టు చెబుతుంది గదా – వినవద్దూ అతనూ? వదినగార్ల మాటా తీసెయ్యడమే?"
"మరి విద్య?"
"విద్యట విద్య, సంభావన్లకి దిరిగే విద్యే కాదూ?"
"అంత చదువూ చదువుకుని–"
"ఎంత చదువబ్బా? స్మార్తం ముక్కలేనా కాకపోతే పరాయుతం కూడా కాస్త అయింది కాబోలు, అంతేనా? ఓ నవల చదవడు, ఓ నాటకం చూడడు, చదవనైనా చదవడు. ఏంత సేపూ–"
"అఘోరించినట్టుంటుంది మీరు చెప్పినట్టు చేస్తే!"
"ఇప్పుడే అలా వుంది సడసం. అంచేతే మా వెంకమ్మ నాలాగే సుందరాన్ని చూసి మనస్సు సరిపెట్టుకుంటూ వుంటుంది. మా లచ్చి అదృష్టమే అదృష్టం

అనుకుంటున్నాం కనకనే మేమిలా అయినా వుండగలిగాం. అతను కూడా మే మంటే ప్రాణం యిస్తాడు. మొన్న పిల్లాడి బారసాలకి వెళ్ళినప్పుడు రెండువేల మల్లెమొగ్గలు తెప్పించాడు మా ముగ్గురికీ. ముద్దూ మురిపెమూ అతనికి తెలిసిన ట్టెవరికి తెలుసునూ? బండయితే కుదుపనీ, మా ఉబలాటం చూసి యెవరిదో మోటారు తెప్పించి పంపాడు మమ్మల్ని, ఎరగరూ?"

"ఎరుగుదు నెరుగుదును. ఇక నయినా వేషాలు కట్టిపెట్టు మర్యాదగా."

"ఎందుక్కట్టిపెట్టాలీ?"

"ఎందుకా? ఇక అతగాడితో వేళాకోళా లాడిచూడు – నిలువునా చీల్చేస్తానో లేదో?"

"ఏమిటీ? చీల్చేస్తారా? నన్నా? ఎన్నివేల గుండె లుండాలీ అందుకూ? నామీద మీరు చెయ్యి చేసుకుంటే చూస్తూ వూరుకుంటాడేం అతను?"

"ఏం చేస్తా డేమిటి?"

"ఏంచేస్తాడో, యెల్లుండి వెడతాను గాదూ, రండి చూస్తురుగాని."

"వస్తాను వస్తాను. తొందరపడకు."

"వచ్చి?"

"........."

"అబ్బో! ఎంతెంత వూహా లున్నాయీ అవధాన్లుగారికీ?"

".........."

"మీ కేమి విషం పెట్టాడనీ అత నంటే అలా వుడుక్కుంటారు? అతను పలకరిస్తే పక్కకి చూస్తూ మాట్టాడతారుట, యేం, మొగం చెల్లకా? కొరివిదయ్యంలా పుట్టినందుకు మూలమూలల వొదిగివొదిగి పడివుండక యెగిసెగిసిపడతారేం?

"చాల్లెండి నేర్చుకోపోయారు. పాడుకళ్ళు మిటమిటలాడిపోతా యేమి పాపమో గాని, మొన్న ఆ లచ్చితో మాటే సరిగా ఆడలేకపోయారుట, విషం పెట్టిందా అది? యజమాను లిద్దరితోనూ ధుమధుమలాడుతూనే మాట్టాడతారు గదా, మళ్ళీ యే మొగం పెట్టుకుని బయలుదేరతారూ వాళ్ళ యింటికీ– నన్ను చీల్చెయ్యడాని కయితే మాత్రం?

"మా లచ్చి వాలుజడ వేసుకుంటేనూ, గూడకట్టు కట్టు కుంటేనూ మీ బ్రాహ్మణ్యం బుగ్గయిపోయిందా? షూ వెంకమ్మ కొప్పు పెట్టుకోడం బాపన్న చేత గంతులు వేయించారుట మీ సొమ్మేం పోయిం దనీ? పుటం వేసినా ఆ మొగానికి కళరాదుకదా యెందుకెందు కని వూరుకుంటోంది గానీ– 'క్రాపింగు పెట్టుకుంటే గాని నీ మొగం చూడ' నని మా వెంకమ్మ మంకుపట్టు పట్టిందంటే మీ శిష్యుడి ఆట కట్టి వూరుకుంటుంది. యేమయినా ఆలోచించుకున్నారా?"

".........."

"నిక్షేపం లాగ మా సుందరం వూరందర్నీ పిలిచీ, చిన్న కార్యం అయినా బోగం మేళం పెట్టీ, రాచకొమారుడులాగ పీటలమీద కూచుని వుండగా మా లచ్చి అతనికితగ్గ వేషం వేసుకుని యువరాణీలాగ అతనిపక్కన కూచుని వుండగా మా మొగాళ్ళమ్మో మహా చదివి బోర్లాతోశారని కొప్పులు పెట్టుకునీ, మడకచ్చాలు

పోసుకునీ నుదురంతా కుంకుమ పులుముకునీ మూసివాయనపు ముత్తయిదువుల్లాగ తిరగమా సభలో మేము? చూసినవాళ్ళు 'మీ మొగుళ్ళకి లేకపోతే పీడాపోయిరి, మీ కయినా సిగ్గు లేదా' అని మమ్మల్నాడి పోసుకోరూ? మీరంత చూడలేకపోతే యే సంభావనకో మరోవూరు వెళ్ళలేక పోయారు?"

"ఆ గొడవంతా యిప్పు డెందుకే?"

"ఎప్పుడు మాత్రం మా గొడవ మీ కెందుకూ?"

"........."

"ఇంటో వుండి, వచ్చిన చుట్టాలకి మర్యాదలు చెయ్యడం లేదు. వొక్కపూటయినా వుండ మని బలవంతం చెయ్యడానికి నోరు రాదు, తీరా వెళ్ళిపోయాక మాత్రం 'యేడీ? అప్పుడే వెళ్ళాడేం?' అనడగడం మహా పెద్ద మనిషిలాగ!"

"........."

"అప్పుడులేనివా రిప్పుడు మాత్రం యెందుకూ, అనాథలాగ యింటో కూచోక వంట అయేదాకా యెక్కడి కయినా వెళ్ళండి, నేను నిశ్చింతగా చేసుకుంటాను."

"వోసి నీ యిల్లు – నువ్వెక్కడ దాపరించావే నాకూ?"

"ముద్దొస్తోంది నడక– ఇంకా గబగబా నడవండి....నన్నంటే నేనూరుకుంటానేం? అబ్బో, నాకు పిసాళం యెత్తుకు వచ్చిం దంటే మొగుడయాది మొద్దు లయాది చెరిగేసి విడిచి పెడతాను....అన్నట్టు మరిచిపోయాను, కంసాలిదుకాణం మీదికి వెళ్ళమనవలసింది. ఎప్పుడయితేం, యీ వెళడం వెళడం అక్కడికయివుంటే సరే, లేకపోతే వెళ్ళి వచ్చేదాకా విస్తరి వెయ్యను – దాంతో కుదురుతుంది చ–ప్పగా రోగం."

## 5

"ఇదిగో!....వోయ్!....ఏం చేస్తున్నా రండీ? మిమ్మల్నే....వినపడదూ? ....అంగొస్త్రం పరుచుకుని అరుగు మీద పడుకుని వుండగా చూశాను, మళ్ళీ యెక్కడికి వెళ్ళారమ్మా యింతట్లోనూ?"

" "

"వెడితే వెళ్ళారు, కాస్త తలుపు దగ్గిరసావేసి వెళ్ళగూడదూ? కుక్క చొరబడితే యేమి చేస్తురో? ఓయ్.....ఈ చుట్టుపక్కల అయినా వున్నట్టా లేనట్టా?...ఎక్కడికో దాటారు, ఏమండోయ్!"

"........"

"ఏ కోటావధానులు దగ్గిరో, యే పళ్ళంభొట్లు దగ్గిరో కూచుని తద్దినాల కబుర్లు చెప్పుకోడమే కాదూ ప్రయోజకత్వం? పూర్వపువాళ్లు ఆ కాస్త మట్టయినా సంపాదించి వుండకపోతే, ఈ పాండిత్యానికి తాగడానికి గంజయినా లేకపోవును....ఇదిగో, యేమండోయ్!"

"....వచ్చె వచ్చె, యెందుకా బొబ్బలూ?"

"బొబ్బలా? వంట అయేదాకా తొండలు విడిపించారే, యింతట్లోకే వేం చెయ్యాలా పెత్తనాలకి?"

"పెత్తనాలకే వెళ్ళానో, కంసాలిదుకాణం మీదికే–"

"దుకాణం మీదికయితే నాతో చెప్పారా? ఏం, అంత రహస్యమేం?"

"చెప్పివెడితే వొకటీ, చెప్పకుండా వెడితే వొకటీనా?"

"దేని కదేగాని రెండూ వొక టెలా అవుతాయీ?"

"......."

"అస లెక్కడికో దయచేశారు, అవతలివాళ్ళు కనపడకపోగా పొడుం చేసుకోడానికి దుకాణంలో ప్రవేశించారు, నన్నుద్ధరించడానిక్కాదు."

"ఎలాగయితేయేం, యెందుకయితేయేం, దుకాణం మీదికి వెళ్ళాను, నీ పనీ చూశాను, చాలదూ?"

"చూడ్డమే నిజమయితే, చంద్రహారం యేమట్టుకి వచ్చిందో చెప్పండీ!"

"వంట అయిందా?"

"చంద్రహారం తయారయిందా?"

"నే నడిగినదానికి జవాబు చెప్పవేం?"

"నే నడిగినదానికి మీ రెందుకు చెప్పరూ?"

"......."

"...దిగండి గుర్రం."

"....అయితే సాఫుచేస్తున్నాడు."

"మొన్ననే చేశాడన్నారు సాఫు, మీ మెలికలు చాలించండి."

"మొన్ననే ప్రారంభించాడు, యివాళ పూర్తి చేస్తానంటూ గూచున్నాడు, దీక్షగా."

"ఎప్పటికి తయారవుతుం దన్నాడూ?"

"తొరగానే అవుతుందిట, వంట అయిందా?"

"ఎప్ప డిస్తా నన్నాడూ?"

"వంటయిందా?"

"ఎల్లుండి సుందరంగారి యింటికి వెడతానని చెప్పారా మీరు?"

"తొరగా వడ్డిస్తే నిమిషంలో భోజనం చేసి వెళ్ళి అక్కడే–"

"దినమ్మా వడ్డించడం లేదూ తొరగా?"

"స్నానం చెయ్య మంటావా?"

"చెప్పివస్తారా?"

"భోజనం చేశాక వెళ్ళనూ?"

"మీరు చెప్పివచ్చాక వడ్డించనూ?"

"ఒక్క క్షణంలో యేమి మించిపోతుందీ?"

"ఒక్క త్రుటిలో యేమి దాటిపోతుందీ?"

"ఇక మరో మాట లేదూ నీకు?"

"మరి మరో ధోరణి రాదూ మీకు?"

"అదే చేస్తున్నాడు గదా?"

"అతని కిదొక్కటే కాదుగదా?"

"చెప్పివస్తే మాత్రం మరో పని మూన్తాడా అతను?"

"ఇక్కడే వుండిపోయి, మీరు బతిమాలితే మాత్రం వడ్డిస్తానా నేను?"

"అదేమిటే, బోడితలకీ బొటనవేలికీ–"

"అదేమిటండీ, దేవతలకు పంచాంగం–"

"........."

"........."

"........."

"కాస్త నిదానించు, ఆకలి దొలుచుకుపోతోంది."

"కూస్త వెళ్ళిరండి, పులుసు కుతకుతలాడిపోతోంది."

"దాని జోలి నా కెందుకూ? నా కది కావాలా యేమన్నానా?"

"ఇందాకా వొప్పుకున్నారేమో–"

"ఏడిశావ్!"

"సంతోషించార్!"

"........."

"........."

"సరే, నీ యిష్టం వచ్చినట్లల్లా బాధించు, నిన్న రాత్రి భోజనం పసిలేక, యివాళ యింతవరకూ భోజనం లేక కృశించి కృశించి–"

"మీ యిష్టం వచ్చినట్టూ యేడిపించండి, నాకు వస్తువు చేయించవలసి వచ్చాటప్పటికి నవనాడులూ కుంగిపోతాయి. ఇన్ని విధాల ఆడదాన్నేడిపించిన వాళ్ళు ముందుకి రారు."

"నే నిప్పుడు చేసింది–"

"తీరా, బంగారం యిచ్చేసిందిరా దేవుడా అని వొకటే రంధి – మరేం చెయ్యాలీ? చూసిచూసి వస్తువు చేయించలేరు, చేయించుకుంటే కళ్ళతో చూడలేరు. ఇంత కుచ్చితబుద్ధీ, విషపుకళ్ళూ యెక్కడా చూడలేదు."

"దిక్కుమాలిన దండకం మళ్ళీ మొదలు. ఛా, నీ మొగం యిద్దూ!"

"నా మొగం యెందు కీడుస్తారూ? మీ వాళ్ళందరూ ఏ యేట్లో కలిశారూ? నన్నన్నారంటే బాగా జరగదు, మీరేమనుకుంటున్నారో గాని."

"ఎవళ్ళయినా వినిపోతారే, నవ్వుతారే!"

"వింటే నాకేం భయమూ? మీ యిష్టం వచ్చినవాళ్ళని తీసుకురండి, యెవళ్ళకి బుద్ధి లేదంటారో?"

"ఏమిటీ? మాటలు మహా–"

"కోమటీ కొత్తబెల్లమూనూ. కొంటే డబ్బుఖర్చూ, తింటే కడుపునొప్పీ."

"........."

"ఇంకా చూసుకోండి కోరచూపులు. ఇంటో కూచుని ఆడదానిమీదే కాదూ అధార్టీ చెయ్యడం? వీధికి వెడితే గజగజలే."

"ఏమిటే యీ అల్లరీ?"

'అదే నేనూ అడుగుతున్నాను."

. . ....

"ఒక్కమాటు దుకాణం మీదికి వెళ్ళిరమ్మంటే యింత రట్టూరవ్వాలా?"

"ఇప్పుడే కాదూ—"

"ఇక్కడే కాదూ—"

"........"

"సందు మళ్ళితే కోమటి దుకాణం, అది దాటితే శంభులింగం దుకాణం, అంతేనా?

"అదిగో, సుత్తిదెబ్బలు వినపడుతూనే వున్నాయి. అంత గట్టిగా సాగ కొట్టవలసిందేముంటుందీ చంద్రహారానికీ? మీరిలా మొగం తిప్పారు, అతనలా పని తిప్పేశాడు."

"నువ్వు మనిషివా దున్నపోతువా?"

"ఎలాంటివాళ్ళ కలా కనపడతాను."

# 6

"అభిఘరించాను."

"అఘోరించలేకపోయావు."

"నాకేం పట్టింది, యిప్పటిదాకా మీరే చేశారాపని, జ్ఞాపకం చేసుకోండి."

"కాస్త నెయ్యి రాల్చు."

"రాల్చడం కాకపోతే పురిసిళ్ళకోద్దీ యెలా వస్తుందీ? పొలాలు అమర్చుకునేటప్పుడు వట్టిగడ్డి నిరుకుచేసుకోడం చేత కాకపోయె మనకి."

"..........."

"లేగదూడకి చెంగలిపరకలు తేవాలన్న జ్ఞానం కూడా లేకపోయె మనకి."

"కాస్త మాట అనేటప్పటికి—"

"అనకపోతేం, అనిపించుకోకపోతేం?"

"పీటమీదికి వచ్చాటప్పటికి రుసరుసలు మొదలు. తిన్నగా కూచుని చక్కగా భోజనం చెయ్యడం చూడలేదు నేను."

"నువ్వేం వడ్డించావనీ?"

"మీరేం వండనిచ్చారనీ?"

"ఏమీ లేనేలే దంటావా యింటో వండడానికి?"

"అదా యిదా అనడిగితే అది గడ్డనీ, యిది తుక్కనీ సూకరాలు పోయారు గాని ఫలానా వండ మనగలిగారా మీరు?"

"నిజంగానే యేమీ లేదూ?"

"ఏమిటేమిటో తెచ్చి యింటో మీరు గుట్టలు పేర్చినట్టూ, నేనే బద్ధకించి వండనట్టూను. కదూ?"

"పెండలం యేమయిపోయిందీ?"

"ఇంకోటి చెప్పండీ మీరు తెచ్చిందేమిటో?"

"..........."

"సుందరంగారి కొట్టుగది చూడండీ యెన్ని రకాల కూరగలు సిద్ధంగా వుంటాయోను?"

"చెన్నపట్నం వెళ్ళాడంటే రకరకాల కూరలు తెస్తాడతను. కేబేజీ–కేరట్–నూల్ కూల్–టొమాటో–కాలీఫ్లవరు–పేర్లయినా విన్నారా మీరు?"

"నువ్వు విన్నావు మహా. నోరు తిరగని అక్షరాలు నాలుగు కలిపి పాస్‌పీస్ మంటే, యింగ్లీషు రానివాళ్ళ దగ్గిర, సగంసగం నేర్చినవాళ్ళకంతా యింగ్లీషే. నా దగ్గిర చెబుతావు నీ మరిది పాండిత్యం?"

"మీరు శాలువులు కప్పుతారనీ మీ యింటికి వస్తే పది కూరలతో విందు చేస్తారనీ!"

"పదికూరలుట! ఒక్క పెండలంచాలు ఇరవై కూరలపెట్టు."

"ఎంతసేపూ పెండలం పెండలం – దాని మొగం మండేరి, రుచా పచా?"

"అంతా యెలా తింటున్నారూ?"

"అంతా అవపెట్టుకుంటారు తెలుసా?"

"బెల్లం పెట్టి వండుకునేవాళ్ళు మాత్రం లేరూ లోకంలో?"

"ఒక్కటే కూర మొగుడికో రకంగానూ, పెళ్ళానికో 'రకంగానూ చేసుకునే వాళ్ళూ వున్నారా లోకంలో?"

"..... ."

"కాకపోయినా, పదిరోజుల కిందట మా తమ్ముడు వచ్చినప్పుడు నాలుగు ముక్కలు వేయిద్దామని యిట్టే తరిగాటప్పటికి– రామరామా! ఇప్పటికీ పోలేదా దురదలు. ఎక్కణ్ణుంచో రాక్షసి పెండలం తెచ్చిపడేశారింటో."

"పెరట్లో కావలసినంత తోటకూర–"

"చీడ నాకెయ్యలేదూ?"

"కాడలో?"

"ముదిరిపోలేదూ?"

"పోనీ, పప్పుపులుసు–"

"పోనీ, అందులో రెండుల్లిపాయలు. ఏం?"

"నీకూ నాకూ సమంగా పనికివచ్చేవి–"

"మాట అనడమే కాని, యేమున్నాయీ? కాకరకాయ చేదు. పొట్లకాయ గబ్బు. అనపకాయ చప్పన. దొండకాయ శ్లేష్మం పెంచుతుంది. కంద వేడి, అరటికాయ మలబద్ధం కలిగిస్తుంది. బీరకాయ మొగం మొత్తింది. గుమ్మడికాయ వాతం చేస్తుంది. అవునా?"

"...... ."

"కూరలకోసం యింత దేవుళ్ళాడేవాళ్ళు కాకినాడ వెళ్ళి గోరుచిక్కుడి కాయలు తెచ్చుకోకుండా వస్తారా? రాజమహేంద్రం వెళ్ళినవాళ్ళు ఆగాకరకాయలు తెచ్చుకోకుండా వస్తారా?

"లక్షమాట్లు పోరాను. శతవిధాలా బతిమాలాను. ఒక్కమాటయినా బంగాళాదుంపలు తేగలిగారా?

"దేవతార్చనపరులందరూ పీటమీద కూచుని చేసుకుంటారు—మీరు తప్ప."

"రేపట్నుంచి నేను వండుతాను, నువ్వు కూచుని తిను."

"వో, అంతకంటేనా? మూడో మేలు!"

"పోనీ, వంట తప్పింది కదా అని సంతోషిస్తావా నువ్వు?"

"సంతోషించనక్కరలేదు, రకరకాలు చేసిపెడితే తిని వూరుకోడమయినా చేతవునా మీకు?"

"పాడు వుల్లిపాయలు కొంపలోకి రాకుండా చెయ్యాలి గాని—"

"ఓహో, అలాంటి వుద్దేశం వుందీ యేలినవారికి? అబ్బో! అలా అయితే మీ తరమే కాదు, మీ తాత తరంకూడా కాదు, తెలుసా?"

"........"

"ఎందుకెందుకని వూరుకుంటున్నాను గాని, నాకు పట్టుదల వచ్చిందంటే మీచేత తెప్పిస్తానవి బజారునుంచి."

"..... .."

"రోజూ నా తిండిని గురించి మీరు గోలపెడుతూ కూచుకున్నారంటే, చివరికి, మీచేత తినిపిస్తానవి – యేమనుకుంటున్నారో?"

"......."

"ఊళ్ళో యిన్ని బ్రాహ్మణ కొంపలున్నాయి గదా, యే కొంపలో నయినా తిండికోసం యింత రగడ పెరగడం వుందా?"

"........"

"ఏమి వండుకుంటున్నారో, ఏమి తింటున్నారో, తినేవాళ్ళకీ దేవుడికీ తప్ప మూడో కంటివాడికి తెలుస్తోందా?"

"........"

"నేనమ్మా, దేవతార్చన వెగలబెడుతున్నానని బుజా లెగర వేసుకుంటున్నారే గాని, సంసారం వీధిలో పడిపోతోందని గుర్తించుకుంటున్నారా మీరు?"

"....."

"ఏదీ, సిగ్గువిడియాలున్న యే మొగాడు మాట్లాడతాడో మీ పక్షం, రమ్మనండీ చూతాం"

". . . . . ."

"ఇంతా చేసి పైవాళ్ళ మెప్పుకోసం గదా దేవతార్చన, యింటో కూడా యింత భాగోతం నడిపించాలా?"

## 7

'చాప వేస్తున్నా రెందుకూ?"

'ఒక్క కునుకు."

'దుకాణం మీదికి వెళ్ళరూ?"

"వెళ్ళనూ?"

"ఏడుకొండలవాడా అంటూ వీధిలో దొర్లుకుంటూ వెడతారూ కొందరూ, అలాగా?"

"........"

"అన్నం పెట్టేదాకా నన్ను మీరు నిలవనిచ్చారు కారు. నాలుగు మెతుకులూ కంఠం దిగాటప్పటికి పెద్దమ్మ మిమ్మల్ని నిలవనివ్వడం లేదు, అవునా?"

"నువ్వు పెట్టిన పంచభక్ష్యపరమాన్నాలూ అరగించాటప్పటికి."

"ఇలాంటి మొగాలకే అలాంటివి."

"........"

"వేషాలకి పోక దుకాణంమీదికి వెళ్ళండి తొరగా."

........"

"చాప చుట్టండి ముందు."

" "

"వద్దు... వద్దు... సాహసం వద్దు"

"వీధి అరుగుమీద పడుకోడం గదా, వచ్చిపోయేవాళ్ళు చూసిపోతారని భయపడి నేను వెనకతియ్యకపోతానా అనుకుంటున్నా రేమో, తరవాత గింజుకోవలసి వస్తుంది, ఆలోచించుకోండి."

"........."

"వద్దంటాను... వద్దంటున్నాను... వద్దన్నాను."

"అయితే, శంభులింగం భోజనం చెయ్యాలంటావా, అక్కర్లేదంటావా?"

"మీలాగ ఝామునేపు నీళ్ళు నమల డతను. కాకపోయినా, చద్దన్నం తినేవాళ్ళు వొంటిగంట దాటితేగాని భోజనానికి లేవరు."

"నీ నగల వుబలాటమేనా నా కష్టసుఖాలు చూడ్డం యేమయినా వుందా?"

"దుంగ లెత్తానా దూలా లెత్తానా, పొడుము పీల్చుకుంటూ కూచోడమే కాదూ అక్కడా?"

"అంగాస్త్రం కూడా పరుస్తున్నారు వద్దుసుమండీ!"

".........."

"వినపడదూ?... మిమ్మల్నే... ఓయ్!"

"........"

"పడుకోడానికి వల్లకాదు"

"....."

"మానరు కాదూ?"

"........."

"ఇంత మొండికెత్తితే యెలాగమ్మా వేగడం?"

"....."

"మానరు... మానరు... మానరు!"

"......

"ఇదిగో, ఓయ్, ....నల్లరాయి! .....ఏమండోయ్, మిమ్మల్నే...వెళ్ళనని చెప్పడానికయినా నోరు విడదూ?"

'........."

"నా మాట కొట్టేసి, నాకు బదులయినా చెప్పకుండా మీరెలా నిద్రపోతారో చూస్తాను కాదూ?... మొండివాడు రాజుకంటే బలవంతుడుట. చెవిటి వాడి ముందు శంఖం వూదితే 'అది కొరకడం నీ తరమా నీ అబ్బతరమా?' అన్నాడుట. వెర్రివాడికి పెళ్ళాం దొరికితే గిల్లిగిల్లి చంపాడుట. 'ప్రజ్ఞకి పెళ్ళాడానుగాని, కూడుపెట్టడం మా కులంలోనే లే'దన్నాడుట. మానాన్న వద్దు మొర్రో అంటూనే వున్నాడు. మా అమ్మ వెలగబెట్టిం దీ సంబంధం. అనుక్షణమూ దాని జీవానికి పడి యేడుస్తూనే వున్నాను నేను. పెళ్ళామనీ, బిడ్డలనీ, అచ్చటన్నీ, ముచ్చటనీ, ముద్దనీ, మురిపెం అనీ, కష్టమనీ, సుఖమనీ– యేమయినా తెలిస్తేనా జన్మకి? ఊరికే పెళ్ళాడగానే సరా? అస లీ వంశమే యిలాంటిది. తాతముత్తాతల దగ్గిర్నుంచీ వస్తోందిట పెళ్ళాన్నేడిపించడం యీ పాడుకొంపలో ఇంత కొయ్యతనం యెక్కడా చూడలేదు. ఎన్ని మాటలన్నా దున్నపోతుమీద వాన కురిసినట్టే–"

"వోసి నీ యిల్లు–"

"మీ యిల్లే, మీ బతుకే, అదేదో మీకే."

"నోరు మూస్తావా ముయ్యవా?"

"మీ చేతు లేమయి పోయాయా?"

"........."

"........."

"పడుకోనివ్వవుటే?"

"సుందరరంగారి యింటికి వెళ్ళాటప్పటికి నాకు చంద్రహారం రానివ్వరూ?"

"......."

"నా మాట వినండి. ఇవాళ్ళా రేపూ కష్టపడితే చంద్రహారం అయిపోతుంది. తరవాత, నేను సుందరరంగారి వూరు వెళ్ళాక వారంరోజులు రాత్రీపగలూ ఏకనిద్రపోవచ్చు. మధ్యమధ్య వులిక్కిపడి లేచి అత్తెసరు వేసుకుంటూ."

"ఒక్కక్షణం నిద్రపోకపోతే నాకు తలనొప్పి వస్తుందే."

"చెప్పగానే వినకపోతే నాకు వొళ్ళు మండుకుపోతుందండి!"

"ఊరికే పడుకున్నానని పేరు. నువ్వు భోజనం చేసివచ్చాటప్పటి కిక్కడ వుంటే అడుగు"

"ఊరికే సద్దిబెబుతున్నానని పేరు. మీరు లేచి దుకాణం మీదికి వెళ్ళేదాకా మీకు మతివుండనిస్తే అడగండి."

"ఓసి నీ పట్టుదల."

"అయ్యో మీ మొండితనం–"

"నన్ను వేపుకుని తినకే!"

"నన్ను రాసి రంపాన పెట్టకండీ!"

"నీ కెంతయినా పుణ్యం వస్తుందే."
"మీ కెంతయినా పాపం చుట్టబెట్టుకుంటుం దండీ!"
"నా పాపం బద్దలాసిపోబట్టే నిన్ను కట్టుకున్నాను."
"నా పుణ్యం బుగ్గయిపోయింది కనక మీ యింటో పడ్డాను."
"............."

"నా కిలాంటి యమచర రాసివుంది కనకనే నెత్తిమీద పెట్టుకునేవాళ్ళెంతమంది వచ్చినా—బతిమాలినా, వాళ్ళనందరినీ కాదని మా అమ్మ నా గొంతుక్కోసింది. అసలు పెళ్ళిలోనే రోత పుట్టింది, నాకు పాడుంబుర్రా పిలక జుట్టూ చూశాటప్పటికి"

"......"

"అయింది. కుంభకర్ణుడి విగ్రహం వొరిగింది. ఇక దీపాలు పెట్టాకే కళ్ళు తెరవడం, మళ్ళీ లేచి కూచునేటప్పటికి కుంభం సిద్ధంగా వుండాలి"

"మంచి మనిషికో మాటా, మంచి పశువుకో దెబ్బాను. మనిషి జన్మ యెత్తగానే సరా?"

"వోసి నీ యిల్లు—ఇందాకణ్ణుంచి చూస్తున్నాను, వొక్క మోస్తరుగానే పేగులు తోడేస్తున్నావు. నువ్వు నా కెక్కడ దాపరించావే నీ మొగం యీడ్చా – దుకాణం మీదే పడుకుంటాను వెళ్ళి. యిక తన్నుకు చావు."

"నాకేం చచ్చేదాకానూ? మా కుదుట్లో అర్ధాయుష్య పీనుగు లెవరూ లేనూ లేరు. మమ్మల్నన్నవాళ్ళు ముందుకి రానూ రారు... ఇదిగో చెబుతున్నాను. అప్పలమ్మని పంపి కనుక్కుంటాను. అక్కడైనా సరే నిద్రపోయారంటే రాత్రిమీరు చెయ్యవలసిందే వంట. వెళ్ళండి, వెళ్ళండి—మీ వేషాలు సాగనిస్తా ననుకున్నారు పా—పం!"

## 8

"వీధిలో వేశావేం మకాం?"
"అప్పుడే వచ్చారేం యింటికీ?"
"ఏం, రాకూడదూ?"
"ఏం, అడక్కూడదూ?"
"పచ్చిమంచినీ ళ్ళయినా తాగవద్దుటే?"
"పచ్చివేం కర్మం, పండువే పుచ్చుకోండి, నాకేం?"
"ఏడిశావు"
"ఏమిటీ? మహా చురుగ్గా వుందే యివాళ వ్యవహారం?"
"ఉండక? నీకు లొంగుతా ననుకున్నావు, మొగపుట్టుక పుట్టి—హు!"
"లొంగక? ఆడదా మనుకుంటున్నారు కామోసు అట. జుట్టుచేతికిచ్చి—హి!"
"చాలిం చీపాటికి. కసిన్ని మంచినీళ్ళు పట్టుకురా ముందు."
"గుర్రం దిగండీపాటికి. అప్పలమ్మని రానివ్వండి ముందు."
"కంఠం అర్చుకుపోయి వస్తే—"
"బతిమాలి బతిమాలి దాన్ని పంపిస్తే—"

"నా దాహానికీ అప్పలమ్మకీ సంబంధం యేమిటే?"

"నా చంద్రహారానికీ మీ దాహానికీ మాత్రం సంబంధం యేమిటండీ?"

"అదేమిటే నీ మొగం–"

"ఆగండి. మాటలు మిగిలారంటే చెరిగేస్తా నేననుకున్నారో? దండకం విప్పానంటే, ఆ విసురు మీ తాత ముత్తాతల దాకా వెడుతుంది, యేకధాటీని."

"........"

"మీ రక్కడ నిద్రపోయారో కూచునే వున్నారో తెలకుండా నేను మంచి నీళ్ళలా యిస్తా ననుకున్నారూ, పడి వుండండి కాస్సేపు."

"ఏదయినా దయ్యం పట్టిందా యేమిటే యీవాళా?"

"దయ్యమో భూతమో మిమ్మల్నే పట్టింది చూసుకోండి బాగా."

"ఎంత మొండికెత్తావే?"

"ఎంత బండ కెత్తారండీ?"

"నువ్వే యివ్వాలా? నేను పుచ్చుకోలేనా?"

"అయ్యో, పుచ్చుకోలేకేం? పుట్టింది మొగ పుట్టుక కదా?"

"తొందరపడకు."

"వేగిరపడకండి."

"........"

"ఇదిగో, దుకాణం మీద కూచున్న బట్టలతో ముట్టుకుంటారు కామోసు నిండుబిందె. నాకేం, రాత్రికి మీ కవే మంచినీళ్ళు, పుచ్చుకోండి."

"........"

"నూతికి వెళ్ళారు. కావాలి, శాస్త్రి."

"........"

"........"

"సిగ్గు లేకపోతే సరి నవ్వడానికి."

"చేతగాని పని చేసుకున్నందుకు మీ కుండాలి ఆ సిగ్గేమిటో, మధ్య నాకేం?"

"సాగుతోంది ఆంద్రబ్బ, ఎందుకెందుకని వూరుకుంటూవుంటే నెత్తి కెక్కుతున్నావు"

"ఎక్కక? కాళ్ళకింద పెట్టి రాసేద్దా మనుకుంటున్నట్టున్నారు, దేవతలు దిగిరావాలి."

"చూస్తువుగాని."

"మీరూ చూస్తురుగాని."

"........"

"ఇక రెండేళ్ళు పోనివ్వండి, అబ్బాయి నప్పగిస్తాను."

"వాణ్ణి కూడా పాడు చేస్తావు నువ్వు. వేలెడు నిర్భాగ్యుడున్నాడు, వాడికప్పుడే వుల్లిపాయలు మప్పేశావు."

"మీరు నల్లవుద్దరి తినండి. మాకేం? నిక్షేపంవంటి నాయన్ని తిట్టుకుంటారేం? మా నాన్న పేరు పెట్టుకున్నా ననీ ఆ వుక్రోషం."

"ఇవాళ రాత్రి మొదలు పట్టుపంచె కట్టుకుని వంటచేస్తాను, మీ రిలాగ వేశాలు వేశా రంటే, వోః! ముక్కు మూరెడు చేసుకుంటేనూ, మూతి ముడుచుకుంటేనూ నేను వొణికిపోను."

**9**

"తలుపు తలుపు."

"........."

"ఓయ్"

"........."

"ఏంచేస్తున్నావ్?"

"........."

"ఇదిగో."

"........."

"వినపళ్ళేదూ?"

"........."

"ఊానే?"

"........."

"ఇంటిదానా!"

"........."

"నిన్నే."

"........."

"తలుపు తలుపు... ఓహోయ్!... ఎక్కడున్నావే?... ఎక్కడి కయినా వేంచేసినట్టా?... ఇంటోనే వుంది, యేమి చేస్తోందో కాని"

"........."

"ఏం, వినపళ్ళేదుటే?"

"........."

"మడికట్టుకుందో, కొంపతీసి. నా చేత్తో కట్టిస్తుందో? అనాచారం బాధ వచ్చిపడింది గాని; అమృతమే యేమి వండినా. మడి అంటేనే మండిపడుతుంది గానీ, శుచీ శుభ్రమూ ఎక్కువే. కోపం రానంత సేపూ ప్రాణం యిస్తుంది. వస్తే మాత్రం వెనకా ముందూ చూడదు మంచితనం క్షణమూ దినమంతా మంకు తనమూను. కోపం యెందుకు వస్తుందో, యెప్పుడు వస్తుందో, వచ్చి యెంతసేపుంటుందో తెలవదు, ఉన్నంత సేపూ మాత్రం గజగజ లాడించేస్తుంది. ఎప్పటికప్పుడే ఛా అనిపిస్తూ వుంటుంది, కానయితే నేను పట్టుదల విడిచిపెట్టలేకుండానే వున్నాను... ఛీ, ఆడదా న్నెలా గయినా వొంచాలి గానీ - యేం వినపడదూ?"

"........."

"అబ్బాయీ?"

"........."

"నాయనా!"

"........."

"బుల్లోడా?"

"........."

"కుర్రాడా?"

"........."

"రామచంద్రావధానీ!"

"........."

"ఓహో, అలా పిలిస్తే వాడూ పలకడు, అదీ పలకనివ్వదు, వినపడ లేదు నయమే, రామచంద్రరావ్!"

"........."

"దిక్కుమాలిన కర్మం, కోపమో వినపడకపోవడమో – ఓసి నీ మొగం –"

"ఏమిటా బొబ్బలూ?"

"బొబ్బలా?"

"పెడబొబ్బలు – తక్కువేం?"

"జాముసేపణ్ణుంచి అరుస్తూ వుంటే –"

"ఎవ ళ్ళరవమన్నారూ తీరి కూచునీ?"

"ఎక్కడికి పోయావ్వూ?"

"ఎవళ్ళతో నయినా లేచిపోయాననా మీ రనేది?"

"ఏమిటా మాటా?"

"ఏమిటీ లోటూ?"

"........"

"మీ బొబ్బలతో కమ్మగా నిద్రపోతున్న చిట్టితండ్రి వులిక్కిపడి లేచాడు, మళ్ళీ నిద్రపుచ్చాటప్పటి కింత సేపయింది తెలుసా?"

"........."

"పెరట్లో పడి పనిచేసుకుంటున్నాను గదా, స్వాములు వేంచేస్తారని తలుపులు బార్లా తెరిచి వుంచనా?"

"

"కాస్సేపు అరుగుమీద కూచోగూడదూ, వాకటే అరవడమా – చెవికోసిన మేకలాగ"

"........."

"మీ గోలకి వీధేపోయేవాళ్ళు నవ్వుకుంటారని యింగితజ్ఞానమయినా వుండవద్దూ?"

"........"

"సరే, యింట్లో ప్రవేశించడానికింత తొందరపడ్డారు మరి, వంటింట్లో కూడా అంత తొందరగానే ప్రవేశించండి."

"అదేమిటీ?"

"అదే."

"అంటే?"

"అంటేనా? ముందు పొయ్యి రాజేసుకోడం. తరవాత వొళ్ళు రవల బెట్టుకుంటూ వెళ్ళి స్నానంచెయ్యడం. చివరికి, తడిగుడ్డలతో పొయ్యి దగ్గిర చతికిలబడి–"

"తెలిసింది, అదంతా యేమి టంటాను"

"వినపడింది, అదంతా యిందాకానే చెప్పానంటాను."

"అంతే?"

"ఇంతే?"

"నిద్రపోవడం నిజమే; కాని–"

"కనక, గొడవలు పెంచక తొరగా–"

"నిజం చెప్పినా పట్టుదల మానవూ?"

"పాడుపని చేసి నిజం చెబితే మాత్రం వొరిగిందేమిటీ?"

"........."

"కాకపోయినా, మీరు చెప్పకపోతే మాత్రం నిజం దాగుతుందా? పట్టపగలు–మి డసరిలగ్నంలో–నడివీధిలో–నలుగురూ వచ్చేపోయే కంసాలి దుకాణంలో–సాక్షాత్తూ–"

"బుద్ధి తక్కువయి నిద్రపోయాను, సరా?"

"బుద్ధి యెక్కువ చేసుకుని పొయ్యి దగ్గిరికి వెళ్ళండి."

"నేను నిద్రపోయినా అతను పని మానలేదు."

"మీరు చూశారన్న మాట?"

"మేలుకున్నంత సేపూ–"

"సరే, అప్పుడు కూడా కళ్ళు మూసుకుపోవాలా?"

"రామరామా!"

"చేసేది పార్థివం, శివశివా అనుకోండి."

"..........."

"..........."

"అయితే, యేమి చెయ్యమంటావో చెప్పు, ఇంకెందుకూ?"

"పోనీ, మీ రెంతసేపు నిద్రపోయారో చెప్పండి, మరెందుకూ?"

"క్షణం – అరగంట మించదు."

"దానికి పరిహారం యేమిటో అదీ మీరే చెప్పండి."

"పరిహారం అంటూ యెందుకూ? సంసారం అయిన తరవాత యేదో మంచీ చెడ్డా–"

"రెండూ కలపకండి."

"పోనీ, చెడ్డే జరుగుతూ–"

"ఆ చెడ్డకే పరిహారం తెలిసిందా?"

"ఏదో విధంగా సర్దుకుపోనడమే."

"అలాగటండీ?"

"అవును"

"ఊహూ!"
"..........."
"తరవాత చూసుకుందాం, ముందు మడి కట్టుకోండి."
"మళ్ళీ మొదలా?"
"అదికాకపోతే మరేమిటో మీరే చెప్పండి."
"పరిహారం మాటే విడిచి పెట్టాలిగాని, లేకపోతే మరోటెందుకూ?"
"మరోటి మీకూ వద్దు నాకూ వద్దు, కనక మడి కట్టుకోండి"
"... సరే ... కట్టుకునీ?"
"వంట చేసెయ్యండి."
"చేసి?"
"వడ్డించండి ముందు నాకు."
". . . . . . . . ."
"ఏం, వులిక్కిపడ్డారేం?"
".....సరే వడ్డించి?"
"తరవాత సద్దుకుపొండి లక్షణంగా."
". . . . . . . . ."
"ఏం, తెల్లపోతారేం?"
"

"ఇది సంసారమండీ! సాగరంకంటే యెక్కువదండీ! కష్టసుఖాలు కలిసే వుంటాయండీ! రెండూ వస్తే చప్పుడండీ! పెద్దవాళ్ళు వొరిగేసుకు పోవాలండీ!"
"..........."
"మాట రాదేం?"
"ధర్మం –"
"మళ్ళీ అదొకటుందీ?"

"మన మేమో తోచిన ట్లల్లా చేసేస్తూ వుండాలి. ఎదటివాళ్ళు మాత్రం చచ్చినట్టు సద్దుకుపోతూ వుండాలి. ఇదీ ధర్మం. త్రికాల జ్ఞానసంపన్నులయిన మహార్షులు పద్మాసనాసీనులై వరదహస్తం యెత్తి ఆడవాళ్ళ నెత్తిన రుద్ద మని పురుషుల కుపదేశించిన వేదసారం యిదీ, కదూ?"

"సిగ్గులేక ధర్మపన్నాలు. నిలవతీసి అడిగేవాళ్ళు లేక ధర్మోపన్యాసాలు."
"..........."
"బెల్లంకొట్టిన రాయి లాగ వూరుకుంటే గాదు, ఏదో తేలిపోవాలి."
"మరి తేల్చెయ్యి."
"మడి కట్టుకోండి."
"మరోశిక్ష చెప్పు."
"ఉల్లిపాయల పులుసు వేసుకుంటూ ఉండండి!"

"ఇంకొకటి?"

"ఆ వున్న పిలక కాస్తా కత్తిరింపించుకుని—"

"కొంచెం దయవుంచు మరీ."

"అయితే, పొడుం పీల్చడం కట్టిపెట్టండి."

"అది బాగుంది."

"ఏదీ, పొడుంకాయ—"

"ఉండు, ఒక్కపని చెయ్యి."

"ఏమిటది?"

"అరగంట నిద్రపోయాను కనక, వొక్క గంటసేపు పొడుం పీల్చకుండా వుంటాను, అలా వొప్పుకో."

"పనికీరాదు, నాలుగ్గంటలు—"

"చంపేశా వన్నమాట"

"అంత నొప్పిగా వుందా? ఇందాకా నే నెంత బాధపడ్డానో? వొళ్ళు మండుకుపోయిందే? అదంతా మీ కిప్పు డనుభవానికి రావద్దూ?"

"మొగా డైనవాడి కిది చాలదూ?"

"ఆడదాని అక్క స్సింతటితో తీరుతుందా? నయాన – భయాన ఎంత చెప్పినా విన్నారా?"

"అలా కాదు, కొంచెం శాంతించు. ఉండుండి వొక్కమాటు చర్రుమంటూ వుంటావు గాని నిజానికి నీ అంత మంచిది లేదు, దిక్కుమాలిన ఆచారం దగ్గిర వస్తోంది నీకూ నాకూ జగడం."

"ఆచారం దిక్కుమాలిన దని తెలిసివుండిన్నీ అదంటే అంతగా దేవుళ్ళాడటా రెందుకూ? పైకి వెళ్ళినప్పు డెలా అఘోరించినా యింటో వున్నప్పుడు కూడా యెత్తెత్తి కాళ్ళు వేసుకోవాలా?"

"మా నాయనా, నా కింగ్లీషు చెప్పించకపోయే. నాకా మరో వృత్తి చేతకాకపోయె"

"చేతకాకపోవడమేం? పొడుం పీల్చడం చేతకాలేదూ? అది మీ నాయనకు చేతకాదుగా? ఆయన మీకు నేర్పించలేదుగా?"

"పోనీ, అలాగే అను. మరిప్పుడేమి చెయ్యమంటావూ?"

"అలా అడిగారు బాగుంది, చెబుతా వినండి. ఈ కొంప తెగనమ్మేసీ, యీ సంభావన్ల విద్యాంసులను విడిచి పెట్టేసీ సుందరంగారి వూరు వెళ్ళిపోదాం రండి. వాళ్ళ యింటి వెనక వున్న డాబాయిల్లు అమ్మకానికి వచ్చిందిట, లేవండి. సుందరాన్ని బతిమాలి అతని బట్టలకొట్టులో అబ్బాయికి వాటా యిప్పిస్తాను, మనం రాజాంగంగా బతకవచ్చు, పదండి."

"నువ్వంతదానవు కాదని కాదు. కాని ముందుమాట అలావుంచు. నేను నిన్ తిడుతున్నానే అను. అయినా, ఆ తిట్లు నాదిదగ్గిర్నుంచి వచ్చేవి కావు నమ్ము. నాకీ తాటాకుమంటే. ఒక్కక్షణం నిద్రపోకుండా వుండలేకపోయాను గాని, చంద్రహారం వేసుకుని నువ్వు కలకల్లాడుతూ వుంటే నేను చూడలేనూ"

"అయ్యో, దేవుడ! మీ చూపే చెప్పకోవాలి."

"పోనీ, అది నాకు గొప్ప కాదంటావా?"
"ఇందాకా యే మయిం దా గొప్ప?"
"ఇందాకానూ గొప్ప కేమీ భంగం రాలేదు, బాగా నిదానించు, నన్నేడ్పించకు."
"ఈ నక్క వినయాల కేం లెండి?"
"అయితే, యిదంతా నటన అనే నీవ్వూహ?"
"కాక? ఏడ్పు మనిషి నెంత దిగతీస్తుందో అనుభవిస్తేగాని మీ కెలా తెలుస్తుందీ?"

"తప్పదూ?"
"తప్పదు. తప్పదు. తప్పదు."
"అయితే, పొడుంకాయ ఇచ్చేస్తాను."
"తెండి."
"ఉండుండు.........."
"బాగా ఆలోచించుకోండి. వంటలోకి వెడతారా, మీకున్న చాదస్తం అంతా వినియోగపరచుకోవచ్చు. పొడుంకాయ యిచ్చేస్తారా, నేను మా సుందరంగారి యింటికి వెళ్ళాక మాటిమాటికీ తెగపీల్చుకోడానికి మీ కెంతయినా మిగులుతుంది."
"ఇదుగో, పొడుంకాయ పుచ్చుకో. అయితే, నువ్వు వంట చేశాటప్పటికి నేను చెరువుకి వెళ్ళి సంధ్యావందనం—"
"కట్టిపెట్టండి వేషాలు. మీ నాన్న దగ్గిరనుంచీ యెరుగుదును! విస్తరిముందు కూచునే మీ యింటో సంధ్యావందనాలు. ఇవాళ చెరువుకి వెళ్ళవసలసివచ్చిందేం మీకు? వీధిగుమ్మం కూడా తొక్కిచూడనివ్వను, ఇంటోకి పదండి."
"అంత అనుమానం—"
"కాక? అలా వెళ్ళి యే సర్వయ్యనో అడిగి రెండుపట్లు తెగపీల్చడానికా? ఓ—హో—కదిలారంటే మాట తక్కదు మరి."
"నీ వెర్రే గాని పొడుం భాగ్యానికి దేహీ అని చెయ్యి చాపడం గౌరవమా?"
"ఓస్, ఏమి ప్రతిష్ఠ? పొడుం పీల్చే వాళ్ళ బతుకే చెయ్యి చాపడం. ఎక్కడ లేని మందహాసమూ వచ్చి కలకల్లాడిపోతుంది ముఖారవిందం, నే నెరగననా?"
"అదంతా యెందుగ్గానీ – వంట కాగానే యిస్తావా?"
"ఇలా భోజనం చేసి అలా చెయ్యి కడుక్కునేప్పటికి పారేస్తాను."
"అప్పటిదాకా ప్రాణాలు కొరికేస్తా వన్నమాట!"
"కొరికేస్తానా, మళ్ళీ మట్లాడితే నవిలేస్తానా?"
"..........."
"మరి లేవండి."
"కాస్సేపు—"
"పనికిరాదు. ఊరికే కూచోనిస్తానా మిమ మడి కట్టుకోమనేదాకా దొండపాదుకి నీళ్ళు తోడిపొయ్యండి"
"అదో ప్రాయశ్చిత్తం కూడానా?"

"అంతటితో కుదిర్చినందుకు సంతోషించండి."

"కోపం వస్తే వొళ్ళు రవలబెట్టుకుంటావు. పట్టుదల వస్తే ముందూ వెనకా చూడవు, తోచినంత చేసితీరతావు. ఈ కళంకం వొక్కటే లేకపోతేనా—"

"ఒహో, ఏమి గుణగ్రహణపారీణతా?"

"మరి నీ యిష్టప్రకారమే నడుచుకుంటాను పద."

"అలా బుద్ధితెచ్చుకోండి."

## 10

"ఈ పూటయినా అధరు వేదీ చెయ్యకపోతివిగదా, వో-ట్టి-వూరగాయతో కడు పెలా నిండుతుందో నువ్వే చెప్పు."

"నిండుతుం దని యెవ రన్నారో మీరే చెప్పండీ!"

"మాట్టాడితే యెదురువాదం."

"నోరు విప్పితే వంకరమాట."

"..........."

"అనవలసినవి నాలుగూ అంటేగాని మళ్ళీ మూతపడకపోడం:"

"..........."

"దీపాలు పెట్టేదాకా మడికట్టుకోడం మీరో నేనో తేలకపోయె. అప్పుడయినా పొయ్యి మండక వొక్క అన్నం వార్చాటప్పటికే వూరు మాటు మణిగిపోయె."

"ఇలా యెసట్లో బియ్యం పోసేసి అలా కందిపప్పు రుబ్బితే యెవరయినా వద్దంటారా?"

"వేయించిన పప్పు మొన్ననే అయిపోయింది కదా, బుద్ధివున్నవా ళ్ళెవరయినా మరి కందిపచ్చడి మాట యెత్తుతారా?"

"పెసరపప్పో?"

"చాయపప్పు తయారు కాందే?"

"పోనీ, మజ్జిగ పొగిస్తే?"

"రోజూ అదే? రుచి తెలిసినమాటే మీదీ?"

"మరి యిప్పు డేమి తినమంటావో చెప్పు, కోప్పడక"

"నిజంగానే చెప్పమంటున్నారా?"

"..........."

"వింటారు కదా?"

"..........."

"తీరా చెప్పాక, ఆత్తేరీ, యిలా అంటావా అని గంతులు వేస్తే వొప్పుకోను సుమండీ!"

"..........."

"చెప్పెయ్యనా?"

"..........."

"జాముదా త్రయింది. వూరారు మాటుమణిగిపోతోంది. ఇక మీరు వీధికి వెళ్ళనూ, వెళ్ళరు, మన యింటికిన్నీ యెవరూ రానూ రారు, యింతట్లో మీ బ్రాహ్మణ్యమూ పోదు; కనక, కాస్త పులుసు – వుల్లిపాయ లొత్తిగించేస్తాను లెండి, మీ కిష్టం లేకపోతే."

"........"

"ఏమంటారు?"

"........."

"మాట్లాడ రేమండీ?"

"అసలే వుల్లిపాయల పులుసా?"

"......"

"ఆపైని, మధ్యాహ్నం చేసిందా?"

"అవును, వూరి యెంతో ఘుమఘుమ లాడిపోతోంది"

"......"

"జిహ్వ నెందుకు చంపుకుంటారూ? నాలుగు తమలపాకులిస్తాను వేసుకోండీ వేళకి గప్‌చిప్! తెల్లవారాటప్పటికి స్నానం చేసేసి మీ వీభూదిపించెకట్లూ, మీ తాటాకుల గొడుగూ మీరూ తయారు సాక్షాత్తూ వేదమూర్తి లాగ."

". . . . ."

"పుట్టుకురానా?"

". . . . . . . ."

"మీవంకర చూపులు నాదగ్గిర చెల్లవు. వెయ్యనా వద్దా?"

"ముందు పీక పిసికేసి తరవాత వడ్డించు."

"ఎంత సడసమూ?"

". . . . . . . ."

"తింటే తినండి లేకపోతే మానుకోండి, తిని నన్నేం వుద్ధరిస్తారా? అంత కిట్టనప్పుడు మీ విస్తరిలో పారపోసి నేనెందుకు సగం సగం చేసుకోవాలీ? సాగనిచ్చిన కొద్దీ ముదురుతున్నాయి వేషాలు. మనిషి కోఅధరువు నేను చెయ్యలేను. మజ్జిగ అయినా కావాలా వద్దా? ఆకలి దహించుకుపోతోంది – నాకు తొరగా తెమల్చాలి."

"పొద్దున్న ఫలప్రదానం బాపతు మూ డరిటిపళ్ళు తెచ్చాను, అవయినా పడెయ్యి విస్తరిలో."

"కూచున్నా యిప్పటిదాకా?"

"ఏమయిపోయాయీ?"

"జీర్ణం అయిపోయాయి?"

"అయితే పెరుగుపట్టుకురా."

"తేవడాని కభ్యంతరం లేదు. సత్తప్పేలా పెరుగూ వొంచెయ్యడానికీ అభ్యంతరం లేదు, కాని అన్నం తింటూ తింటూ అబ్బాయి చెయ్యి విదిపాడు, ఒక్క మెతుకు పడింది, పనికి వస్తుందా?"

"పోనీ, పాలు పట్టుకురా."

'ఇంకా దాలిమీద పడెయ్యలేదు, పచ్చివి తేనా?"

"ఇప్పటిదాకా ఎందుక్కాచావు కాదూ?"

"కారణం చెబుతానే అనుకోండి. నుంచున్న పాళంగా మీకిప్పుడు వేడిపాలు వస్తాయా?"

"అయితే, నిమ్మకాయ కోసి–"

"కూచుంది నిమ్మకాయ."

"ఏమి చేశావ్రా?"

"ఏమి చెయ్యడాని కయినా చాలితేనా?"

"చాలకపోవడం దేల్లోకి?"

"ఉప్మాలోకి."

"ఎందుకు చేశావ్?"

"సుందరంగారి యింటో వున్నన్నాళ్ళూ కాఫీవుప్మాలు మెక్కి అతనొక్కమాటు వాకట్లోకి వస్తే పచ్చిమంచినీళ్ళిచ్చి పంపనా?"

"ఎంతసేపూ నువ్వూ నీవాళ్ళేగాని–"

"మావాళ్ళేం తీసిపోయారా మీ వాళ్ళలాగ?"

"మే మన్నీ తింటాం, మా కన్నీ వస్తాయి. నేనమ్మా మహా చదివి గుట్టలు పెట్టానని అది పనికిరా దిది. వల్లకాదన్న వాళ్ళకేం వస్తాయా? పైగా, అన్న మయినా సరిగా పెట్టడం లేదని నన్ను యాగీ చెయ్యడమా? నేను చేసిన వన్నీ తినండి, మీకేం తక్కువవుతుందో చూస్తాను"

"మాలకూడు తినమంటావా?"

"తడిగుడ్డలతో తింటే బ్రాహ్మణభోజనమూ తాపితాలు కట్టుకుని తింటే మాలకూడూనూ."

"....."

"బంగాళాదుంప లెక్కణ్ణుంచో రెయిల్లో వస్తాయి కనక పనికిరావు. కాబేజీ కిరస్తానీలది. గోంగూర పచ్చడిలో లెక్క రెండు వుల్లిరేకలు పడేస్తే చెడిపోతుంది. ఉప్మాతింటే దేవతార్చన దెక్కడికిపోతుంది. కాఫీపుచ్చుకుంటే జంధ్యాలు మైలపడి పోతాయి."

"నీకు పుణ్యం వుంటుంది గానీ, యీపాటికి చాలించి కాస్త మజ్జిగ పట్టుకురా."

"కాస్తేం కర్మం, గిన్నెడూ వొంచేస్తాను జుర్రండి. మానాన్న ధర్మమా అని నిక్షేపం వంటి గేదె వుందిగదా?"

"పూటకి మానెడు పాలకి పైగా యిస్తుంది పాపం. కాని, నాకు కమ్మని పెరుగు దొరకదు."

"పాలికాపాడు గుగ్గిళ్ళువేసి చిట్టుపెట్టడానికి వల్లకాకపోయే మనకి పెరుగేలా వస్తుందీ?"

"వాడిచేత ఆ పని చేయించడం మానేశావా నువ్వు?"

"కనకనే మీకు పెరుగు వడ్డించడం మానేశాను."

"మరి యీ మజ్జిగ –"

"ఆ పెరుగులో నీళ్ళు పోసి కడిగెయ్యలేదూ అంటా!"

## 11

"పోనీ, యిందాకా తమలపాకు లిస్తా నన్నావుగా, లెక్క అయిదాకులూ వొక్క చెక్కా పట్టుకురా; చూతాం"

"ఆ రమ్మన్నారు పా-పం"

"అదేమిటి?"

"ఇదేమిటి?"

"మాటకి మాట-"

"అందించకపోతే యీ కొంపలో బతగ్గలుగుదునా నేను?"

". . . . . ."

"అక్కడికి, తమరు మహా గొప్పవాళ్ళయినట్టూ, యివతలివాళ్ళు దాసీ పీనుగు లయినట్టూనూ. మంచిచెడ్డలూ కష్టసుఖాలూ అక్కర్లేదు గాని తాంబూలాలు మాత్రం కావాలి, తాంబూలాలు. నే నిస్తా నన్నానుట చేతులు కట్టుకునీ పులుసు వేసుకున్న వాళ్ళకే తాంబూలాలు."

"పులుసుకీ తాంబూలానికీ సంబంధం యేమిటీ?"

"తాంబూలానికీ దేవతార్చనకీ పొత్తేమిటీ?"

"అంటే?"

"ఏకాదశిపూటా మీకు తాంబూలా లేమిటండి, మాలకూడు కాకపోతేనూ?"

"వోస్ అదా? మధ్యాహ్నం మూడుగంటలకే వెళ్ళిపోయింది ఏకాదశి."

"పంచాంగం చూసుకుని మరీ వచ్చారు కామోసు సిద్ధంగా, ద్వాదశి గడియలు వచ్చేశాయి, నే నివ్వను బాబూ!"

"తెస్తూ కబుర్లు చెప్పక."

"ఊరుకుందురూ వేషాలు వెయ్యక."

"హాస్యాల కయినా హద్దుండాలి."

"ఆడబోయి ఆడబోయి మీతోటే ఆడాలి హాస్యాలు. అయ్యో, రామ!"

"చూద్దూ!"

"నేను చూడను. పునమి వెళ్ళాకే యిక మీకు తాంబూలం"

"ఛా"

"ఛా లేదు, ఛీ లేదు. నా మనస్సు మనస్సులో లే దివాళ, నన్నిక మాట్లాడించకండి."

"పోనీ, మూడాకులు-"

"మూడుకాదు వొక్కటి కాదు, చివరికి, తమలపాకు తొడిమ అయినా మీకివ్వను. ఆకు లెన్నో లేవు, మీకిస్తే సుందరంగారి వూరు వెళ్ళేదాకా నాకు చాలవు."

"నాకు లేకుండా రోజూ నీకు తాంబూలా లేం?"

"పునిస్త్రీ పడుచుకి తాంబూలం యేమి టని మీరు కనక అనగలిగా రూరుకోండి యీపాటికి"

"నువ్వు పుణ్యస్త్రీపడుచు వైనట్టే నేను ధర్మపత్ని సమేతుణ్ణి! తెలుసా?"

"అయ్యో, కాకేం? ఇప్పటి కయినా మీకు ధర్మపత్ని అంటే యేమిటో తెలిసింది, మంచిదే కాదూ?"

"మరి మంచి కనపడదేం?"

"సంతోషించాం తెలివికి"

"సంతోషానికి చిహ్నం తాంబూలం"

"వేసుకుంటూనే వున్నానుగా. ."

"అఘోరించిన ట్టుంది, తాంబూలం అంటూ వుంటే అలా పడుకుంటావేం?"

"... .. ...."

"మాట్లాడవేం?"

"..........."

"వోసి నీబతుకో–"

"మంచం నడుమెక్కి కూచుని తెల్లవార్లూ తిట్టుకోండి"

"........."

"... ...."

"అయితే, అబ్బాయిని వుయ్యాలలో పడుకోబెట్టావు కాదేం?"

"నిద్ర ముంచుకు వచ్చేస్తోంది, నన్ను పలకరించవ ద్దిక."

"ఇవాళ యింత పెందరాడే నిద్రేం?"

"ప–గ–లు–ని–ద్ర–పో–లే–వ్"

"... ......."

*(1928 మే నెల 'భారతి'నుంచి; పెంపకం)*

★ ★ ★

# "షట్కర్మయుక్తా"

"ఏంచేస్తున్నావ్?"
"ఏం చెయ్యమన్నార్?"
"సున్నం కావాలి."
"తెచ్చుకోవాలి"
"నువ్వెందుకు తేవూ?"
"మీ రెందుకు తెచ్చుకోరూ?"
"ఎక్కడో వుంటే—"
"ఎక్కడో యేమిటి, సందులో కుండలో వుంటే!"
"నాకా సంగతి తెలుసు, నువ్వు తేవాలి"
"నాకూ తెలుసు ఈ సంగతి, మీరు తెచ్చుకోవాలి"
"తెచ్చిపెట్టమని చెబుతున్నాను – వినపడదూ?"
"మడి కట్టుకున్నాను – కనపడదూ?"
"మడి కట్టుకుని యిప్పుడేమి చెయ్యాలీ నువ్వు?"
"మీరలా కూచుని మాత్రం యేమి చెయ్యాలండీ మహా?"
"కారణం చెబితేనే మైలపడిపోతావా?"
"చెబితే మీకేమయినా కలిసి వస్తుందా?"
"అయినా చెబుదూ చూద్దాం."
"పనిమనిషికి అంట్లు పడెయ్యాలి."
"పడేసి?"
"పొయ్యి అలకాలి."
"అలికి?"
"ముగ్గు—"
"పెట్టి?"
"సడే, నిప్పు పడెయ్యాలి."
"పడేసి?"
"ఎసరు—"
"పెట్టి?"
"కుంభం వుడకెయ్యాలి కాదూ? ఏది తప్పినా అది తప్పదాయె మనకి. మూడు పూటా ఆరగింపయితే గాని తిరువీధులు వేంచెయ్యడానికి స్వామికి శక్తి పుట్టుకురాదుగా?"

"......"

"... ...."

"ఇట్టే సున్నం తెచ్చేదాని కంత దండకం విడెయ్యడం యెందుకూ?"

"ఒక్క అడుగు సందులోకి లేస్తే కావలసినంత సున్నం కదా, మీరంత రాయసం చూపించుకోడం యెందుకూ?"

"..........."

"పనిమనిషి కనిపెట్టుక్కూచుంది, నేను వెడుతున్నాను మరి"

". . . . . . . . ."

"పొద్దెక్కి పోతోంది, మీకేం చెబుతారు కభుర్లు. సున్నం కావడమో అక్కర్లేకపోవడమో తేల్చుకుంటే తలుపు వేసుకోవాలి నేను."

"ఇంకా బారెడు పొద్దయినా యెక్కలేదు గదా, అప్పుడే మడేం నీకూ?"

"ఇంకా మొగమయినా కడుక్కోలేదు గదా, అప్పుడే సున్నమేం మీకూ?"

"నా సున్నాని కీవేళ కొత్తా?"

"నా మడికి మాత్రం కొత్తా?"

"..... . ..."

"తొరగా తెమల్చాలి, రెప్పవెయ్యకుండా చూస్తూ కూచుంటే కాదు, జైనవిగ్రహం లాగ!"

"పెంకి జవాబులు చెబితే అవుతుందా యేమిటి, సున్నం పట్టుకురా ముందు, ఓహో–!"

"కాళ్ళ దగ్గిరికి తెప్పించుకుందా మంటే మాత్రం సాగుతుందా యేమిటి అన్నింటికీ. వెళ్ళి తెచ్చుకోండి సున్నం, ఆ–హా!"

"బాగుంది!"

"ఘోరకలిగా వుంది."

"సరే, అలా నుంచో."

"మంచిదే, అలా కూచోండి"

".....వెడతావు కాదూ, సున్నం తేవ్వూ?"

"...కూచుంటారు కాదూ, సున్నం తెచ్చుకోరూ?"

".............."

"............."

"ఇదిగో చూడూ, తీరా కూచున్నాను."

"ఇదిగో పరకాయించండీ, తీరా తెచ్చుకోమన్నాను."

"చెప్పిన మాట వినవు కాదూ?"

"వినే మాట చెప్పరు కాదూ?"

"చెబ్తాను, వెళ్ళు."

"....చెబ్తాను, కూచోండి."

"నా పని లేకపోతే–"

"నా అవసరం రాకపోతే."

"ఆడజన్మ యెత్తాక యింత కొయ్యతనం కూడదు"
"మొగజన్మ యెత్తాక యింత సోమరితనం చెల్లదు."
". . . . . "
" . . . . ."
"నా మాట విను. ఇవాళ మాత్రం తెచ్చిపెట్టు."
"నేను చెప్పింది గ్రహించుకోండి ఇప్పటికిమట్టుకు తెచ్చుకోండి."
"అంతే?"
"ఇంతే!"
" .. చూతాం "
"సావకాశంగా చూసుకోండి"

"ఆ,ఆ– ప్ఫ్! వెళ్ళిపోయింది. దీనిచేత సున్నం తెప్పించ లేకపోయాం మనం.....మొదట గారాం చేశాం, అది యివాళ విషమించింది ఆ పెంకితనం చూస్తే వొళ్ళు మండిపోతూనే వుంటుంది, కాని ఆ జవాబుల మీద చెయ్యాడకుండా వుంది ...పైమాటే తోచకుండానూ వుంది, దాని మొగం యీడ్చా!..మరేం లేదు, ఎంతమందీ వుండినా అదే వరస, అంచేత చాలా యిదిగా వుంటోంది మనకి.. హు! మొదటే మనం తెచ్చుకుని వుంటే యీపాటికి మాలపల్లి దాటి వుందుం. పోనీ యిప్పుడయినా తెచ్చుకుందా మంటే తలుపులు బిడాయించుకుంది కదా? ఎవళ్ళనయినా దేవురించాలి యిక.... ...తెల్లవారుతూనే సున్నం ముప్పెత్తడం - చిక్కే! కాని తప్పదు"

## 2

"ఒకమా టింటోకి రావాలి."
". . . "
"మిమ్మల్నే!"
". . . . . "
"వినపడదూ?"
" . . . . "
"పోనీ, కనపడదుటండీ?"
" . . . ."
"పిలిచాను, నా తప్పు లేదిక"
"ఆ, ఆ, యేం, యేం?"
"తొరగా వస్తే చద్దన్నం పెడతాను"
"రాకపోతే?"
"మీరు పెట్టుకోవాలి"
"ఇంతకంటే అదే నయం, వెళ్ళి నీ పని చూసుకో"

"కంచం కూడా మీరే కడిగేసుకుంటా రన్నమాట! అదే బాగుంది, మీ పని మీరు చూసుకోండి."

"అదేమిటి?"
"మీ రిప్పుడు వెలగబెట్టేది మాత్రం యేమిటి?"
"చూడూ!"
"చూశాను."
"చూసేస్తే కాదు మరి"
"పోనీ, చూస్తున్నాను."
"నే నిప్పుడొక గొప్ప ఆలోచనలో వున్నాను"
"కనక?"
"నన్నిప్పుడు కదపకు."
"భోజనం కంటే మిక్కిలీ విలవ అయినదా అది?"
"..........."
"కదిలితే పిట్ట అయి తుర్రు మని యెగిరిపోతుందా అది?"
"నీ ధోరణే నీదా? పోనీ, నువ్విప్పు డింత తొందరపెట్టడాని క్కారణం యేమిటో చెప్పు."
"పొయిలో నిప్పు పడేశాను. అది రాజిందంటే నీళ్ళు పోసుకుని పెద్ద మడి కట్టేసుకుంటాను. ఇక చద్దికుండ ముట్టుకోను కంచం కేసి చూడనైనా చూడను"
"అయితే, మధ్యాహ్నం భోజనా లయినాక యేకంగా కడిగేస్తువుగాని, తొందరేం?"
"...ఇప్పుడు తిన్న కంచం అలాగే అట్టేపెట్టేసి, దాల్లోనే వడ్డిస్తాను మధ్యాహ్నం, అవును, కంగారేం?"

"బాగుందా?"
"నోరుముయ్!"
"నేను ముట్టుకోనండీ!"
"టాట్!"
"అబ్బో, ధరుడుఫారానికే యింత యింగ్లీ షయితే, బి.ఏ. కావడం అంటూ వుంటే యిక భూమీ ఆకాశమూ కనపడక పోవునేమో?......"
"......గిల్లి కజ్జా పెడుతుంది భడవ. నాలుగు వాయిస్తే బుద్ధి వచ్చును గానీ – అయినా – యిక ముందు ప్రతీ పనీ సకాలంలో చేసుకునే పద్ధతి యేర్పాటు చేసుకోవాలి మనం....కాని తలుపులు బిగించుకుంది గదా, యేమిటి దారి? ఇటు వకటైన ఆలోచనా చెదిరిపోయి, అటు చద్దన్నమూ లేక – ఛూ, ఇవాళ లేవగానే యెవళ్ళ మొగం చూశామో మనం?"

"ఏమిటి వంట యివాళ?"
"అన్నం వార్చాను."
"ఆధారం యేమిటని అడుగుతున్నాను."

"తవ్వెడు గిన్నండీ."

"...... ....."

"దాని కేమో పొయ్యి"

".... ....."

"దానికి పుడకలూ పిడకలూను."

"...... "

"వాటి కేమో అగ్గిపుల్ల."

"మాట్లాడితే గరిగమ్మవాటం. సిగ్గు లేకపోతే సరీ!"

"నా కెందు కుండాలీ సిగ్గు? మీరు తెచ్చి గుట్టలు పెట్టిన కూర లన్నీ కుళ్ళిపోతున్నా యనా?"

"పనిమనిషిని సంతకి పంపమని చెప్పలేదూ నేనూ?"

"మీరే వెళ్ళి తేవాలని వెంటనే చెప్పెయ్యలేదూ నేనూ?"

"సంతనుంచి కూరలు నేను మోసుకు రానా?"

"పొయిదగ్గిర పడివుండి వంట నేను స్వయంగా చెయ్యనా?"

" . . . . ."

"మీరు కడుపునిండా తిని గ(రున తేలుస్తూ లేచివెడితే విస్తరాకులు నా చేతులతో నేను తీసిపారెయ్యనా?"

" . . . ."

"బిందె బుజాన పెట్టి చెరువునుంచి మంచినీళ్ళు నేను మోసుకురానా?"

" . . . . ."

"మా నాయన వెయ్యిన్నూ టపదహార్లు పారబోసి నాకు పెళ్ళి చేశాడు గదా, మీ చేతికి కాఫీ కప్పు నే నందించనుటండీ?"

". . . . . . . ."

"ఇంతకీ గుడి అరుగుమీద మీరు చీట్లపేకా, నా యీడు వాళ్ళని పది మందిని చేర్చుకుని రోడ్డుపక్కని నేను బాడ్మింటనూ ఆడుతూ వుంటే యెంత దర్జాగా వుంటుందో యెన్నడయినా ఆలోచించారా?"

"కదిపితే నువ్వు హద్దులో వుండవు, ఛా!"

"కదిపితే గాని మీరు హద్దులోకి రారు, సీత్!"

## 4

"వంట అయింది."

"అయిందీ? మా ఆటకూడా అయిపోయిం దన్నమాటే. ఇక రెండెత్తుల్లో నువ్వు వడ్డన ప్రయత్నంలో వుండవచ్చు"

☆ ☆ ☆

"వంట అయింది"

"చెప్పావు. ఒక్క క్షణం ఆగు, ఈ వెధవ గుర్రం అడ్డు వచ్చిందిగాని లేకపోతే యీ పాటికి సగం భోజనం అయిపోయి వుండును."

☆ ☆ ☆

"వంట అయింది."

"వినపడింది, జ్ఞాపకమూ వుంది. ఒక్క పది నిమిషాలు వోపికపట్టు, ఈ లోపున నన్ను కంగారు పెట్టకు. ఇవాళ వీడి ఆట కట్టితీరాలి!"

☆ ☆ ☆

"వంట అయింది."

"వచ్చేస్తున్నా, నువ్విన్ని మాట్లు పిలవాలా? నా ఆకలి నే నెరగనూ? నాకు కసి పెరిగిపోయింది. ప్రపంచం తెలవడం లేదు. అదీ వున్నదల్లా, చెప్పకేం?"

☆ ☆ ☆

"వంట అయింది."

"చెప్పావా? చూస్తున్నావా? కాస్తయినా యింగితజ్ఞానం వుండవద్దూ?"

☆ ☆ ☆

"వంట అయింది."

"ఓహోహో, వేపుకుని తినేస్తున్నా వేమిటి, మంచి రసకందాయప్పట్టులో వచ్చీ? నీ గోలే నీదా? మొగా డయిన వాడికి లక్ష పనులుంటాయి వీధిలో, ఆడది వచ్చి యిన్నిమాట్లు పిలవాలా భోజనాని కయితే మాత్రం?"

☆ ☆ ☆

"ఎక్కడున్నావు?"

"కనపడదూ?"

"ఏమి చేస్తున్నావు?"

"కనపడదూ?"

"మూతి బిడాయించుక్కూచున్నావేం?"

"తెలియదూ?"

"అంటే?"

"గొప్ప ఆలోచనపరులు గదా యేలినవారు?"

"అయితే?"

"నేనూ గొప్ప ఆలోచనలో వున్నా నని తెలుసుకోలేనప్పుడు–"

"ఇది ఆలోచిస్తూ కూచోడమా?"

"కాక?"

"ఈ వాలకం–"

"ఈ వాలకాని కేం? బుర్రగోక్కుంటే గాని మొగరాజులకు ఆలోచన తట్టదు."

"మూతి బిడాయించుకుంటేగాని ఆడవాళ్ళకి ఆలోచన సాగదు, తెలుసా మరి?"

☆ ☆ ☆

"గంట సేపణ్ణుంచి గుటకలు మింగుతూ కూచున్నాను, ఇంకా ఆలోచనేనా యేమిటి?"

"ఏమి చెయ్యమనీ మీ ఆలోచన?"

"వడ్డించమని."

"ఓహో! అయితే, మడికట్టుకోకుండా మీరు వడ్డించమనడం యేమిటీ?"

"అదెంత సేపూ?"

"మన కేం దేవతార్చనా, సంధ్యావందన మయినానా, యిది మాత్రం యెంతసేపూ?"

"ఇదిగో..........పట్టుపంచె... ...మరి లేవవేం?"

"మీరు స్నానం చెయ్యరేం?"

"శీతాకాలం, చలి వొణికించేస్తోంది, ఇవాళకి స్నానం చెయ్యను. పోనిద్దూ!"

"కడుపునిండా అన్నం తిన్నా చలి వొణికించేస్తోంది, పోనిద్దురూ!"

"రేపు తప్పకుండా చేస్తాను స్నానం, నీళ్ళు కాచు"

"అయితే, నీళ్ళపొయిలో నిప్పు పడేసివస్తాను, కూచోండి."

"పప్పేదీ?"

"కూరలో వుంది చూసుకోండి!"

"దేని కదే వండితే యేమీ?"

"నిక్షేపం వంటి తాంబూలం పొగాకు కలిపి వేసుకునే యేలిన వారికి పప్పుకూర పనికివచ్చింది కాదేం?"

"నా అలవా ట్లివాళ మారేవి కావు అలా జరిగిపోవలసిందే యిక."

"నేను వండింది వడ్డించాను. మీరు మారు మాట చెప్పకుండా తిని వెళ్ళ వలసిందే"

"పులు సింత చిక్కగా కాచావేం?"

"అది పులు సయితేనా?"

"మరేమిటీ?"

"ధప్పళం కాదుటండీ?"

☆ ☆ ☆

"అబ్బా. పెరుగు పులుపురొడ్డు. నాలుక చిల్లుపడి పోయిందిరా దేవుడా!"

"పోనీ, మజ్జిగ వడ్డించనా?"

"ఏదీ చూతాం."

"..........."
"రామ రామా! చూరునీళ్ళు. చప్పగా వుంది."
".........."
"ఏమీ, నుంచున్నావేం?"
"ఏమి చెయ్య మంటారూ?"
"పాలు పట్టుకురా."
"వో, కావలసినన్ని."
"చూడూ, మహామంచిదానవు గానీ—కసింత పంచదార కలిపి–"
"నేనా పని చెయ్యను సుమండీ!"
"అదేం?"
"తియ్యగా వుందనీ, మొగం మొత్తుతోం దనీ మళ్ళీ వంకలు పన్నడానికా? అబ్బో, వేషాలు నా దగ్గరా?"

## 6

"ప్రయాణం కామోసు!"
"అన్నమాటే!"
"వల్లకాదు."
"ఏదో పని కల్పిస్తావు, నాకు తెలుసు"
"కల్పించడం యెప్పుడో అయిపోయింది. ఇది పురమాయించడం"
"ఈ పూటకి విడిచి పెట్టలేవూ?"
"విడిచిపెట్టను. పాలమూరు వెళ్ళి మక్తాధాన్యమూ తోటశిస్తులూ పట్టుకురావాలి."
"చంపేశావు."
"మరేం ఫరవాలేదు. వచ్చాక చీట్లాడితే సరీ, మళ్ళీ బతకవచ్చు"
"........."
"వెళ్ళితీరాలి."

"ఈ నెలరోజులూ కష్టపడితిరా, పది పుట్ల ధాన్యమూ, వెయ్యి రూపాయలూ చేతికి వస్తాయి. మళ్ళీ సంవత్సరం దాకా మీకు స్వేచ్ఛ. ఉందనీ లేదనీ చీకూ చింతా అక్కర్లేదు, రేకవేసి పుట్టుకువచ్చారు."

"పచ్చకాగితం మారిస్తే నెలరోజులు గడవడం లేదు కొత్త శిస్తులు వస్తే గాని యిక అమావాస్య వెళ్ళదు. ఈ సంవత్సరం మీ పొగాకు కోసమే యాభయి రూపాయిలు–"
"అన్నట్టు పొగా కయిపోయింది. ఒక్క రూపాయి దయ చెయ్యాలి."
"ముందు పాలమూరు వెళ్ళివచ్చీ, తరువాత అడగడం."
"ఇప్పుడే యిస్తే యేమీ?"
"వచ్చాక యిస్తే మాత్రం యేమో?"

"రైతు లిప్పుడు కనపడతారా–"
"ఏమీ కనపడకా?"
"పొలాలు వెళ్ళరూ?"
"మీరూ వెళ్ళండి, యే పొలం యే స్థితిలో వుందో చూసుకోవచ్చు కూడా."
"అబ్బా, అద్దెకు సైకిళ్ళిచ్చే షాపు లుండగా నడిచివెళ్ళమంటావు."
"మన స్నేహితుల్లో సైకి ళ్ళున్నవాళ్ళు పదిమందిదాకా వున్నారు, వాళ్ళు కూడా మనం తిరగడమే గాని వొక్కడూ మనకి ఉపకారం చెయ్యడాయెమరి."
"........"
". . . . . . . . . . ."
"పోనీ, నడిచే వెడతాను సరా?"
"నడిచి కాకపోతే యెగిరి వెళ్ళండి, యెవరు వద్దన్నారూ?"
"..........."
"చెయ్యి చాపనక్కరలేదు. ఇస్తానంటే నే నివ్వడమే అయితే, తొరగా వెడితేనే రూపాయి. ఆలస్యం చేస్తే అర్ధ రూపాయే, వెడుతూ వెడుతూ యెక్కడయినా, చీట్లయినా చదరంగం అయినా ముట్టుకున్నారంటే మాత్రం, అమావాస్య వెళ్ళాకే యివ్వటం, తెలిసిందా?"

## 7

"స్, రామయ్యతండ్రీ!"
"బాగుంది సుమండీ! ఏ మహానుభావుడు నేర్పాడో గాని పుణ్యమూ పురుషార్థమూ కూడానూ!"
"అది కాదు, వడగొట్టేసిం దన్నమాట!"
"వుండు వంటి శీతాకాలం కాదూ మరీ? మీరు కనక నెగ్గుకువచ్చారు."
'చచ్చివస్తే–"
"వచ్చి బతికితే–"

"మీ అపస్వోపాలకేం గానీ, వసూళ్ళే మాత్రమో చెప్పండి తొరగా."
"కప్పన్ని మంచినీళ్ళయినా యిస్తూ, ముందు."
"అయినా అంటే?"
"ఇలాంటప్పుడయినా వొక్క కప్పు కాఫీ–"
"నేను చెయ్యలేను సుమండీ!"
"అదేం?"
"ఎండలో వెళ్ళినందుకు మీకు వడగొట్టింది, కుంపటి దగ్గిర కూచుంటే నాకు వడగొట్టదేం, పాపం?"
"ఏదో మెలికి లేకుండా మాట్లాడవు నువ్వు."
"మీరు మాట్లాడతారు మహా–వంకర లేకుండా."
"                    "

". . . . . . . . ."
"నన్ను విసిగించక నీకు తోచిన ధారకం యేదో వొకటి దయచెయ్యి."
"..........."
"మజ్జిగ తెచ్చావు."
"అవును"
"ఇందాకానే పులుపు చిచ్చు, ఈపాటికి బురబుర యెత్తే వుంటుంది."
"ఒక్క గుక్క చూసుకోరాదూ?"
"ఉప్పు కలిపి తెచ్చావా?"
"అబ్బే!"
"మరేం చేశావూ?"
"నిమ్మకాయ పిడిశాను."
".............."
"మూడు బొత్తులు, అరవై రూపాయిలు."
'........"
"ఇది పచ్చకాగితం."
"..........."
"ఇది అయిదు పదులు."
"..........."
"ఆరైదులు."
"        "
పదిహేను రెళ్ళు."

"పది వొకట్లు."
"............."
"రెండు వందల యెనబయ్యే తెచ్చారేం?"
"అరటితోట శిస్తు అంతేటగా?"
"మరి చెరుకుతోట శిస్తు?"
"అమావాస్య వెళ్ళగానే పట్టుకువస్తారు."
"ధాన్యం?"
"తెల్లవారాటప్పటికి వస్తాయి బళ్ళు."
"మీరు దీపాలు పెట్టాటప్పటికి ఇంటికి రండి, వెళ్ళండి."
"......"
"రూపాయి టీశా రెందుకూ?"
"ను వ్విస్తా నన్నదేగా?"
"అది మరుపు రాదు పాపం, ఇలా యివ్వండి."
"మాట తప్పుతావా?"
"ఇవ్వండి ముందు."

"వల్లకా దండీ!"
"నా చేతినుంచి నీ చేతికి, నీ చేతినుంచి మళ్ళీ నా చేతికీ గుంట తిరుగుళ్లెందుకూ?"
"మాట్టాడవద్దు, ఇవ్వండి"
"అబ్బా, మరి పుచ్చుకో."
"ఇదిగో, పెట్టుకువెళ్ళండి"
"దాని సిగ్గోసిన పట్టుదల గానీ—నీ చేత్తో యివ్వాలనా?"
"కాకపోతే? చేతిలోది చేతిలోనుంచే యెగరవేద్దా మనుకున్నారా?"

# 8

"మిమ్మల్ని దయతలచకూడదు సుమండీ!"
"ఏమి అపరాధం చేశానూ?"
"ఊరంతా తిరిగితేగాని దొరికారే కాదుట?"
"ఎందుకోసం?"
"అవునా కాదా?"
"ఇవాళ బడిసావడిలో వేశారు కుఱ్ఱవాళ్ళు మకాం."
"అయితే?"
"అంచేత నాకోసం వూరంతా తిరగవలసివచ్చి వుంటుంది."
"ఇప్పుడు నేను రావడానికి వీలులేదని కూడా అన్నారుట?"
"వీలంటే—"
"స్స్! నేనడిగింది వేరు."
"అన్నమాట నిజమే కాని—"
"ఇక కానీ యెందుకూ? దయచెయ్యండి."
"దయచెయ్య మంటే రెండ ర్థాలున్నాయి, తెచ్చింది వెంటనే యిచ్చెయ్యమనీ, కూచోమనీ."
"ఇక నుంచోవద్దని మూడో అర్థం కూడా వుంది, తెలివి!"
"అదే, చెప్పాగా? కూచోమని—"
"ఇక్కడ కాదండి, బడి సావట్లోనండి.'
"రమ్మని కబురుచేశావు మరి?"
"రావడానికి వీలులేదని కసురుకున్నారు మరి?"
"నాది తప్పే, వొప్పుకున్నాను."
"ఇంటికి రావడం అంటే అంత కష్టం కాబోలు!"
"పనేమిటో సెలవిప్పిస్తే—"
"సెలవిప్పిస్తే మాత్రం యింతకంటే మనకి సడసం వస్తుందా?"
"..........."
"ఎండపడి రావడమే కాకుండా, నోరు చేసుకుని అడిగారు కూడాను అని—"

"దయ వుందన్నమాటే!"

"పోనీ అని చేసి యిస్తే మాత్రం? మళ్ళీ యెప్పటి ఆటే. చెయ్యికడుక్కోడం తరవాయి."

"ఏమయినా ఫలహారం చేశావా యేమిటోయ్?"

"ఫలహారం కాదు, బండలు!"

"ఏదీ, తొరగా పట్టుకురా."

"అవతల మించిపోతోందా?"

"మించిపోతోందా అంటే, వాయువేగమనోవేగాలమీదే. మహానిక్కచ్చిగా నడుస్తోంది దశావతారీ. అసలు, రావడానికే మనసొప్పింది కాదు గానీ – ఇక నువ్వు తరవాయి అట్టే పెట్టవని–"

"మీ కివ్వకుండా అంతా నేనే మింగేస్తా ననుకున్నారా?"

"..............."

"..............."

"ఓహో, కాఫీ చేశావా? దీనికి సాయం రెండు పకోడీలు కూడా వుంటేనా?"

"నోరూరుతోందా?"

"మెల్లిగా అడుగుతున్నావా?"

"తింటున్నట్టే వుంది కామోసు!"

"ఉండదూ, చూపు దానిమీదికి పోతేనూ?"

"ఇక చెయ్యడం యెందుకూ పనిచెడీ?"

"...అబ్బా, ఉడుకూ మడుకూను. నాలుక చుర్రుమంది."

"చన్నీళ్ళలో పెట్టి చల్లారుస్తానిలా యివ్వండి గ్లాసు."

"ఊరికే మాటవరసకన్నానుగాని మన జిహ్వ కీ వేడి వొక లెక్కా?"

"అయితే, వొక్కమాటు కుంపటిమీద పెడతా, నివ్వండి"

"మంచిపనే గాని–కాఫీకారిక వొకటుంది, విన్నావా?"

"ఏమిటో అది?"

"కాఫీ వేడిగా వుంటే భరించలేం, వేడిగా లేకపోతే భరాయించలేం."

"సంధ్యావందనం రాకపోతే మానె, కాఫీకారిక లయినా రావద్దూ అవధానులవారి పుత్రరత్నం గారికీ?"

"............"

"పోనీ, వెళ్ళండి, నాకేం?"

"ఇంకా యేదో తరవాయి అట్టేపెట్టావు, నాకు తెలుసు"

"ఏమయినా యిక మీరు నుంచోరు, నాకూ తెలుసు"

"అబ్బే, వెళ్ళను, రా మరి."

"మీరిక్కడ ఆలస్యం చేసి వెళ్ళారంటే అక్కడ వాళ్ళు చేరనివ్వరు సుమండీ!"

"వాళ్ళమొగం! నా సరదాకొద్దీ నేను వెడుతున్నానుగానీ– వో–హో–అదా? తాంబూలదానంబు తప్పక చేసిన–"

"ఆడా మొగా భేదం–"

"పద్యం దిద్దెయ్యనూ?.......వా! తమలపాకులు కావివి, వెన్నప్పాలు."

"మరి పోకచెక్కలో?"

"కలకండ పలుకులే. అయితే, తాంబూలం కాగానే తరవాయి యేమిటో.....?"

"....దీని తరవాత.........యేమిటో?"

"అంతే అంతే, ముక్తాయింపు బులబులాగ్గా తేలిపోవాలి–మరి సెలవ్!"

"దీల్లో మాత్రం పండితులే. ఇదిగో! దీపాలు పెట్టాటప్పటి కింటికి రావాలి, చెప్పాను కదా?"

## 9

"అన్నకాడి కాలస్యం అయినట్టా. కానట్టా? అదిగో, గుడి దగ్గిర తిరుగుతున్న మనుష్యులు కనపడుతూనే వున్నారు, వేళమించలేదన్నమాటే... అయితే, దీపాలు పెట్టడం అంటే పొద్దు గూకడమా, చీకటి పడ్డమా?... అట్నుంచి నరుక్కువద్దాం...."

"......"

"వినపడలే దన్నమాట. కనక, మళ్ళీ...."

"........."

"ఊహూ, గట్టిగా తట్టి చూద్దాం..."

"......"

"తలుపు దగ్గిరే వుండి నన్నాడిస్తోందా, వంటింటో వుందా?..."

"....."

"వంట యెప్పుడో అయిపోయి వుంటుంది, ఇదంతా నటనే, సందేహం లేదు. అబ్బో! నా దగ్గిరా వేషాలు?"

"....."

"చిటపట చినుకులు, దుప్పటి తడిసెను.
తలుపు తియ్యవే భా–మా, వేగ తలుపు తియ్యవే భా–మా!"

"..........."

"ఇదిగో, ఇక్కడ నన్నింత సేపు నుంచోబెట్టి ఆలస్యం అయిందని పేచీపెడితే నే నొప్పుకో నే మనుకున్నావో గాని."

"...రేచీక టయినా పెట్టాడుకాడమ్మా దేవుడు!"

"నా కళ్ళు పోవాలని వుందా?"

"అడిలిపోయి నేను మంచం పట్టాలని వుందా?"

"ఇంతట్లోకే?"

"క్షణం చాలు, భయపడడానికి."

"అయితే, రిస్టువాచీ కొనిపెట్టు, రేపట్నుంచీ నువ్వు రమ్మన్న క్షణానికి వచ్చి వాలుతూ వుంటాను."

"అదేమంత భాగ్యం, ముందు బుద్ధి కొనుక్కురండి!"

☆ ☆ ☆

"పట్టుపంచె కట్టుకుని సిద్ధంగా వచ్చారు గానీ, ఆకుల్లేవు వడ్డించడానికి."
"కంచం పెట్టు."
"చీకట్లో నేను కడగలేనండీ!"
"చీకట్లో నేను ఆకులు కొయ్యలేనండీ!"
"మరి పగల స్తమానమూ యేమి చేశారూ?"
"ఇప్పుడు చెప్పిన మాట నువ్వప్పుడే యెందుకు చెప్పావు కాదూ?"
"ఇంటో యేమి వుందో, యేమి లేదో మీరు కాస్త పరకాయించుకుంటూ వుండనక్కరలేదూ?"
"అదంతా నాకు తెలియదు నువ్వు చెబితేనే చెయ్యడం నా పూచీ!"
"బాగుంది, ఆకులుంటేనే వడ్డించడం నా పూచీ మరి, తెలుసా?"

## 10

"అదృష్టవంతుడైన మొగవాడికి, భోజనం చేసి లేచాటప్పటికే తమలపాకులు చిలక లందించే పెళ్ళాం దొరుకుతుంది."
"పెట్టిపుట్టిన ఆడదానికి, తనతో కలిసే తాంబూలం వేసుకునే మొగుడు దొరుకుతాడు!"

☆ ☆ ☆

"నీ భోజనం తెమిలాటప్పటికి వూరు మాటుమణిగింది. పక్క దులిపి బాగుచెయ్యాలి తొరగా, కళ్ళు మూసుకుపోతున్నాయి నాకు."
"అంత అతిశయం కూడదు సుమండీ, సంసారికి!"

☆ ☆ ☆

"చలి వొణికించేస్తోంది, హు హు హు!"
"శాలువు మీద రగ్గు కూడా కప్పనా?"
"అలా పోయేది కాదిది!"
"కుంపటి యెత్తుతా నుండండి!"
"పోనీ, నా కొక్కడికేనా యేమిటి?"
"ఆ మాటమీద నిలవండి."

*(1931 జనవరి 'భారతి' నుంచి; సెంపకం)*

★ ★ ★

# "నాటకం"

"ఏమి చేస్తున్నా వన్నయ్యా?"

"ఇదిగో, యిదోయి తమ్ముడూ!"

"నోటితో చెప్పగూడదూ?"

"కళ్ళతో చూడగూడదూ?"

"....అయితే, చూడకుండానే అడిగానంటావా?"

"... కాకపోతే, చూసినవాళ్ళకీ చెప్పాలంటావా?"

చుట్టానికి వల్లమాలిన కోపం వచ్చింది.

అది అసంతృప్తిగా పరిణమించింది.

ఆ పరిణామం అబ్బురపాటుగా మారింది.

అది నిర్విణ్ణత అయింది.

చివరికి విసువు అయి, అది ధుమధుమ లాడించింది

"ఛా" అనుకున్నాడు.

అనుకుంటూనే, విశ్వనాధాని కెదురుగా స్తంభాని కానుకుని చతికిలబడ్డాడు.

చతికిలబడి, అతను పలకరిస్తేనే పలుకుదా మనుకుని మూతి బిడాయించు కున్నాడు; కాని వూరుకోలేక పోయాడు

తన రాక వంటగదిలో తెలవాలి మరి.

"నాటకం చూడవూ?" అని డొంక కదిపాడు, మెల్లిగా.

"ఏమిస్తారు చూస్తే?" అనడిగాడు విశ్వనాధం.

"భేష్!"

"..........."

"రాఘవాచారోయ్ వచ్చిన నటుడు!"

"..........."

"చూడాలంటే మళ్ళీ యింతట్లో దొరుకుతాడా?"

"టిక్కెట్టుకోసం ఖర్చయిన డబ్బు యెంతట్లో నయినా మళ్ళీ మన చేతికి వస్తుందా?"

"నీ కెంతసేపూ డబ్బురంధి తప్ప మరేమీ లేదు."

"మరి, రాఘవాచారి యెందుకు వచ్చాడంటావ్?"

"ఒక పేదవిద్యార్థికి సాయం చెయ్యడానికి"

"చాలా గొప్ప సంగతి. అయితే, యింటి దగ్గిరనుంచే తెచ్చాడా డబ్బు?"

"వా! కోట్ల విలవయిన ప్రశ్న వేశావన్నయ్యా!"

విశ్వనాథం బదులుచెప్పలేదు.

వంటింటో అలికిడి లేదు.

వాకట్లో గాలీ లేదు

ఉడికిపోసాగాడు.

ఇంతలో గదితలుపు తెరుచుకుంది.

లేతాకుపట్టు దీపపు కాంతి చూపు లాకర్షించింది

ఒకచేత తాంబూలపు పళ్ళెం పట్టుకుని ద్వారానికి కొంచెం యెడంగా నుంచుని వుంది కామేశ్వరి.

"ఎవరుచెప్మా?" అని చూస్తూనే "వెళ్ళడమా మానడమా" అనుకుంటూనే యువతలికి వచ్చిందామె.

గదిలో వుండగా వొక సొగసూ, వాకట్లోకి వచ్చాక వొక సొగసూ కులికిందామె మొగం

తెల్లపువ్వుల తోపుచీర కట్టుకునీ, చిన్నిచుక్కల తెల్లజాకట్టు తొడుక్కునీ వుందామె

కామేశ్వరి అంత చక్కని దని అతనెప్పుడూ అనుకోలేదు

చకితు డయిపోయాడు.

"ఇదిగో, యెక్కణ్ణుంచి మరిదీ?" అని ఆమే పలకరించింది, సాదరంగా.

"ఇంటిదగ్గరనుంచే నమ్మా!"

"కాళ్ళు కడుక్కుందువుగాని, నీళ్ళు తెస్తున్నా"

"కొళాయి దగ్గిరే కాళ్ళు కడుక్కువచ్చాను నువ్వు శ్రమపడ నక్కర లేకుండా మునిసిపాలిటీవాళ్ళు మీయింటి యెదటే వేశారు కుళాయి"

ఒక్కమాటు పుస్తకం మీది చూపు లిటు మళ్ళించి "ఇంకేమీ లేవుట్రా అలాంటి యేర్పాట్లూ?" అనడిగాడు విశ్వనాథం, పరీక్షగా చూస్తూ.

"మెరుపుదీపం కూడా మీ గుమ్మంలోనే పడింది మొలిచినట్టు"

"ఇంకా?"

చూశాడు గాని; చుట్టాని కేమీ కనపడలేదు.

అయినా, విశ్వనాథం చూపులింకా అలాగే వున్నాయి, నిలవతీస్తున్నట్టు.

అది గుర్తించి "భోజనం–" అని అర్థోక్తిలోనే వూరుకుంది కామేశ్వరి

"అప్పుడేటమ్మా?" అంటూ అవ్యవధానంగా యెదు రడిగాడు చుట్టం, అమ్మయ్యా అనుకుని.

"ఇదే రావడమా?"

"రావడం అయిదుగంటల బండిలోనే వచ్చాను కాని; ఆలస్యం అయినా మీ యింటో లోటు లేదుగదా అని–"

"అప్పు డనగా వచ్చి యెనిమిదిన్నర దాకా యే పెద్దగుర్రానికి పళ్ళు తోముతున్నావూ మరీ?"

"రెయిల్లో మనిషిమీద మనిషిగా కూచున్నాం. నా శరీరం అరిటిగెల కావేసిన ట్టయిపోయింది అంచేత, కాస్త గాలిమేస్తే గాని వుండలేక, యిప్పటి దాకా గోదావరి గట్టున కూచుని, పనిలో పని వొక్క బుడగ కూడా వేసేసి–"

"మీ అన్నయ్యదగ్గిర కూచో, నిమిషంలో వంట చేసేస్తాను, ష్టవుమీద."

"అప్పుడే మీ భోజనా లయిపోయినాయా?"

"ఇవాళ కొత్తా, ను వ్వెరగనిదా?"

"పాపం—మళ్ళీ నా కోసం—"

"పాపాలకు పోక, కుర్చీ అలా మండువాలోకి లాక్కుని కూచో."

"ఇదిగో, చూడూ, ఎలాగ శ్రమపడుతున్నావు కనక, కాస్త తొరగా—"

"ఏమిటా వుపద్రవం?"

"నాటకం చూడ్డానికి వచ్చానమ్మా! ఎనిమిదిన్నర దాటడం నీకే తెలుసుగా?"

విశ్వనాథం చురుగ్గా చూశాడు

"మరి మా చెల్లాయిని తీసుకువచ్చావు కాదేం?" అనడిగింది కామేశ్వరి, శ్రీవాభింగాభిరామంగా చూస్తూ.

చుట్టానికి కులాసా పొంగుకుంటూ వచ్చింది

"పెళ్ళికి వెడుతూ పిల్లిని—" అంటూ మాట నాన్చేశాడు, తన సద్యస్ఫూర్తి అంతా మొగం మీది తెచ్చుకుని.

"అవునులే. కుక్కకి పిల్లెందుకూ?" అనడిగేసింది కామేశ్వరి, అవ్యవధానంగా

ఎగిసిపడి చూశాడు విశ్వనాథం.

తాంబూలపుపళ్ళెం గదిలో వుంచివచ్చి, వంటింటి తాళం తీసింది కామేశ్వరి, భర్తకేసి నీరసంగా చూస్తూ

## 2

విశ్వనాథానికి వొళ్ళు రవులుకుపోయింది.

అసలు, రాజమహేంద్రవరం బదిలీ అయినప్పణ్ణుంచీ చుట్టాలంటే రోత పుట్టిం దతనికి

అన్ని విధాల అనాదారం కనపరిచినా కణాయించుకునే కూచున్న ఆ చుట్టం అంటే డోకే వచ్చేటట్టయింది.

మధ్యాహ్నానికి మధ్యాహ్నమూ ఇలాంటిదే తటస్థించింది.

నాటితో, ఆధునికాంధ్రకవిపండిత సభ ఆఖరు.

ఇవాళ, అతనికి నచ్చిన రాతగాళ్ళు తమ కొత్త రచనలు చదువుతారు, స్వయంగా.

అంచేత, నాలుగింటికే బయలుదేరారు భార్యాభర్తలు

బండి కూడా యెక్కారు.

బండిమనిషి కళ్ళెం లాగి కొరడా వూపుతూ "తప్పుకోండి బాబయ్యా!" అన్నాడు.

"ఆపు బండి" అన్నా రెవరో.

విశ్వనాథం వులిక్కిపడి చూశాడు.

నెత్తిమీద మూట, వొంటినిండా చెమట వోడికలు, ముఖాన శూన్యం, చేతిలో కగ్గిన రాగిచెంబు–వేదమూర్తి సాక్షాత్కరించాడు, అప్పుడే సోమకాసురుని పట్టుతప్పించుకుని వస్తున్నట్టు.

"మా మామయ్య" అంది కామేశ్వరి, చకిత అయి.

విశ్వనాథం మాట్లాడలేకపోయాడు

"ఎక్కణ్ణుంచి మామయ్యా?" అని కామేశ్వరే పలకరించింది, మొగుడు తప్పుకుంటే దిగుదా మని చూస్తూ.

"తిరపతినుంచి వస్తున్నాను. రాత్రి కూడా భోజనం లేదు" అన్నాడు మేనమామ, నాలుకతో పెదవులు తుడుపుకుంటూ.

విశ్వనాథం కొయ్యయిపోయాడు.

అతను కదల్లేకపోడం చూసి, అతన్ని రాసుకుంటూనే దిగుతూ, చెవిలో నోరుపెట్టి "మీరు వెళ్ళండి" అని చెప్పి, బండి దిగింది కామేశ్వరి

ఇదంతా నెమరుకి వచ్చింది విశ్వనాథానికి.

అతని మొగం జేవురించింది.

అంతే!

ఏతావాతా–

కామేశ్వరి చాలా చురుకైన మనిషే.

చెయ్యవలసిన పని నిమిషాలమీదే చేసేస్తూ వుంటుంది

అయినా, తన తరవాత ఆమె భోజనం చేస్తే కొంచెమయినా ఆలస్యం కాకమాన దని ఆమెని తన బంతినే కూచోబెట్టుకున్నా డత నీపూట.

ఒకటి రెండుమాట్లు నెయ్యి కూడా తనే వడ్డించాడు.

అయినా, స్థలశుద్ధి చేసి వంటిల్లు విడిచిపెట్టడానికి కామెకి తన అంచనా కంటే మరో రెండు నిమిషా లెక్కువసేపే పట్టింది.

ఎలా గయినా యీ ఆలస్యం కూడదీసుకోవాలని, తరవాత, ఆమె చాలా చురుగ్గానే పనిచేసింది

అతివేగంగా చీర సింగారించుకుంది

జడలో మల్లెదండ సద్దుకుంది

మొగానికి మంచుమీగడా, బట్టలకు సెంటూ రాసుకుంది

అతని కండువాకీ, చొక్కాకీ కూడా రాసింది

తాంబూలాల పళ్ళెం చేతపుచ్చుకుని భామవేషంలాగ బయలుదేరింది.

కాని తలుపు తీశాటప్పటికి ఈ కందారాజు ప్రత్యక్షం!

ఇంత జరిగినా, పై కేమీ అనకుండా – మాటే ఆడకుండా – అక్కస్సంతా మనసులోనే జీర్ణం చేసుకుంటూ రామదాసు నాటకం చూసుకోసాగాడు విశ్వనాథం

అయిదు నిమిషా లయింది

వంటిటు స్టవ్వు అల్లరి ప్రారంభం అయింది

ఒక్కమాటు చ(రుమంది విశ్వనాథానికి, కాని చుట్టానికి మనసు కుదుటబడింది.

ఇంకేం, నోరు విడింది,

మనసులో చింతన చేసుకోడాని కేమీ లేనప్పుడు జరిగే దంతేగా?

"విశేషాలే మిటన్నయ్యా?"

"వరసపెట్టి నా పని కూడా పాడుచెయ్యాలా తమ్ముడూ!"

"ఇవాళ, మహా చిరాగ్గా వున్నా వేమిటోయ్?"

"అది కలిగిస్తున్నది నువ్వు!"

"క్షమించు"

మొగం పక్కకి తిప్పుకున్నాడు చుట్టం.

వీధిలో, ముందు పెద్ద పెద్ద దీపాలూ, వెనక గాఢాంధకారంగా యేదో కారు పరుగెత్తింది, బొంయి మంటూ

చుట్టానికి వూహా కెళ్ళించింది

"ఇది వొక్కటే చెప్పు, మరి నీ జోలికి రాను. నాటకం ముగిసీ ముగియగానే వెడదా మంటే యే దయినా బస్సు–"

"మళ్ళీ మొదలా?"

ఇది కొంచెం గదిమినట్టుండగా చుట్టం తెల్లపోయాడు కాని; ఉత్తరక్షణంలో అభిమానం ముంచుకువచ్చింది

"ఏదో ద్వంద్వార్థంగా వుంటున్నాయి నీ మాట" లన్నాడు వెంటనే, కనుబొమలు ముడుచుకుని

"నీ గ్రహణశక్తి కలా అనిపిస్తోంది"

"నలిపిచంపక, వున్న దేదో కాస్త విప్పి చెబుదూ!"

విశ్వనాథం మాట్టాడలేదు.

చుట్టమూ మాట్టాడలేదు

విశ్వనాథం చూపు గ్రంథం మీద లగ్నం అయింది

"రామదాసు" అన్న అక్షరాలు చుట్టం కళ్ళకి కట్టాయి

"మనం చూడ్డానికి వచ్చిన నాటకం, చదువుకుని ఆనందిస్తున్నాడు అన్నయ్య డబ్బుకీ ప్రాణానికీ లంకె మరి" అనుకున్నా డతను, తన సాహసౌదార్యాలు స్మరించుకుంటూ.

అతని రసికహృదయం భళ్ళున వికసించింది.

వెంటనే పేరుపడ్డ నటకుల ననుకరిస్తూ పాట మొదలుపెట్టా డతను

"ఏమాత్రం రా బేరం?" అనడిగాడు విశ్వనాథం, పుస్తకం మూసేసి,

"ఏం బేరం?"

"బాగుంది–ఎంతకి వొప్పుకుని వచ్చావూ?"

"దేనికోయ్?"

"నాటకంలో వేషం వెయ్యడానికి, దాస్తా వేమిటోయ్?"

"నీ ధోరణి నా కర్థం కావడం లేదు"

"నీ ధోరణి నా కర్థం అవుతోంది మరి!"

"ఏమనీ?"

"నీ భాగం చింతన చేసుకుంటున్నా వని."

"....అదా నాయనా, ఇంతాకణ్ణుంచీ ఆ చి(రుబుస్సు – నీ చదువుకి అడ్డువచ్చాననా?"

విశ్వనాథం మాట్లాడలేదు

అయినా, చుట్టానికి మా(త్రం బరువు దిగిపోయిన ట్టయింది.

మనస్సు తేరుకుంది.

"చిరాకు పుట్టనంతసేపూ చాలా మంచివా డన్నయ్య!" అనుకుని సంబరపడుతూ నోరు బిగపట్టు క్కూచున్నా డతను.

# 3

కళ్ళు మూసుకుని వుండి తల యెగరవేసుకుంటూ కూనిరాగాలు తీస్తూ పరవశు డవుతూ వుండిన్నీ యాదాలాభంగా వీధికేసి చూసి "వేషం మార్చేసి వదిన వీధిలో నుంచి వస్తోం దేమిటీ?" అనుకున్నాడు, చుట్టం, విస్మృతాస్యుడై

"చెల్లి యింకా వంటింటోనే వుందా యేమిటి మరిదిగారూ?" అనడిగింది, వస్తూనే, ఆ జంగమప్రతిమ.

"దయచెయ్యండి" అన్నాడు విశ్వనాథం, ముందు పుస్తకం మూసేసి, "వంటింటికి తాళం వేసి ముప్పావుగంట అయింది, కాని మళ్ళీ తియ్యవలసి వచ్చింది" అన్నాడు తరవాత.

"ఏమీ?" అనడిగింది రుక్మిణి, ఒక్కమాటు చుట్టంకేసి చూసి

"చుట్టం వచ్చాడు"

"ఎవరు, ఏమవుతారు?"

"అడిగో, వాడు– మా పింతల్లి కొడుకు."

"ఎందుకు వచ్చారూ యిప్పుడూ?"

చక్కదనం చూసి మొదట ఆదరంగానే చూశాడు కాని; యీ ప్రశ్నలతో వ్యగ్రుడై, రుక్మిణిని గుర్రుగా చూశాడు చుట్టం.

"నాటకం చూడ్డాని కీవూరూ, భోజనానికి మాయింటికీ వచ్చాడండీ!" అన్నాడు విశ్వనాథం.

"చుట్టపుచూపులకు కాదూ?" అంటూ సాగతీసుకుంది రుక్మిణి

విశ్వనాథం చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు.

చుట్టానికి చీమలూ జెర్రెలూ పాకుతున్న ట్టనిపించింది

"అయితే, చెల్లాయి మళ్ళీ వంట చేస్తోం దన్నమాట! ఆ స్టవ్వు గోల అందుకా?"

"కుంపటిమీద వండితే మావాడి కాలస్యం–"

"మరి యింత రాత్రయాక వచ్చారేం?"

"పెందలాడే రావడానికి, పొయిదగ్గిర కూచోవాలా, పైపనులు చెయ్యాలా?"

చుట్టం చూపులు నిశ్చలా లయిపోయాయి.

"ఇది రుక్మిణితో ఛలోక్తిగా అన్నమాటా, మనయెడల నిరసనగా అన్నమాటా?" అంటూ చర్చలో పడ్డా డతను.

"తాను స్కూలు ఫైనలే. నేను బి.ఏ. అనర్చుని నన్ను నిరసించి బతగ్గలడా వీడు?" అని తేల్చుకున్నాడు చివరికి.

చుట్టం ఆ స్థితికి వచ్చాటప్పటికి రుక్మిణి మరో అడుగు ముందుకి వేసింది "తొమ్మిది కాదూ మరిదిగారూ?" అనడిగిం దామె, నిశ్చలంగానే చూస్తూ.

గదిలో వున్న గడియారం కేసి చూసి "తొమ్మిదీ రెండు" అన్నాడు విశ్వనాథం.

"బాబోయ్!" అనుకున్నాడు చుట్టం

పడకకుర్చీలో పడుకుని వున్నవా డల్లా నిటాగ్గా కూచున్నాడు, కంగారుగా.

"మరిదీ! యెసరు కాగింది, యిక బియ్యం పొయ్యడం–" అంటూ గుమ్మంలోకి వచ్చింది కామేశ్వరి

"సేనాధిపతికి యుద్ధవార్తల్లాగ, వంట యేకాడికి వచ్చిందో యే క్షణానికాక్షణం మీ మరిదిగారికి నివేదించుకోవాలా యేమిటి చెల్లీ?" అనడిగింది రుక్మిణి.

"ఇదిగో, అక్కయ్యగారే? ఇంటోకి రండి."

"కబుర్లు మొదలుపెడితే వంట మరిచిపోతావు నువ్వు, వదినగారి నిక్కడే వుండనియ్యి."

"బియ్యం నేను కడిగి పెట్టనా చెల్లీ?"

"ఇంకేం? మీ చెల్లెలిమీద అంత అభిమానమైతే, పీట పరచడాని కొకర్నీ, మంచినీళ్ళుంచడాని కొకర్నీ, మడిబట్ట అందించడాని కింకొకర్నీ, వడ్డించడానికి మరొకర్నీ కూడా సాయం తీసుకురండి వదినగారూ!"

"ఎందరు కష్టపడకపోతే, మీ అన్నదమ్ములకు కూచున్న చోటికి కుంభం వస్తుంది మరిదిగారూ?"

"ఆ కష్టపడ్డంలో, ముందు రుచిచూడ్డం కూడా వొకటేనా?"

"అది మీ అక్కాచెల్లెళ్ళ పద్ధతి కామోసు, మామీద రుద్దుతున్నారు"

గతుక్కుమనిపోయాడు చుట్టం.

అది గుర్తించి తల పంకించుకుంది రుక్మిణి

"మరిదీ, యిక పది నిమిషాల్లో భోజనం అయిపోతుంది" అని చుట్టానికి చెప్పి "టయి మెంతయిం దండీ!" అనడిగింది కామేశ్వరి, భర్తని.

"తొమ్మిదీ పదమూడు" అన్నాడు విశ్వనాథం.

"మీ వాచీ నాలుగు నిమిషాలు స్లో" అంది రుక్మిణి, తన రిస్టువాచీ చూసుకుంటూ,

చుట్టమున్నూ తన రిస్టువాచీ చూచుకున్నాడు

అతని మొగాన ఆత్రం కమ్ముకుంది.

"ఎంతయింది మరిదీ?"

"తొమ్మిదీ పదిహేను!"

"బాబోయ్!" అంటూ కంగారుపడి, వొక్క అడుగు లోపలికి వేసి, వెనక్కి వచ్చి మళ్ళీ గుమ్మంలో నుంచుంది కామేశ్వరి, భర్తకేసి చూస్తూ.

చూసిచూసి "అధరు వేమయినా వుందా, చెయ్యాలా చెల్లీ?" అనడిగింది రుక్మిణి.

"లేదండీ, వొట్టి కందిపొడితో యెలా అన్నం పెట్టనూ పాపం, మా మరిదికి? బంగాళదుంపలు వేయిస్తాను."

"అన్నం వుడికితే అదెంతసేపులే"

"అయితేనూ, నువ్వు కబుర్లు చెబుతూ నుంచోడమేనా, బియ్యం కడిగి యెసట్లో పొయ్యడం వుందా? అవతల మావాడి కింకా యేమేం పనులున్నాయో మరి?" అంటూ కస్సుమన్నాడు విశ్వనాథం.

అత నిలా అన్నా డంటే, ఆ విసురు ఇంకా పూర్తి కాలేదు గాని; గభీమని లేచి నుంచున్నాడు చుట్టం.

"తెలిసింది లే అన్నయ్యా! నీ ధోరణి యిప్పటికి బాగా బోధపడి పోయింది. ఒక్క పూట భోజనం భాగ్యానికి నువ్వింత మొగం చూచుకుంటావనుకోలేదు నే నెప్పుడూను. అన్ని గడుసు రాకలు చూపించకపోతే స్పష్టంగానే చెప్పెయ్యరాదు, అన్నం పెట్టలే నని. తీరా, వూళ్ళోకి వచ్చి గుమ్మంలోకి రాకపోతే అతిశయం అనుకుంటా రని గాని, రానూ పోనూ రూపాయి పావులా రెయిలుకీ, రెండు రూపాయిలు నాటకానికీ, మరో అర్ధరూపాయి సాదర్లకీ ఖర్చుపెట్టగలవాణ్ణి, మూడు పావులాల డబ్బులు హోటలువాళ్ళ మొగాన పారెయ్యలే ననుకున్నావా? వెతుక్కుంటూ వచ్చినందుకు – చాల్లే నేర్చుకుపోయావ్! నువ్వింత పరమలోభి వని నే నెప్పుడూ అనుకో లేదు, ఇక నీ గుమ్మంలో అడుగుపెడితే అడుగు. ఆడవాళ్ళతో సరిగా ఆడేశావ్ భాగోతం?" అంటూ కంగారుగా చెప్పులు తొడుక్కుని విసురుగా బయలుదేరేశాడు.

"ఏమన్నారూ? నుంచోండి" అంటూ గదిమింది రుక్మిణి

ఆమె కళ్ళల్లో నిప్పులు రాలుతున్నాయి

అది చూసి చకిత అయింది కామేశ్వరి.

చుట్టం మాత్రం వీధిలో అడుగుపెట్టిమరీ తిరిగిచూశాడు

## 4

"శుద్ధపశువు. చదువూ సంధ్యా లేక–"

"చదువు లేకపోవడం యేమిటి వదినగారూ? రెండేళ్ళు తప్పి చివరికి బి.ఏ. అయిపోయా డండీ!"

"అయితే, యిప్పటికి వచ్చిందా బి.ఏ. కి బుద్ధి?"

"బుద్ధి వచ్చినవా డలాగే మాట్లాడతాడు టండీ?"

"కాకపోయినా, మీరు తెగేదాకా లాగుతా రండీ!" అంది కామేశ్వరి యివతలికి వచ్చి.

"ఆ మాట మీ అక్కయ్య గారి ననమను."

"అయితే, మధ్యాహ్నానికి మధ్యాహ్నమూ, యిప్పటి కిప్పుడూ కూడా యీ చుట్టాల వుప్పెన యేమిటి చెల్లాయీ మరీ?" అనడిగింది రుక్మిణి.

కామేశ్వరి మాట్లాడలేకపోయింది.

"ఊరుకుంటావేం?" అని ముదలకించాడు విశ్వనాధం.

"వెర్రిపిల్ల, వూరుకోక చెల్లెమ్మ యేమి జవాబు చెబుతుంది లెండి పాపం! వాళ్ళకి తెలవాలి గాని, తీరా యింటికీ వచ్చాక వండడం తప్పుతుందా, పెట్టడం మానుతుందా?"

"అయితే, ప్రతీపూటా రెండో వంట చెయ్యవలసిందేనా?"

"ఇక వూరూరా చాటేస్తాడు; అమ్మలక్కలందరూ నవ్వాడిపోసుకుంటారు."

"ఇదివరకే ఆడిపోసుకోడం లేదంటావా? రావడం మానేస్తే యేమి చేసినా సరే, యేమంటారు వదినగారూ?"

"చాటేస్తాడంటే తక్కినవాళ్ళకిన్నీ బుద్ధివస్తుంది, మంచిదే కాదూ?" అనడిగింది రుక్మిణి.

"మనస్సులో తిట్టుకుంటూ చేరనివ్వడం కంటే గ్రహించ లేనివాళ్ళ కిలాగే చెయ్యాలి. వీడివా ళ్ళందరూ నన్ను లోభి అంటారు, అంతేనా?"

"ఎనిమిది న్నరకి వచ్చి–"

"అయ్యో, అస లయిదు గంటల బండిలోనే వచ్చాట్టండి! కాని, గోదావరి గట్టు పొద్దూగునా షికారు కొట్టాడుట, విన్నారా అక్కయ్యగారూ?"

"హోట లున్న వూళ్ళో, మరో పనిమీద వచ్చీ కూడా చుట్టాల యింటి మీద పడడం నిలిచిపోవా లంటే–"

"అదలా వుండగా, వీరందరూ, మీ మరిదిగారికీ, అంతకంటే నాకూ ఆచారం తక్కువ అనీ, ఆ గుడ్డలతోనే తింటా మనీ మాటిమాటికీ దెప్పుతూనే వుంటారక్కయ్యగారూ!"

"మరి బుద్ధి వుండేనా తిండికి చేరడం?"

"వాళ్ళతో పని వుంటే గాని నేను చుట్టాల యింటికి వెళ్ళను వదినగారూ! కాకినాడ వెడితే, మా చెల్లె లా వూళ్ళోనే వున్నా, హోటల్లో భోజనం చేసి, తరవాత దాన్ని చూసి వస్తాను. నిజంగా, నే నీ కందారాజుగారి యింటికి వెళ్ళి పదేళ్ళు దాటిం దండీ!"

"పదిహేను దినాలు కాలేదు వీళ్ళ నాయన వచ్చి పొద్దుటి పూట తొమ్మిదింటికే వడ్డించ మనీ, రాత్రి పది దాటాక వచ్చీ, మూన్నాళ్ళు నా యెముకలు కొరికేశా రక్కయ్యగారూ! విన్న ఆరవేసిన బట్ట పనికిరాక, తడిబట్టతో వంట చెయ్యడం అలవాటు లేక–"

"శ్రోత్రియు డనీ, దేవతార్చనపరు డనీ, నే నాయ న్నెప్పుడూ గౌరవంగానే చూస్తానండీ, యేమి పెట్టినానూ? కాని, వీడి మాట చెప్పండీ!"

"మీ రామాట అంటే జ్ఞాపకం వచ్చింది, వొకమాటేం జరిగిందనుకున్నారు మరిదిగారూ – ఆవేళా! బొబ్బట్లు చేసుకున్నాముా! జ్ఞాపకం వుందా చెల్లీ? రాకరాక వచ్చాడు మా తమ్ముడు. మీ బావగారు తాపితా కట్టుకున్నారు. నేను వడ్డిం చేశాను. 'నేను మడికట్టుకోను, నీ బంతికీ రానిస్తావా లేదా బావా?' అనడుగుతున్నాడు మావాడు అలాంటప్పుడు యములాళ్ళ లాగ అరుగురు చుట్టాలు వచ్చిపడ్డారు."

"అయ్యో!"

"అయ్యో అంటే, యెద్దుపుండు కాకికి నొప్పా? పోనీ అంటే అందరూ మొగాళ్ళు. ఆ బట్టలతోనే తినే రకం కోర్టులో సాక్ష్యం యివ్వడానికి వచ్చారుట కూడానూ"

"ఇదిగో, యీ రకమే" అన్నాడు విశ్వనాథం, వీధికేసి చూపిస్తూ.

"నా ప్రాణా లెగించిపోయాయి. పిండివంట వెనక్కి పెట్టేద్దా మంటే మరి మజ్జిగ? అన్నం యెలాగా తప్పదు, కూరా చారూ చెయ్యాలా?"

"బాబోయ్!"

"ఏం, బాబో యనేదానవు, అంతా అయిపోయాక నువ్విప్పుడు మళ్ళీ మొదటికి వచ్చావా లేదా?"

"ఎసరు పెట్టావా లేదా చెల్లీ?"

"అప్పుడూ మీ రేమి చేశారో అది చెబుదురూ అక్కయ్య గారూ!"

"నాకు మహా చెడ్డ కోపం వచ్చేసింది. నే నిక వండలేను అని మొండి కెత్తుక్కూచున్నాను."

"బావగారూ?"

"వారు నాకంటే యెక్కువ మండిపోయారు. 'మీకు బుద్ధివుందా లేదా?' అనడిగేసే టంత మండిపడ్డారు వారు. నా ప్రాణాలు మళ్ళీ యెగించిపోయాయి కాని యింతా చూసి 'నే నో గమ్మత్తు చేస్తాను, మీరు గప్ చిప్' అన్నాడు మా తమ్ముడు. నేనే కంగారుపడ్డాను గాని 'కానియ్యి' అనేశారు మీ బావగారు."

"నాకు నచ్చినవారు కారూ అన్నయ్యగారూ?"

"అక్కడికి, అక్కయ్యగారు నాకు నచ్చినవారు కామోసు, పా–పం!"

"మరి వంట కెందుకు సిద్ధపడ్డావ్నూ?"

"......మీరు చెప్పం డక్కయ్యగారూ!"

"అప్పుడు, మా తమ్ముడు, తువ్వాలు బుజాన వేసుకుని వాళ్ళ దగ్గిరికి వెళ్ళి 'నేను హోటల్లో భోజనం చేసి వస్తా' నన్నాడు. 'అదేమి' టన్నారు వాళ్ళు, ముందు తెల్లపోయి. 'చాకిరీ చేసుకోలేక మా అక్కా బావా హోటలు నుంచి తెప్పించుకు తింటున్నా' రన్నాడు మావాడు. దాంతో, వాళ్ళు మొగమొగాలు చూసుకున్నారు. పెదవులు విరుచుకున్నారు. కనుబొమలెగర వేసుకున్నారు. వెకిలినవ్వులు నవ్వుకున్నారు. మొగాలు వేలవేసుకున్నారు. చివరికి పట్టుపంచెలు బుజాన వేసుకుని 'శుచిగా పెట్టే హోటలు చూపించ' మంటూ వాడివెంట పడ్డారు."

"మొదటే ఆ పని చేస్తేనో?"

"అలా చేస్తే యిప్పటికీ నాకు జ్ఞాపకం యెందుకు వస్తుంది, న వ్వెందుకు వస్తుంది?"

"అప్పుడు అన్నయ్యగా రేం చేశారో అది చెప్పం డక్కయ్యగారూ!"

"నేను టేబిలుభోజనం చేస్తాను గాని చాదస్తపు హోటల్లో తినను. నాళం వారి సత్రం దాటి వెడితే, మలుపులో వొక ముసలమ్మ తడిబట్ట కట్టుకు వడ్డిస్తుంది, వెళ్ళండి, యెవళ్ళ నడిగినా చెబుతారు' అని వాళ్ళని విడిపించుకుని రెండు వీధులు

తిరిగి యింటికి వచ్చేశాడు. తరవాత, మేము ముగ్గురమూ యేకబంతిని భోజనం చేశాము. అయితే, కడుపు చెక్క లయిపోయేటట్టు నవ్వు కోడమే గాని యేమీ తినలేకపోయాం"

"చేసిన బొబ్బట్లన్నీ మిగిలిపోయాయి కామోసు పాపం!"

"మీ యిద్దరికోసమూ పట్టుకురాగా మీ రప్పటికే ఆఫీసుకు వెళ్ళిపోతి రాయె మరి!"

"మీ చెల్లాయికి–"

"హాంఁబెత్తు గుణ మన్నా సరే, మరేమన్నా సరే – మా చెల్లాయికి పెట్టకుండా నే నేమీ తినలేను సుమండీ!"

"మీరు నన్ను వూరిద్దా మనుకుంటున్నట్టుంది, లాభం లే దూరుకోండీ!"

"అంటే?"

"ఆవేళ సాయంత్రం, మా అన్నగారు నన్ను కాఫీహోటలుకి తీసుకు వెళ్ళ లేదనా?"

"చూశావుటమ్మా చెల్లీ? మన కేమయినా – ఇద్దరిలో వొకరయినా చెప్పారా?"

"చాటున యేమి చేసుకుంటే లెక్కల్లోకి వస్తుం దక్కయ్య గారూ?"

"మరే, మరే నిజమే. అయితే, చివరి కేమయిందో తెలుసా? ఈ సంగతి నాలుగు రోజులకే చుట్టాల కందరికీ తెలిసిపోయింది. అది మొదలు మాతో పని లేని వాళ్ళు మా యింటికి భోజనానికి రావడం మానుకున్నారు."

"బతికారు!"

"దీంతో, మనకీ అలాగే అవుతుం దండోయ్!"

"కావా లనే కాదూ నా కోరిక?"

"........మరి, మీ తమ్ముడు వేం చేశాక కూడా మన కాలస్యం యేమిటి మరిది గారూ?"

"అవు నవు"నంటూ లేచి, కంగారుగా లోపలికి వెళ్ళి, చొక్కాతొడుక్కుని కండువా వేసుకు చక్కా వచ్చాడు విశ్వనాథం "అన్నగారు సిద్ధంగా వున్నట్టేనా?" అనడుగుతూ.

"నే నిక్కడే వున్నా నండోయ్!" అంటూ వొక మాట దూసుకువచ్చింది లోపలికి.

"మీ అన్నగారు మాటలోనే వచ్చారండీ!" అని విశ్వనాధానికి బదులు చెప్పి "మనవాళ్ళ యింటో కూడా ఆవేళ మన యింటో లాగే జరిగిందండోయ్!" అంటూ భర్త కెదురు వెళ్ళింది రుక్మిణి.

"ఏమిటి తమ్ముడుగారూ?" అంటూ ఆయన యింటోకే వచ్చాడు.

"చుట్టాల గోల అన్నగారూ! వీళ్ళకి మంచీచెడ్డా యేమీ లేదు. పట్నాని కేపనిమీద వచ్చినా, మహో, ప్రేమ వొలికిపోతున్నట్టు భోజనానికి తయారు! ఒక డుదయం తొమ్మిదింటికే కావాలంటాడు. ఒకడు వొంటిగంట దాకా మాడుస్తాడు–"

"ఒకడు పెరుగు వడ్డించవమ్మా వదినా అంటూ గునుస్తాడు! అవునా, రుక్కూ?"

"పోనిస్తురూ, ఏదో నోరు జారాడు పాపం!"

"అదేమిటో చెప్పరూ అక్కయ్యగారూ?"

"ఏమీ లేదమ్మా! మీ బావగారి చిన్నమ్మమ్మ సవతి మనుమడుట, వొంటి గంటకి దిగా డొకనాడు. పప్పూ కూరా అయిపోగా, వూరుగాయా, పచ్చడీ, పులుసూ వడ్డించాను, దాసీదానికి పడెయ్యడం మానేసి. అంతా తిని 'మజ్జిగ వద్దు, పెరుగు వడ్డించవమ్మా వదినా!' అంటూ గునిశాడు వెర్రినాయన!"

"మామ్మే, మాతండ్రే!"

"వయస్సెంతని అడగవేం చెల్లీ?"

"పిల్లల తండ్రి అయివుంటాడు, అవునా వదినగారూ?" అనడిగాడు విశ్వనాథం.

"బి.ఏ. కదా, మీకు సందేహం యెందుకూ తమ్ముడుగారూ?" అనడిగాడు రుక్మిణి భర్త.

"అప్పుడేమి జరిగిందనుకున్నావు చెల్లీ?......అది కూడా మీరే చెప్పండీ!"

"ఆవేళ యేదో సెలవురోజు తమ్ముడుగారూ! భోజనం చేసి, వాకట్లో కూచుని, పేరుకుపోయిన ఉత్తరాలకు జవాబులు రాసుకుంటున్నాను నేను. అసలు వాడు గుమ్మంలో అడుగు పెట్టాటప్పటికే నాకు చిరాకు పుట్టుకు వచ్చింది. ఆ మాటతో నాకు అరికాలి మంట నెత్తికెక్కిపోయింది. ఉత్తరాలు విడిచిపెట్టి అమాంతంగా లేచివెళ్ళి, ఆ వెళ్ళడంలో కొంచెం శాంతి వహించి 'నువ్వు పెరుగుకోసం గునుస్తున్నావు గానీ, యివాళ మేము వాడుకుంటున్న మజ్జిగ మొన్నటిది, తెలుసా?' అన్నాను."

"వాడు తెల్లపోయాడు. ఏమనుకున్నాడో, పులుసుతోనే భోజనం పూర్తిచేసి లేచిపోయాడు."

చూసిచూసి "అయితేనూ? మన మిలా మాటలు చెప్పుకుంటూ వుంటే–" అంటూ మాట నాన్చేసింది కామేశ్వరి.

"అవునవును, ఈ మొగాళ్ళతో యిదే వరస. కబుర్లు కందుకుంటే యిక అంతంటూ వుండదు. నువ్వు బయలుదేరు చెల్లీ!"

"వోహో! నిజమే. అయితే, ఆడవాళ్ళు భోజనం చేసి వెళ్ళాక విస్తర్లదగ్గిర కాళ్ళు చాచుక్కూచుని మరీ మొదలుపెడతారు కాదూ రుక్కూ, మొగాళ్ళు కబుర్లూ?"

"మహోబాగా అడిగా రన్నయ్యగారూ!"

దీనికి బదులుచెప్పక కామేశ్వరి రుక్మిణీ వీధిలోకి వెళ్ళనుంచుని "మరి కదలరేం?" అని గట్టిగా అడిగారు.

## 5

కబుర్లు చెప్పుకుంటూ నలుగురూ బయలుదేరారు.

కొంచెం దూరం వెళ్ళాక, కాళ్ళకి కుచ్చెళ్ళు కొంగు అడ్డం వచ్చినట్లు నటించి, కొంచెం ఆగి, కామేశ్వరి, పక్కవాటుగా మొగుడికి తాంబూలం అందించి, రుక్మిణితో కలుసుకుంది.

కుర్చీలు రిజర్వు చేయించుకున్నారు కనక, నాటకశాల అడుగుపెట్టడానికి వీలులేనంతగా నిండిపోయి వుండినా వారి కిబ్బంది లేకపోయింది.

బండరాళ్ళు తప్పించుకుంటూ, వంకరటింకర్లుగా సెలయేరు ముందుకి సాగి పోయేటట్టు, వారు, మొగుడూ పెళ్ళాం, మొగుడూ పెళ్ళాంగా నిండు కుర్చీలు తప్పించుకు వెళ్ళి, మొగుడూ పెళ్ళాం. పెళ్ళాం మొగుడూగా మొదటి వరసలో మధ్యగా కూచున్నారు, దర్జాగా.

వారు కూచున్నారు.

అంతే.

నాటకం ప్రారంభం అయిపోయింది.

భోజనానికి లాగే నిక్కి-నీలిగి వెళ్ళి, కుర్చీ టిక్కెట్టు కొనుక్కునీ కూడా స్థలం లేక, రైటువింగు పక్కని గోనెపట్టా పరిపించుకుని వుసూరు మంటూ కూచుని – హఠాత్తుగా విశ్వనాథం జట్టు చూసి నోరు తెరిచేశాడు చుట్టం!

*(1935 జనవరి 'భారతి' నుంచి సవరణలతో)*

★ ★ ★

# "రాచపీనుగు తోడులేకుండా వెళ్ళదు"

బ్రాహ్మడు "భవతి భిక్షాం దేహి" అంటూ చెంబు పుచ్చుకుని బయలుదేరా డంటే యెటు చూసినా గౌరవమూ, యెటు చూసినా పూజలూనూ.

స్త్రీలందరూ అతనికి భక్తిప్రపత్తులు నివేదిస్తారు.

తలో పిడికెడూ బియ్యం వేసి "మహాత్మా! పాపులం, వుద్ధరించు" అంటూ శిరస్సులు వంచుతారు.

అతని గొప్పతనం అంగీకరిస్తారు.

ఇక, క్షత్రియుడు "నుంచో" అంటూ కత్తి దూసి వురిమాడంటే, కనుచూపుమేర, వెనకా, ముందూ, పక్కలా హడల్.

స్త్రీపురుషులు ఆబాలగోపాలమూ అతనికి వినయవిధేయతలు కనపరుస్తారు

"పన్ను" అని పేరుపెట్టి తమ కష్టార్జితంలో కొంతభాగం అతని పాదాల దగ్గిర దాఖలుచేసి "మహాప్రభూ! నీ బిడ్డలం, రక్షించు" అంటూ పడిపడి పెడతారు.

అతని ప్రభుత్వం అంగీకరిస్తారు.

కాగా, రాగిబుడ్డిచెంబుతో బయలుదేరిన బ్రాహ్మలలో చివరికి వడ్డీ వ్యాపారంలోకి దిగినవా రున్నారు.

ఒక్క కత్తితో మాత్రం బయలుదేరిన క్షత్రియులలో చివరికి మహా మహా సామ్రాజ్యాలు నిర్మించుకున్న వారున్నారు.

ఇంచేత, బ్రాహ్మణవృత్తీ క్షత్రియవృత్తీ–యీ రెండే లోకంలో పెట్టుబడి లేని వృత్తులు.

తక్కిన వృత్తులు ఎంతో కొంత మదుపు వుంటేనే సాగుతాయి.

అయితే, బ్రాహ్మడూ క్షత్రియుడూ కూడా పుచ్చుకునే వస్తువు రకంలో వొకటే అయినా, ఆ యివ్వడంలోనూ, యీ పుచ్చుకోడంలోనూ మాత్రం భేదం వుంది.

ఆ భేదం కాస్తా కూస్తా కాదు – దోమకీ యేనుక్కీ వున్నంత

ఇందుకి నిదర్శనంగా, ఆ వృత్తికి, మొగం మీద దైన్యం లాస్యం చేస్తూ వుంటుంది.

ఈ వృత్తికి, మొగం మీద శౌర్యం తాండవం చేస్తూ వుంటుంది.

కాని దీన్నిబట్టి వీటిలో దేన్నీ కూడా దూషించడానికీ వల్లకాదు, భూషించడానికీ వల్లకాదు.

ఎంచేతనంటే?

సూక్ష్మవిచారణ సాగిస్తే వొకమాటు బ్రాహ్మణవృత్తి గొప్పదనిపిస్తుంది. మరోమాటు క్షత్రియ వృత్తి గొప్ప దనిపిస్తుంది.

ఇంతేకాక పుట్టింది మొదలు గిట్టేదాకా, పిపీలికాది బ్రహ్మపర్యంతమూ, ప్రతీ ప్రాణి జీవితంలోనూ యీ రెండూ పెనవేసుకునే కనపడతాయి.

ఇవి లేందీ జీవితమే లేదు.

ఈ రెండూ అనాదినుంచీ వున్నాయి. సృష్టి వున్నంతకాలమూ వుంటాయి.

ఇలాగ డబ్బు సంపాదించడంలో దానికి కిందిమెట్టూ, దీనికి పైమెట్టూ మరి లేవు.

అయితే, బ్రాహ్మణ వృత్తికి వున్నవూరు విడిచిపెట్టనక్కరలేదు.

క్షత్రియవృత్తికి వూరే కాదు, వొక్కొక్కప్పుడు దేశమే కాదు, చివరికి ప్రాణాలు కూడా విడిచిపెట్టవలసి వస్తుంది.

## 2

ఒకమాటు అలాగే తటస్థించింది.

పుట్టి పెరిగినచోట లుగసాను రాగా, ఎంత కష్టపడినా దానికి విరుగుడున్నూ దొరక్కపోగా, డబ్బూపదవులూ – వీలయితే రాజ్యాలూ సంపాదించుకుందా మని కూడబలుక్కుని, గోత్రానికొక కుటుంబం చొప్పున అయిదు గోత్రాలకు చెందిన క్షత్రియవీరులు దేశం విడిచి బయలుదేరారు.

దారి పొడుగునా తమవంటివారే కొందరు, కొంతకొంత ప్రదేశం ఆక్రమించుకుని ప్రభువులై క్షాత్రం నెరుపుకుంటూ వుండగా వారింకా ముందుకి సాగారు.

రాగా రాగా చివరి కొక తురకరాజ్యం తగిలింది.

అది చాలా విశాల మయింది.

భాగ్యభోగ్యాలతో తులతూగుతూ వుంది.

నవాబు చేతికింద అనేకమంది యోధాగ్రేసరు లున్నారనీ, రాజ్యవైశాల్యాన్ని పట్టి చూస్తే వారి సంఖ్య చాలా చిన్నదనీ, వీరుడైనవాడు వస్తే పోనివ్వక, అతను, జాగీరిచ్చి నిలుపుతాడనీ వారికి తెలిసింది.

అక్కడ, తమకి తగిన పదవులు సంపాదించుకోడం అసాధ్యం కాదనిన్నీ వారికి నమ్మకం కలిగింది.

మకాం వేశారు.

నవాబు చహా రంతా వాకబు చేశారు.

వీరగంధాలు పూసుకుని ఒకనాడు అయిదుగురూ దర్శనానికి బయలుదేరారు.

అసలే క్షత్రియులు,

ఆపైని ఆకొన సింహాలు.

ఇక తేజస్సుకి లోటేమిటి?

అయితే, అలాంటి శౌర్యరాసులు బజారులో కాలినడకను వెడుతూ వుండడం చూసి, పౌరులు చాలా నొచ్చుకున్నారు.

ఇంతలో దేవిడీ దగ్గిర పడింది.

మొదటి ద్వారంలో వారిని చూసినవాళ్ళు లేకపోయారు.

రెండో ద్వారంలో పలకరించినవాళ్ళు కనపడకపోయారు.

మూడో ద్వారంలో వున్నవాళ్ళు "ఎక్కడికీ?" అందామని వుగ్గీస లాడారు; కాని ధైర్యం నిలవకపోయింది.

నాలుగు, అయిదు, ఆరు—యీ ద్వారాల్లో వున్నవాళ్ళు ప్రశ్నించారు; గాని వారు చెప్పింది గ్రహించలేకపోవడమేకాదు, తా మడిగింది కూడా మరిచిపోయి తెల్లపోయి నుంచున్నారు.

పోగా, యిక యేడో ద్వారంలో వున్నవాళ్ళు అసాధ్యులు. అది దాటితే యిక దర్బారేకనక అక్కడ వున్నవాళ్ళు పిడుగులు.

ఈ సంగతి గుర్తించి, క్షత్రియులు, వాళ్ళేమీ అడక్కముందే తమకి తామే నిలిచిపోయి "నవాబుగారి దర్శనం కావా"లన్నారు.

నిజానికి, కావా లనడం ప్రార్థించడమే.

కాని, ఆ అడగడంలో ధ్వనించిన బింకమూ, ఆ నుంచోడంలో రూపొందిన గాంభీర్యమూ, ఆ మొగాలమీద పొటమరించివున్న వీరతేజస్సూ, ఆ మీసాల్లో నిలవతొక్కుకుని వున్న శౌర్యస్ఫురణా, ఆ చూపుల్లో దూసుకుపోతూవున్న కరుకుతనమూ, ఆ చేతుల్లో వుర్రూతలూగుతున్న చంద్రహాసాలూ, ఆ నడికట్లలో తొంగి చూస్తూవున్న కటారులూ, ఆ పరిసరాలన్నీ గుబాళింపచేస్తూవున్న వీరగంధాలూ చూశాటప్పటికి, వాళ్ళకి, ఆ కావాలన్నమాట హుజూరు హుకుం కంటేనూ యెక్కువది అన్నట్టు తోచింది.

వెంటనే వాళ్ళలో వొకడు లోపలికివెళ్ళి, సెలవు పొందివచ్చి, వారిని తీసుకుపోయి నవాబు యెదట హాజరు పెట్టాడు.

## 3

దర్బారంతా నిండిపోయి వుంది.

కిటకిటలాడిపోతోంది,

వజీర్లూ, కిల్లేదార్లూ, ఫౌజుదార్లూ, సరదార్లూ, జాగీరుదార్లూ, సౌదాగర్లూ అంతా యిలాంటి ప్రజ్ఞావంతులే కాని, అక్కడ కేవలం మనుష్యు లెవరూ లేరు.

రాచవారిని చూసి వారూ విభ్రాంతులయినారు.

దర్బారంతా యేదో వొక కొత్త తేజస్సు నిండినట్టు కనబడగా నవాబున్నూ చకితుడైనాడు.

ఒక్క క్షణం గాంభీర్యం విరాజమానం అయింది.

తరవాత నవాబు ఇంగితం కనిపెట్టి, వొక వజీరు అడగ్గా, క్షత్రియుల మొనగాడు అందుకున్నాడు:

"మేము చాలా దూరంనుంచి వస్తున్నాము."

"ఉదారుడైన ప్రభువైనా, శూరుడైన ప్రతిస్పర్థి అయినా దొరక్క పోతాడా అని బయలుదేరాము."

"..........."

"మేము సూర్యవంశ క్షత్రియులం."

"..........."

"మాది యోధజాతి."

"..........."

"కత్తిపట్టి, దుష్టశిక్షణా శిష్టరక్షణా చెయ్యడానికే మా జాతి యేర్పడింది."

"..........."

"యుద్ధం చెయ్యడం మాకు విలాసక్రీడ."

వినివిని వజీరుకేసి తిరిగి "యింకా అనేకులకూ అంతే" అన్నాడు నవాబు.

రాచవారికేసి చూస్తూ వజీరు ఆ మాటకు శుకానువాదం చేశాడు.

దానిమీద "కావచ్చు కాని; ప్రాణాలు పూర్తిగా పోయాకే క్షత్రియుడి చేతిలో వుండిన కత్తి కిందపడిపోతుంది" అన్నాడు మొనగాడు.

"ఇంకా చాలామందికిన్నీ" అంటూ నవాబు వజీరుకేసి చూశాడు. వజీరు రాచవారిని చూస్తూ ఆ మాట కూడా అనువదించాడు.

పురపుర చూస్తూ "అలాగేం?" అనుకుని, మొనగాడు "రాజపీనుగు తోడు లేకుండా వెళ్ళదు" అన్నాడు.

"అంటే?"

ఒకరికేసి వొకరు చూసుకుంటూ నవాబూ, వజీరూ వొక్కమాటే యీ మాట అన్నారు.

"అంటేనా? దెబ్బతినిన్నీ యెదటివాణ్ణి చంపిగాని క్షత్రియుడు చావడు!"

"చాలా సాహస మైన మాట!"

"చూపులకు అలాగే కనపడుతుంది."

"కనపడ్డమే కాదు అంతే–"

"ఎన్నటికీ కాదు."

"కాకేం? ఒక్కొక్క జాతిలో శూరులే చాలామంది పుట్టవచ్చు."

"వారిలో చాలామంది అపహోయశూరులే కావచ్చు."

"........"

"ఎదటివాణ్ణి కూల్చినా కూల్చకపోయినా, ఒక్కొక్కశూరుడు, తాను పోరాడుతూనే ప్రాణాలు విడవవచ్చు."

"..........."

"అంతేకాని, పోటు తినికూడా పొడిచికాని చచ్చిపోడనడం నమ్మరాని మాట."

"తమ కలా తోచడం మా అదృష్టమే ఏమంటే? అవునంటే కాదంటూ కూచోడానికి, ప్రత్యక్షవిషయం కాని, యిది శాస్త్రీయ విషయం కాదు."

"అవును."

"కనక, తమరు పరీక్ష చేయించవచ్చు."

సభ్యులు వులిక్కిపడ్డారు.

నవాబు "ఎలాగా?" అన్నట్టు వజీరుకేసి చూశాడు.

వజీరు ఆ చూపులు మాటల్లో పెట్టాడు.

దానిమీద రాజుల మొనగాడు మళ్ళీ అందుకున్నాడు:

"మాలో వొకడు, కటారి పిడిమీద చెయ్యి వేసుకుని, తమ సమక్షంలో నుంచుంటాడు."

"........."

"తమ సర్దార్లలో తమ యిష్టం వచ్చినవారిని తుపాకీ యిచ్చి మావాడి యెదట పదిగజాలలో నుంచో పెట్టండి."

"........ ..."

"సరదారుచేత తుపాకీ వేయించండి."

".........."

"మావాడు ఆ దెబ్బ సంతోషంతో అందుకుంటాడు."

"అదెలాగా తప్పదు"

"తప్పడం యెందుకూ? తప్పితే యిక మాక్షత్రియుల విశిష్టత యేమి కనపడుతుందీ?"

నవాబు నిరుత్తరుడు కాగా, వజీరు మిడుతూ మిడుతూ చూశాడు.

"చిత్తగించారూ?" అంటూ మొనగాడు మళ్ళీ అందుకున్నాడు:

"విశదం నిమిత్తం మళ్ళీ మనవి చేసుకుంటున్నాను, మావాడు ముందు ఆ గుండుదెబ్బ తింటాడు."

"తిని?"

"తినీతినడంతోటే ముందు కురుకుతాడు."

"ఉరికి?"

"ఒక్క యేటున తమ సరదారుని పొడిచేస్తాడు."

నవాబు హృదయం గుబగుబ లాడింది.

సరదార్లు మెరుపుకొట్టినట్టయిపోయారు.

"ముందు మీవాడూ, తరవాతే మావాడూ పడిపోతారు" అన్నాడు మొనగాడు.

సభనిండా సన్నంగానే గుసగుసలు రేగాయి.

వెంటనే "అంటే?" అన్నాడు వజీరు.

"ఇందాకా మనవిచేసుకున్నదే– రాచపీనుగు తోడులేకుండా వెళ్ళదు" అంటూ మొనగాడు మీసం మీద చెయ్యి వేసుకున్నాడు.

దర్బారంతా మొదట స్తబ్దమయిపోయింది.

తరవాత అప్పుడే మేలుకున్నట్టయింది.

చివరికి "ఇదేదో చూడవలసిందే" అన్నట్టు కనుబొమ లెగరవేసుకుంది.

ఇలా చూసి అలా చూసి సభ్యులందరూ తనకేసి చూశాటప్పటికి, శౌర్యం వుప్పొంగగా, నవాబు "రేపు జాముపొద్దువేళ పరీక్ష" అని చెప్పి, నాటికి క్షత్రియులకు సెలవిచ్చాడు.

వెంటనే వజీరు, అతిథ్యం నెరపడానికి రాజుల వెంట వొక సరదారుని పంపాడు.

## 4

అరుగురు క్షత్రియులు రాగా దర్బా రంతా విరగబడిపోయింది.

అందులోనూ పచ్చబట్టలు కట్టుకుని వున్న యువకుణ్ణి చూసి వుద్రిక్త మయిపోయింది.

ఉభయపక్షాలవారూ "సంయే" అంటే "సంయే" అనుకున్నారు.

మొనగాడి పెద్దకొడుకు, ముందు తండ్రికీ, తరవాత వరాసగా తక్కిన నలుగురు క్షత్రియులకీ పాదాభివందనాలు చేసి, వారి దీవనలు శిరసావహించి, నవాబుకీ మళ్ళీ సలాములు చేసి కటారిపిడి పట్టుకుని నిర్దిష్టస్థలంలో నుంచోగా, దట్టించిన తుపాకీ పుచ్చుకుని వచ్చి, అతని కభిముఖంగా పదిగజాలలో వొక తురకయోధుడు నుంచున్నాడు.

మేడమీది జనానావారి చూపులకి కిటికీచూపులు కరిగిపోయాయి.

చూసిచూసి నవాబు కన్నుగీటాడు.

తుపాకీ "ఢా"మ్మంది.

ఆ అగావుకీ మూతలుపడ్డ దర్బారుకళ్ళు మళ్ళీ వినపడేటప్పటికి, దెబ్బతిన్న రాచకుమారుడు, కెవ్వున అరిచి, చర్రున కటారి దూసి, చెంగున ముందుకురికాడు.

కాని,

ఐదుగజాలే వెళ్ళి కుప్పగా కూలిపోయాడు.

అందుకే దర్బారంతా వూగిపోయింది.

నవాబు కూడా "భేష్" అన్నాడు.

కాని మొనగా డిదేమీ గమనించలేదు.

రంగస్థలంలో కొక్క వుడాం వేశాడు.

"నేను పతితుణ్ణి – తమరు – నన్ను – తాకవద్దు" అంటూ మెడలు వాల్చేసిన కొడుకు కేసి చూడకుండా, అతని చేతిలో వున్న కటారి మాత్రం వులాక్కుని "మళ్ళీ యిప్పుడే వస్తాను" అని నవాబుకీ విన్నవించి మెరుపయి పోయాడు.

## 5

అక్కడ, బసలో, చూసీ చూడ్డంతోటే భర్త వాలకం అంతా గ్రహించేసి, పైట తొలగించుకుని, భార్య, గుండెలిచ్చి యెదట నుంచుంది.

వెంటనే రివ్వున కటారి యెత్తి "నిజం చెప్పు. నీ పెద్దకొడుక్కి తండ్రి యెవడూ?" అంటూ వురిమాడు మొనగాడు.

అది చూసి ఆమె మందహాసం చేసింది.

అబ్బురమా?

రాచకుమార్ళకి వుగ్గుపాలతో యిలాంటి వురుములు నేర్పే ఆదిశక్తి ఆమె.

"ముందు పొడిచేసి తరవాతే అడిగినా చెబుతానుకాదూ?" అంటూ ప్రారంభించి దామె:

"ఏం, పెద్దబ్బాయి రసాభాసం చేశాడా?"

"............."

"అనుకుంటూనే వున్నాను."

"............."

"అయినా అనుగ్రహం వుంటే వివరాలు చెప్పండి."

మొనగాడికి నరాలన్నీ తోడేసిన ట్టయిపోయాయి.

"అనుకుంటూనే వుంది"ట.

ఆ కళ్ళలో యేమి శౌర్యమూ?

అలాంటి తల్లి చేతుల్లో పెరిగినందు కయినా ఆ రాచకుమారుడు తండ్రి మాట నిలిపి వుండవలసింది.

మొనగాడికి కోపం పోలేదు. కాని, వుద్ధృతం అణిగింది.

మొలకట్టులో పెట్టలేదు, కాని, కటారి దింపేశాడు.

చివరికి జరిగిందంతా చెప్పి "యేం చెబుతా" వన్నాడు.

"ఎప్పుడు పుట్టిందో మా తల్లుల కోవ?"

"............."

"మా తల్లులూ, మా తల్లుల తల్లులూ, వారి తల్లులూ, యింకా వెనకటి వారి తల్లులూ యెప్పుడూ, యెక్కడా, యెవరి చేతా వేలు పెట్టి చూపించుకో లేదు."

"............."

"అయినా, తమకిప్పు డిలాంటి సందేహం కలగడంలో అసంగతం యేమీ లేదు."

"........."

"చీల్చి చూసుకోండి. దీనివల్ల నా గుండెల్లో కూడా గాయం అయింది."

"........."

"అయితే, ఇదిలా జరగడానికి పెద్దకారణమే వుంది."

"........."

"నాదగ్గిర పాలు చాలక, పెద్దబ్బాయికి, కొన్నాళ్ళు వెంకటలక్ష్మి పాలు కూడా తగిలాయి."

ఇది విని మొనగాడు పెద్ద నిట్టూర్పు విడిచాడు.

దీంతో అతనికి నెమరు తిరిగింది.

చెప్పడాని కేం వుందీ? దాసీపాలు, రాచబిడ్డని అయిదుగజాలు వెనక్కి లాగేశాయి.

"మొదట పరీక్ష చేసే తీసుకువెళ్ళి వుండవలసింది" అని మనస్సు అనగా "అలాంటివాడు పోవడమే మంచిది" అని బుద్ధి ఝుమాయించి అనేసింది.

"దర్బారులో యేం జరిగిందీ?"

"అబ్బాయి అలా పడ్డాడు, నే నిలా వచ్చాను అపుడక్కడ లేకపోవడమే మంచిది. ఉంటే యేం దుష్టమాట చెవినపడి వుండునో?"

"నిజమే; కాని యింకా యిలా నుంచుంటే యెలాగా?"

"............."

"చిన్నబ్బాయిని—"

ఇలా అంటూ తల్లి తనకేసి చూశాటప్పటికి "బాబయ్యా, నేను వస్తాను పదండి" అంటూ రెండో కొడుకు ముందుకి వచ్చాడు.

"వెడుతున్నాము. వీలయితే అబ్బాయి కీర్తి తీసుకువస్తాడు. లేకపోతే–లేకపో–తే–" అంటూ మాట తేల్చేశాడు మొనగాడు.

"ఆ కటారి యిలా దయచేసి వెళ్ళండి" అంటూ భార్య, పైట సద్దుకుని చెయ్యి చాపింది.

కటారి యివ్వడంలోనూ, పుచ్చుకోవడంలోనూ చెయ్యీ చెయ్యీ తగిలాయి.

దాంతో ఉభయవిద్యుత్తులూ కలిసినట్టు కాగా శౌర్యం ప్రదీప్తం అయింది.

శిరస్సుమీద చేతులుంచి దీవిస్తూ, ఆ వుద్రిక్త శౌర్యం అంతా, ఆ దంపతులు కొడుక్కి దఖలుపరిచేశారు.

## 6

తన పెద్దకొడుకు అలా యెందు కయిపోయాడో ఆ కారణం చెప్పి, చిన్నకొడుకుని చూపించి "యిప్పుడు మళ్ళీ తనిఖీ చేయించండి. ఇది చివరిది" అని విన్నవించాడు మొనగాడు.

అది విని దర్బారంతా నిర్విణ్ణ మయిపోయింది.

"ఇలాంటి అసాధ్యప్రతిజ్ఞ నెరవేర్చుకోడానికి రత్నాలవంటి కొడుకుల్ని బలిపెట్టు కోవడమా?" అన్నాడు నవాబు.

"తమ ప్రీతికి చాలా చాలా నమస్కారాలు. అయితే, నా పెద్దకొడుకు అలా నడిదారిలో పడి వుండగా, తమరు నా కొడుకులు రత్నాలన్నంత మాత్రాన నాకేం తృప్తి?" అని బదులడిగాడు మొనగాడు.

"బాగా ఆలోచించుకోండి."

"ఒక్కటే ఆలోచన – ఒక్కటే నిశ్చయం!"

"........."

"మేము మానపోనికి వోర్చుకోలేము."

"మరి తమ వంశం మాట?"

"అప్రతిష్ఠాభాజనం అయిపోయాక యిక వంశం వుంటే యేమిటి, లేకపోతే యేమిటి?"

ఈ మాటమీద, తక్కిన నలుగురు క్షత్రియులూ వొక్కొక్కరే లేచి "బతికి వున్నంతకాలమూ మేము ఆ దంపతులను పార్వతీ పరమేశ్వరులుగా భావించి సేవించుకుంటాము" అని చెప్పారు.

ఇది విని మొనగాడు సంతృప్తి కనపరిచాడు.

అతని కొడుకు పరమానందభరితుడైనాడు.

అప్పుడు నవాబు దర్బారంతా పరిశీలించాడు.

ఇలాంటి ప్రాణోత్క్రమణాలెన్నో చూసిన కళ్ళవి.

పైగా, శౌర్యప్రస్తావన వచ్చినప్పుడు, కొబ్బరిచెట్టుమీద నుంచి పుచ్చెపడడం యెలాంటిదో మనిషి మెడమీదినుంచి తలకాయ పడడమూ అలాంటిదే.

దీనికి సాయం, యిప్పుడు మతాంతరుల శౌర్యం పరీక్షించడం.

కాగా, అందరి మొగాలమీదా ఆత్రం తొణికిసలాడిపోయింది.

అది చూసి నవాబు మళ్ళీ సెలవిచ్చాడు.

వెంటనే తండ్రికీ, తక్కిన కులం వారికీ పాదాభివందనం చేసి, నవాబుకున్నూ సలాము చేసి వెళ్ళి కటారిపిడి పట్టుకుని రాచకుమారుడు యుద్ధస్థలంలో సింహప్పిల్లలాగ నుంచున్నాడు.

ఈ సందుబాట్లో తుపాకీ దట్టించుకుని వున్న తురకయోధు, నవాబుకి సలాములు చేసి, దర్జాగా వెళ్ళి, అతని యెదుట పదిగజాలలో నుంచున్నాడు

వెంటనే దర్బారు నిస్తరంగ సముద్రం అయిపోయింది.

సభ్యులందరూ అనిమిషు లయిపోయారు.

మొనగాడు, చూపుతూపులతో పొడిచి కొడుకు శౌర్యం రెచ్చగొట్టి తప్పుకున్నాడు.

నవాబు మళ్ళీ కన్నుగీటాడు.

తుపాకీ మళ్ళీ "ఢా"మ్మంది.

"ఇతనయినా మాట తక్కిస్తాడో లేదో" అని మొనగాడు ఆందోళన పడుతూ వుండగా, "ఏమయింది?" అంటూ తురకలందరూ ఆత్రంతో చూడబోయిన్నీ, చిరతలుకమ్మి కళ్ళు స్వాధీనపడక అవస్థపడుతూ వుండగా "హరహరమహాదేవ" అంటూ వొక సింహనాదం వినిపించింది.

తురకయోధు— రాచకుమారుడు గుండుదెబ్బ తినడమూ, కటారి దుయ్యడమూ, తనమీదికి వురకడమూ—ఇవేమీ యెరగడు, కెవ్వున కేకమాత్రం వేశాడు!

నిదానించగా తురకయోధూ, రాచకుమారుడూ వొకరి పక్కని వొకరు పడి వున్నారు.

తురకయోధు పేగులు బయటికి వచ్చి వున్నాయి.

రాచకుమారుడి వక్షం తూట్లు తూట్లయిపోయి వుంది.

ఆ ప్రదేశం అంతా రక్తకొల్లయిపోయి వుంది.

కటారి, రక్తం వోడుకుంటూ రాచబిడ్డ చేతిలోనే వుంది; కాని తుపాకి తురకయోధుకి గజందూరంగా పడివుంది.

దర్బారు తన కళ్ళనే నమ్మలేకపోయింది.

తండ్రి మీసం మీద చెయ్యి వేసుకోడం చూసి వొక్కమాటు చిరునవ్వు నవ్వుకుని రాచబిడ్డా, నవాబు తఖ్తుదిగి బయలుదేరడం చూసి వొక్కమాటు మందహాసం చేసుకుని తురకబిడ్డా మెడలు వేలవేసేశారు.

ఏకకాలంలో, వున్న యిద్దరు కొడుకులనూ కోల్పోయిన మొనగాడు, ఆనంద తరంగితాలయిన కళ్ళతో దర్బారు కలయచూసి, ముద్దు పెట్టుకోదలచిన నవాబుకి దర్జాగా చెయ్యి అందించాడు.

☆ ☆ ☆

నవాబు మొదలు పారాజవానుదాకా అక్కడ వున్న వారందరూ పడివున్న తురకబిడ్డనీ, రాచబిడ్డలనూ సలాములు చేసి గౌరవించారు.

నవాబు, తన లీలోద్యానంలో నదరైన స్థలాలిచ్చి– తురక యోధుని పూడ్పించి, అక్కడ చక్కని మహాలు కట్టించాడు.

రాచకుమాళ్ళను దహనసంస్కారం చేయించి ఆ స్థలంలో తులసీ బృందావనం వేయించాడు.

తరవాత, అతను, క్షత్రియులకు సైన్యాధిపత్యా లిచ్చాడు. జాగీర్లిచ్చాడు. దర్బారులో మొగుపేట లిచ్చాడు. కనకాభిషేకాలు చేశాడు.

క్షత్రియులు, నవాబుని దేవుణ్ణి కొలిచినట్లు కొలిచారు.

అతని రాజ్యమూ, వైభవమూ, ప్రతిష్ఠా ద్విగుణీతం చేశారు.

కొంతకాలానికి మొనగాడు కాలం చేశాడు.

అతని భార్య సహగమనం చేసింది.

అతని వంశం అంతటితో సరి.

పోగా మిగిలివున్న నాలుగుగోత్రాల క్షత్రియులే ఆంధ్రదేశంలో స్థిరపడి వంశాభివృద్ధి పడశారు.

అంచేత ఆంధ్ర క్షత్రియులలో యిప్పుడు నాలుగు గోత్రాలవారే వున్నారు.

*(జూన్ 1929 'భారతి' నుంచి సవరణలతో)*

★ ★ ★

# ఇలాంటి తవ్వాయి వస్తే...?

"శివశివా! పక్కనే అంత గట్టుండగా యేమి పని సాయిబూ అదీ? నిక్షేపం వంటి చెరువులోనే పుక్కిలించి వుమ్మేసుకోవాలా? మీకు మాత్రం యెంగిలి తప్పు కాదూ? కాండ్రించి కూడా—చెప్పిన కొద్దీ మరీనీ! పోనీ, నీయిష్టం వచ్చినట్టు చేసుకో. ఎవళ్ళెంత చేసుకుంటే అంతా వాళ్ళే అనుభవిస్తారు, నాకేం?"

"నీకీ బుద్ధీ వుందీ లేదూ షోంయాజుల్?"

మండిపడుతూ అందుకున్నాడు సాయిబు.

"ధస్కూధస్కూ షీదీషీదీ చెర్వూ హంతా గలీజ్ చేసి, హింకా మాకీ హోచ్చాపన్ చేస్తావ్?"

ఉలిక్కిపడ్డాడు రామప్పసోమయాజులు, మరీ, మాట్టాడలేకపోయాడుకూడా.

"బుద్ధిగడ్డి తిని పలకరించా"నని కూడా చాలా పశ్చాత్తాపపడ్డాడు

"ఇంతటితో నన్ను కటాక్షించి యిక నువ్వు వెళ్ళిపో మహాప్రభూ!" అంటూ కళ్ళతో ప్రార్థించాడు కూడా.

ఎలాంటి కళని వున్నాడో, మరి, సాయిబున్నూ మాట్టాడలేదు.

అయితే, అతను హొడ్డెక్కుతూ వుండగా, యెత్తెత్తి కాళ్ళు వేసుకుంటూ సోమయాజులు వెధవకూతు రెదురయింది పావంచాలమీద.

మొగం చిట్లించుకుంటూ హొక పక్కకున్నూ వోసరిల్లిం దామె.

ఆ వాలకం చూసి చాలా చిమచిమలాడాడు సాయిబు.

కానయితే, అతనూ హొక పక్కగానే వున్నాడు.

ఆ దారి తప్పాలనీ లే దతనికి.

కాని, అయిమూల మొగం పెట్టుకుని చూశాడు మొదట.

ఏమి టేమిటో గొణుక్కున్నాడు.

పావంచాలమీద కూడా తుబుకూ తుబుకూ వుమ్మేస్తూ గబగబా చక్కాపోయాడు, చివరికి.

ఒక్కమాటు వెనక్కి తిరిగిచూసి, అక్కడికీ కంఠం కొంచెం నొక్కుకుని "యెవర్ని నాయనా?" అనడిగిం దామె తండ్రిని.

"ఇంకెవర్నీ? ఈశ్వరుడు లేదూ? తిట్టుకోనీ!"

"అస లెందుకు వచ్చిందీ గొడవ?"

"కాండ్రించి చెర్లో వుమ్మేస్తావా? అన్నాను. అదిగో, అదీ నా వల్ల వచ్చిన అపరాధం. ఇక హొకటేమిటి—నానా మాటలూ—హారోంహర."

పెద్దపెద్ద కెరటా ల్లేచేటట్లు మూడుమాట్లు మునిగి స్నానం చేశాడు సోమయాజులు.

సాయిబు వుమ్మి యెక్కడ తేలుతోందో అని బెదిరి బెదిరి చూస్తూ, నీటిలో కూడా యెత్తెత్తే కాళ్ళు వేసుకుంటూ, యెక్కడో వుండి వుంటుందనుకున్న ఆ వుమ్మి దూరానికి పోయేటట్టు బిందెతో కెరటాలు రేపెట్టసాగిందామె.

ఇంతలో మళ్ళీ మూడుమాట్లు మునిగి, లేచి, యాజులు ఆచమించి సంకల్పం ప్రారంభించాడు.

కాని, యాదాలాభంగా యెడమవైపు చూడగా, కుండలు కొందరూ బిందెలు కొందరూ చేతబుచ్చుకొని పాతిక ముప్పయి మంది మాదిగ వనితలు ఉత్తరపు గట్టు పొడూగునా నుంచుని వున్నారు, వరాసగా.

అది చూసి గతుక్కుమనిపోయా డతను, మొదట.

అదేమిటో యెందుకో అర్థంకాక, కళ్ళు చికిలించుకుంటూ నిదానంగా చూశాడు, తరవాత.

అప్పటికీ నిర్ధారణ చేసుకోలేకపోయాడు.

"అదేమిటే అమ్మాయీ?" అనడిగా డప్పుడు, తర్జనితో నిర్దేశిస్తూనూ, అటే చూస్తూనూ.

హఠాత్తుగా చూసిందామె.

అర్థం చేసుకోలేక ఆమె కూడా గజిబిజి పడిపోయింది.

"ఏం, కనపడ్డం లేదూ?" అని మళ్ళీ అడిగా డతను.

"కనపడింది, కనపడింది;–కొంప మునిగిపోయింది నాన్నోయ్!" అంది.

"మాదిగలేనా వాళ్ళు?" అనడిగాడు యాజులు, వొణికిపోతూ.

"అవునవును. మన చెరువులో దిగుతారు కామోసు నేమిటీ గతీ?"

"అదేమి పోయే కాలం?"

ఇలా అడిగినప్పు డతని మాటలో కూడా వొణుకు పుట్టింది, స్పష్టంగా.

"కాంగ్రీసువాళ్ళు తీసుకువచ్చి వుంటారు నాన్నా, వాళ్ళని."

"వాళ్ళపనే యిది, సందేహం లేదు."

"ఈ చెరువులో తప్ప మరెక్కడా మంచినీటి చుక్కల్లేవు."

"తీరా కాలవలు కట్టేశాక – హరహర! ఎంత ఘోరకలో చూశావా?"

నిప్పులు తొక్కుతున్న ట్టయిపోయాడు, సోమయాజులు.

దాంతో, మళ్ళీ వొణికిపోతూ, అక్షరాల పోలిక లేకుండా వొక్క పొలికేక పెట్టాడతను.

కాని, యెవరూ వినిపించుకోలే దది.

"పోరేం? పోతారా పోరా?"

"మంచినీళ్ళకి వచ్చామండి" అంది మాదిగస్త్రీ వొకామె, ముసీలిది.

"మా చెరువుకే?"

"మీదేమిటి మాదేమిటి, వొక్కటే చెరువు చేశాడండి దేవుడు, వూరందరికీ!"

"స్వరాజ్యమూ లేదు, వల్లకాడూ లేదు, దేశం అంతా మాలకూ డయిపోతోంది" అంటూ పళ్ళు కొరుక్కుం దతని కూతురు.

"ఆ. అలాగేం? ఎవళ్ళే మిమ్మ ల్నిక్కడికి తీసుకువచ్చిన వాళ్ళు?"
"దేవుడే నండి, మరెవరు తీసుకువస్తారు బాబయ్యా, మమ్మల్ని?"
"అబ్బా, దేవుడే తీసుకువచ్చాడేం?"
"అవునండి."
"దేవుడు దిగివచ్చాడు మీకోసం, మహా మహా యజ్ఞాలు చేసిన మావంటి వాళ్ళకి దిక్కు లేదుగాని."
"దిక్కు లేని వాళ్ళకి దేవుడే దిక్కు బాబయ్యా, మీకేం?"
"అలాగేం? అయితే, మీ చెరువేం చేసుకోమన్నాడూ ఆ దేవుడు మరి?"
"కుష్టురోగపు లచ్చిగాడు దాల్లోపడి చచ్చిపోయాడు బాబయ్యా!"
"చచ్చిపోతే?"
మళ్ళీ వొక పొలికేక పెట్టాడు సోమయాజులు.
"ఆ నీళ్ళెలా తాగమండీ దొరగారూ?"
"ఏం, కల్లుకంటే చెడిపోయాయా?"
"ఏలినవారి క్కోపం వస్తే చెప్పలేను గానండీ, చాకళ్ళు దిగడం లేదండీ మీ చెరువులో?"
స్తబ్ధుడయిపోయాడు సోమయాజులు.
'తురకలు దిగుతున్నారు గదా, యేమి చేస్తున్నారండి మీరు?"
పులిమీద పుట్ర యిది.
"దిగుతున్నారు గదా?" అని వూరుకుంటే బాధ లేక పోవును, "ఏం చేస్తున్నా"రని ముదలకించిం దామె నిలవతీసి.
చాలా కోపం వచ్చిం దతనికి.
అంతకంటే యెక్కువగా కంఠమూ బిగుసుకుపోయింది.
"ఆ, ఆ, చాకళ్ళూ మీరు సమానం షే?" అనడిగింది సోమయాజులు కూతురు.
"...మున్సబుకరణాలకు తెలిస్తే పాతేస్తారు, తొరగా – యింకా నుంచుంటారేం?"
"నీళ్ళు ముంచుకోకుండా వెళ్ళి యేమి చెయ్యమంటారు బాబయ్యా?"
"దానికి బదులు చెప్పవలసిన పూచీ మాకేమీ లేదు. చెరువులో దిగారంటే, మొహమ్మాయి వండించేస్తాను మిమ్మల్ని. పొండి, వెనక్కి మళ్ళండి."
"అయితే, మేము దూరంగా వెళ్ళిపోతాం, మా కుండల్లో నీళ్ళుపోసి వెళ్ళిపొండి కామందులు" అంది విస్సిగాడి పెళ్ళాం.
"అబ్బో, అలాగేం?" అంటూ ముదలకించాడు యాజులు, ముందు.
"యజ్ఞం చేసిన ముండావాణ్ణి, నేను వచ్చి మీ కుండల్లో నీళ్ళు పొయ్యాలేం?" అంటూ నిలవతీశాడు తరవాత, తల తాటించుకుంటూ.
"పోతారా, వొడ్డెక్కనా?" అంటూ వొణికిపోతూ నీటిలోనే పరవళ్ళు తొక్కాడతను, చివరికి.
మాదిగలు కదల్లేదు.

"మాటకి మాట యెలా అందిస్తున్నారో చూశావా? వాళ్ళలో అదెవర్తో, అది మరీనీ, స్నానం కూడా చేశావు నువ్వు, వాళ్ళతో మాట్లాడకు నాన్నా!" అంది కూతురు.

విప్పలు కక్కుతూ అటు చూశాడు యాజులు; కాని మాట్టాడలేదు.

ఎక్కణ్ణుంచో వస్తున్నాడు శంకరశాస్త్రి, ఇదంతా చూశాడు, విన్నాడు కూడా; కావి నోరుమెదపలేదు, బుర్రవంచుకుని వూళ్ళోకి వెళ్ళిపోయాడు.

స్నానం చేద్దామని వచ్చాడు శంభన్నశాస్త్రి, చెంబు తోముకుంటూ; కాని సంగతంతా చూసి పక్కనే వున్న రామినీడుగారి గాదెలసావడి అరుగు మీదికి వెళ్ళి కూచున్నాడు, మాట్టాడకుండా.

బిందె పట్టుకు వచ్చిం దొక కమ్మస్త్రీ. "రోజులు మారిపోయాయి బాబయ్యా" అని మాత్రం అని, నిదానంగా చూసి బిందె ముంచుకుని చక్కా పోయింది.

సుబ్బిశెట్టి వచ్చాడు రేవులోకి. వొక చివరికి వెళ్ళి కాళ్ళు కడుక్కుని చక్కాపోయాడు "త్వరగా తెమల్చుకోండి బాబయ్యా!" అంటూ.

తెమల్చుకోడమే మంచిదనుకున్నాడు సోమయాజులుకూడా.

"లేవా ల్లేవా" అంది కూతురు కంగారుగా.

"అదిగో, రామినీడుగారి అబ్బులు కామోసు వాళ్ళకుండల్లో నీళ్ళు పొయ్యడానికి బిందె పట్టుకువస్తున్నాడు. అతను వాళ్ళ కుండల్లో పోశాటప్పుడు కొన్నయినా కిందపడి చెరువులోకి దారితీస్తాయి నీళ్ళు. తెమల్చుకో తెమల్చుకో" అంటూ అతణ్ణి కూడా కంగారు పెట్టిందామె.

ఆ మాట చెవిని పడేటప్పటికి, సోమయాజులికి, కరిగిన సీసం కాళ్ళ కిందికి పాకివస్తున్న ట్టయింది.

మరి, ఆగలేకపోయాడు.

జంధ్యాలు తోముకోకుండా–వొళ్ళసలే తోముకోకుండా–కట్టుబట్ట పూర్తిగా తడిసిందో లేదో చూసుకో నయినా చూసుకోకుండా గభీమని వొడ్డెక్కి – పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ – దుముకుతూ యింటికి వెళ్ళిపోయాడు.

"విక్షేపం. గంగాళం వంటి చెరువిక నాశనం అయిపోతుంది కామోసు. కాలవలు కట్టేశారేందారీ?" అని సాగతీసుకుంటూ, ఆదరాబాదరా బిందె ముంచుకుని, ఆమె కూడా అతని వెనకనే యెగిరిపోయింది, పిట్టలాగ.

## 2

ఎన్ని తరాలమంచో మాదిగల కొక చిన్నదీ, తక్కిన అన్ని కులాల వారికీ వొక పెద్దదీ – మంచివనీళ్ళ చెరువులు రెండున్నాయావూళ్ళో.

ఒకటే పెద్ద చెరువు నాలుగుభాగాలు చేసి, మూడు భాగాలొకటీ, వొక్కభాగమే అయేట ట్టొకటీ గట్టు పొయ్యగా యేకకాలాన యేర్పడ్డ చెరువు లవి.

పెద్దచెరువు నిలవనీరు పోవా లంటే, చిన్న చెరువే అందుకు దారి.

చిన్న చెరువులోకి కొత్తనీరు రావాలంటే పెద్ద చెరువే అందుకు మార్గం.

